# స్వార్థత్యాగి

(చరిత్రాత్మక నవల)


సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ,

బూరుగల గోపాలకృష్ణమూర్తి.





రాజహంస పబ్లికేషన్సు

హైద్రాబాదు (దక్కన్) :: తెనాలి

1950

# స్వార్థత్యాగి

(చరిత్రాత్మక నవల)



సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ,

బూరుగల గోపాలకృష్ణమూర్తి,

ఆంధ్రోపాధ్యాయుడు,

తాలూకా హైస్కూలు, తెనాలి.



రాజహంస పబ్లికేషన్సు

హైద్రాబాదు (దక్కన్) :: తెనాలి

కాపీరైటు] 1950 [మూల్యము: 1-2-0

# మొదటి మాట

భారతీయేతిహాసములయందు రాజపుత్రుల చరిత్రలు పరాక్రమాభిమాన పాత్రంబులై యొప్పుచున్నవి. మొగల్ గాఢజీమూతములు సమస్తభారతమును నాక్రమించునాయును క్షాత్రాగ్ని జాజ్వల్యమానముగఁ బ్రజ్వలించుచునేయున్నది. మొగలాయీ ప్రభువులలో నగ్రగణ్యుఁడైన యక్బరు సార్వభౌమునకే మహోజ్జ్వలమైన యాప్రజ్వలన మార్పుట శక్తికిమించిన పనియయినది కదా!

ఈ నవలయందుఁ జిత్రింపఁబడిన చరిత్ర యౌరంగజేబు కాలమునాటిది. ఆనాటి ప్రభుభక్తులలోను, దేశభక్తులలోను దుర్గాదాసు ప్రథమగణ్యుఁడు. అతని ప్రభుభక్తిని, దేశభక్తిని విలువఁగట్టఁగల గీటురాయి మృగ్యము. ఆమహావీరుని స్వార్థత్యాగమే నాటికి నేటికి నజరామరమై ప్రకాశించుచున్నది. పరాక్రమధని యైన యా మహావీరుని యతివేలములైన సాహసౌదార్యపరాక్రమములు నేఁటికి భారతీయేతిహాసరంగమునఁ జెక్కుచెదరక నిలచియేయున్నవి.

స్వతంత్రవాతావరణములో విహరింప నువ్విళ్ళూరుచున్న భారతజాతికి శాంతిధనుని యమోఘమైన యహింసానియతిచే స్వతంత్రము లభించినది. దరిదాపు మూఁడువందల సంవత్సరములకు లభించిన స్వతంత్రప్రభుత్వమును నిలబెట్టుకొనుటకై కార్యశూరులును, స్వార్థత్యాగులును, దేశభక్తిపరాయణులునునైన మహాత్ముల యావశ్యకత యధికముగఁగన్పట్టుచున్నది. అట్టితఱినిట్టిచరిత్రల కొంతవఱకు నుపయోగింపఁగలవను నుద్దేశముతో నీచరిత్ర రచింపఁబడినది. రసజ్ఞమైన పాఠకలోకము, విద్యావిషయమై ప్రత్యేక శ్రద్ధవహించుచున్న ప్రభుత్వము, ఈ నాకృషికిఁ దప్పక చేయూతనిచ్చునని యూహించుచున్నాను.

ఇట్లు

రచయిత



అవి ఔరంగజేబు తనకృత్రిమపుటాలోచనచేఁ బిత్రు సోదరులను జంపి సమస్తభారతవర్షమును బాలించురోజులు. భారతప్రజానీకమంతయు ననైక్యతచేఁ బరదాస్యశృంఖలములలోఁ జిక్కి స్వీయవ్యక్తిత్వమును రక్షించుకొనలేక యుక్కిరిఁ బిక్కిరగుచున్న రోజులు.

అట్టిరోజులలో నొకనాటి యుషఃకాలమున ఢిల్లీ పరిసరారణ్యమునం దొక యోధుఁడశ్వారోహియై ఢిల్లీకభిముఖముగఁ జనుచుండెను. ఆతఁడు చనువేళకింకనుఁ గనుచీకటి వదలలేదు. పక్షులన్నియుఁ బ్రకృతివైచిత్ర్యమును వ్యాఖ్యానించుచు నాహారాన్వేషణకై యిచ్చవచ్చిన దిక్కునకుఁ బోవుచుండెను. ప్రకృతికాంత చిఱువెలుఁగుల నవ్వుల నెల్లడల విరఁజిమ్ముచున్నది. సూర్యుని యభ్యుదయమును దెలుపుఁ బతాకయోయన నెఱ్ఱజాలు తూర్పుదెస నలముకొన్నది. ప్రభువును జూచి పరుగిడుఁ జోరులవలె నక్షత్రములన్నియు నినుని యాగమనముచే మటుమాయమగుచుండెను. తనకంటెఁ బ్రబలునిఁ జూచి నీళ్లునములు భీతనిరీతిఁ జంద్రబింబము సూర్యబింబము ముందు వెలవెలఁ బోవుచుండెను. సూర్యుని లేయెండ పడుటచే నా యరణ్యమంతయు బంగరుమలాము చేయఁబడినట్లు ప్రకాశించుచుండెను. ఎండిన యా యటవీవృక్షములు బాలవృక్షములకుఁ దమ యనుభవములఁ జెప్పుచున్నవా యన్నట్లుగ నెండుటాకుల మర్మర ధ్వనినిఁ జేయుచున్నవి.

జలముల జలజల చప్పుడులతోఁ బ్రవహించు సెలయేఱులు స్వాతంత్ర్య సిద్ధిచే సంతోషించుచున్న భారతమాత చెక్కిళ్ళ మీఁదనుండి స్రవించుచున్న యానందబాష్పముల పరంపరల వలె నుండెను. ప్రకృతి యంతయందముగ నున్నను మన యశ్వారోహి యారమణీయదృశ్యముల నిలకడతోఁ జూడకయే మనమున నేదియో ధ్యానించుకొనుచు నేగుచుండెను. అతఁడధిష్ఠించిన యశ్వ ముత్తమజాతికిఁ జెందినది. దానిపేరు విజయము. ఆ నాటివఱకు దానికొకపజయము నెఱుఁగక పోవుటచే నాపేరు దానికి సార్థకమే. ఆ తురగము యజమాని చిత్తవృత్తిని గుర్తించుటలో దిట్ట. అందువలన నది ధ్యానమగ్నుఁడైన యజమాని తనను సరిగఁ దోలకపోయినను నాతని మనస్సెఱింగి తెక్కలులేని పుష్పకమువలెఁ బరుగిడి పోవుచుండెను. ఆ రౌతుమోమునుఁ దిలకించినను, నాతని యాజానుబాహువుల నాలోకించినను, దీర్ఘమైన యాతని ఖడ్గరాజము నుపలక్షించినను, మెలితిరిగిన యాతని కోరమీసముల నవలోకించినను, నాతఁడొక మహావీరుఁడని చూడగనే తెలియుచున్నది. అతఁడట్లు పోవుచుఁబోవుచు నడుమ నడుమ నాకుంచితభ్రుకుటియై తీక్ష్ణముగ నాలోచించుచుండెను. ఆచూపునందలి యావేశ మాతనికిఁగల కార్యవ్యగ్రతను సూచించుచుండెను. వాడికలిగి మెఱయుచున్న యావీరుని బల్లెమును జూచిన నెట్టివాఁడైన నావలించవలసినదే.

గంటప్రొద్దెక్కునప్పటికి మన యశ్వారోహి ఢిల్లీసమీపమునకు వచ్చెను. అంతవఱకు శరవేగముతోఁ బోవుచుం

డిన యాతని విజయము, యజమాని కళ్ళెమును లాగుటచే గమనవేగమును దగ్గించెను. కాతు గుఱ్ఱమును మెల్ల మెల్లగ నడిపించుచుఁ బలుమాఱులు వెనుకకుఁ జూచుచుండు టను బట్టి యాతఁ డెవరియాగమనమునో యపేక్షించుచుండె నని తెలియుచున్నది. గావలసిన వ్యక్తి రాకపోవుటచే నశ్వారోహి యశ్వమునుండి దిగి, యొకవృక్షచ్ఛాయను గూర్చుండి యిట్లనుకొనసాగెను.

'ఓయీ! ఔరంగజేబూ! నీవింతటి కృతఘ్నుఁడవని నే నిదివఱలోఁ దెలియకుంటిని. 'తిన్న యింటివాసములు లెక్కపెట్టి నట్లు' నిన్నుఁగాపాడి, నీసేనఁజేయు జస్వంతసింగునకే యప కారమొనర్చితివికదా! మా ప్రభువైన జస్వంతసింగు నిన్నెన్ని యాపదలనుండి రక్షించెను! ఆ మహానీయుని భుజాస్కంధమే నీసామ్రాజ్యరక్షణకుఁ గంచుఁగోట యయినదికదా! ఆవీర వరుఁడే నీకు వ్యతిరేకియైన దిగన్తవిశ్రాంతమైన నీ యశోలక్ష్మి పురిటిలోనే యస్తమించి యుండెడిది.

'ఓయీ! యవనచక్రవర్తీ! నీకిప్పటికైన రాజపుత్రుల ధైర్యసాహసములు తెలిసినవా? సింహపరాక్రముఁడై నీకసా ధ్యుఁడైన మాప్రభువరేణ్యునిఁ బ్రత్యక్షముగ సాధింపలేక, యీ కృత్రిమవిధిలో సాధించితివా? నీ రాజకీయతంత్రము మాత్రము మెచ్చఁదగినదే! నిన్నెదిరించి నీకుఁ గప్పము చెల్లిం చుట మానిన కాబూలీయులను జయింపలేక వారి నణఁ గించుటకై శత్రుకంఠవిలుంఠనక్రియాదక్షుఁడైన మా జస్వంత సింగు నాకాబూల్ దేశమునకుఁ బంపితివి! ఏమి! నీ నీతికుశలత!

మా ప్రభువు మరణించెనా! యసాధ్యుఁడైన నీ యావీరుఁడొక్కఁడు మరణించినట్లగును. కాబూలీయులు లోఁబడిరా! నీచక్రవర్తిత్వప్రభావము తిరిగి వారిపై స్వాప్తి చేయును. ఇఁకను శత్రువులలో నెవరు నరించినను మంచిదని యేకదా నీ యుద్దేశము! ఓ ప్రభూ! ఈ గోముఖవ్యాఘ్రము మాటలు విశ్వసించి ప్రభుభక్తిపరాయణుఁడవై, ప్రాణముల నాసింపక, మా తోఁపాయకులైన యాకాబూలీయుల దేశములో మరణించితివా! మరణశయ్యపైనుండిగూడ స్వామికార్యసాధనకై శత్రుపరంపరలతోఁ బోరాడి పోరాడి, విజయమును సాధించి, మా దుష్టున కిచ్చి, నీవు వీరస్వర్గమునుఁ బొందితివికదా! 'ఒకదెబ్బకు రెండు ఫలముల'న్నట్లుగ నొక కుయుక్తితో నీ దుష్టుఁడైన యౌరంగజేబు రెండు లాభములను బొందినాఁడు. ఈ యన్యాయాన్వీత దీర్ఘకఠోరవార్తా శ్రవణముచే నా గుండెలు మండిపోవుచున్నవి. కేవలము మా ప్రభువును జంపుటయే కాక మా ప్రభుజ్యేష్ఠపుత్రుఁడగు పృథ్వీసింగునుగూడ గౌరవించు నెపమున నాస్థానమునకుఁ బిలిపించి విషసమ్మిశ్రవస్త్రద్వయము నొసఁగి ఘోరాతిఘోరముగఁ జంపితివికదా! ఔరంగజేబూ! ఈ నీదుర్నయములన్నియు నింకెంతకాలము సాగగలవులే? 'చెట్టుచెడు కాలమునకుఁ గుక్కమూతిపిందెలు పుట్టు'నన్నట్లు, చెడు కాలము దాపురించుటచేతనే నీకీ చెడుబుద్ధులు పుట్టుచున్నవి. ఈ దుర్గాదాసుకంఠమునఁ బ్రాణములున్నంతవఱకు నీయపకార మూరక పోదని యెంచుము. ఈ స్వామిభక్తుని మేని రుధిరములో నాఖరుబిందువుగూడ స్వామిభక్తిలోనే యింకి

పోవునని యెంచుము. చక్రవర్తీ ! నీ పరాజయమునుఁ గన్నులారఁ గాంచినప్పుడుగాని యీ రాఠోరువీరుని హృదయ కుండములో జాజ్వల్యమానముగ ప్రజ్వలించుచున్న కోపాగ్ని తాప ముపశమింపదు. గతవిషయములఁ దలచుకొన్నకొలఁదిని యావేశము మిటిమీరుచున్నది. ఈ యావేశము ప్రస్తుతకార్య పరిపంథి కాఁగలదు. ఇప్పటికీ క్రోధమును దిగమ్రింగి శాంతము నవలంబింపవలెను. ప్రస్తుతపరిస్థితులనుబట్టి యొంటరిగఁ జక్రవర్తి సమక్షమునకుఁ బోవుట మంచిదికాదు. అందుకనియే తగినయేర్పాట్లను జేసికొనియే పోవుచుంటిని. మరణమన్నను రణమన్నను నాకుభయ మే మాత్రము లేదు. కానీ ప్రస్తుతమనాథమైయున్న మా ప్రభుకుటుంబముకొఱకు నేను బ్రతుకవలెను. తప్పక బ్రతుకవలెను. ప్రభుహంతకుని నవమానించి సర్వస్వమైన నాయజమాని కాత్మతృప్తినిఁ గలిగింపవలెను. త్రోవలోఁ గారణాంతరముపై నాగిన సమరదాసింకను రాలేదే! కారణ మేమైయుండును? ఎంతయాలోచించినను బాదుషా నన్నేల పిలువనంపెనో తెలియుటలేదు. మార్వాడనపహరించుటకా? ఏమో ! రాజులేనేలేడు; సేనాపతినైన నన్ను బంధించుటో వధించుటో జరిగిన రాజ్యము తేలికగ దక్కునుగదా ! భగవంతుని కృపాలేశము నాకండగానుండినఁ జాలును. ఇట్టి పాదుషాలఁ బదిమంది నేడ్పింతును గాని నేబట్టుపడుదునా! ఢిల్లీలోఁగాక, మారాజ్యమునకుఁబోనీక, మాప్రభుకుటుంబమును రాజధానికిఁ బదునేను మైళ్ళదూరములోనున్న యొక పల్లెలో నుంచుటలో నీతనియుద్దేశమేమి? పాదుషా కందు

చాటులో నున్నంతవఱకుఁ బ్రభుకుటుంబమునకు క్షేమములేదు. 'కీడెంచి మేలెంచుట' మంచిదని ముందుగనే తగుజాగ్రతఁదీసి కొనుచుంటిని. విధియెట్లున్నదో ! అదుగో ! సమరదాసు వచ్చు చున్నాడు. 'సమరదాసా ! ఏమింతాలస్యముచేసితివి? మఱేమి విశేషములు లేవుకదా?'

'లేకేమిసోదరా, కారణముండఁబట్టియే యాలస్యము చేసితిని. పాదుషా ప్రభుకుటుంబమును బందీచేయఁ దలచినాడట. ఈ విషయమిప్పుడే రాజధానినుండి వచ్చినమనరహస్యచారుఁడు చెప్పినాడు,'

'ఔరా? ఏమి వీనిదుగాగతము!తమ్ముఁడా! మనికేమియు భయములేదు. రాణి, యామెసంతానము, ప్రస్తుతము మన యధీనమందే యున్నదికదా ?

'అన్నా ! పాదుషా 'ఆమెను సమర్పింపు'మని యడు గుటకే నీకుఁ గబురంపియుండును.

నాస్వహస్తములతోఁ బ్రభుపత్నిని బట్టి యప్పగింపు మనియా యూరంగజేబడుగుట! అయినకావచ్చు! అడిగిన నడుగనిమ్ము ! మనము భయపడవలసిన యవసర మేమాత్రము లేదు. సమరదాసూ! నేఁజెప్పిన యేర్పాట్లన్నియుఁ జేసివచ్చి తివా?'

'ఆ, అన్నియుఁజేసివచ్చితిని,

'అయిన మన కేమియు భయములేదు. చక్రవర్తి కబు రంపిన రాలేదన్న నేరము మనపైనేలయుండవలెను? రమ్ము-పోదము.

## ౨

రాజపుత్రస్థానమున నున్న రాజ్యములలో షాజహాన్ కాలమునాఁటికి మార్వాడదేశ మగ్రగణ్యమై యొప్పుచుండెను. ఆదేశమును జస్వంతసింగను రాజపుత్రవీరుఁడు పరిపాలించుచుండెను. ఆరాజు, ప్రబలప్రతాపాన్వితుఁడు. ఆనాటి మహమ్మదీయప్రభువగు షాజహాన్‌చక్రవర్తి కూడ నాతని బలపరాక్రమములకు వెఱచి మంచితనముచే నాతని మిత్రునిగాఁ జేసికొనెను. ఈ రాజవీరుఁ డింత పరాక్రమవంతుఁడైనను నాఁడు రాజపుత్రస్థానమున నున్న యనైక్యతను, స్వార్థపరతనుఁ జూచియు,నానాటికి పాతాళమువఱకు వ్రేళ్ళుపాతుకొని పోవుచున్న మహమ్మదీయ మహావృక్షమునుఁ జూచియుఁ,జక్రవర్తి చక్రవర్తిత్వమును నామమాత్రమున కంగీకరించి, యాతనికి మిత్రుఁడుగా నుండెను. ఈమహారాజునకుఁ గనుసన్నలలో మెలఁగగల యుక్కుతునకల వంటి రాజపుత్రసైన్యము ముప్పదివేలవఱకుఁ గలదు,

ఆనాటిభారతచక్రవర్తి షాజహాన్. అతనికి - దారా, మురాద్, ఔరంగజేబు, షుజా - అనునల్గురుపుత్రులుగలరు. వీరిలో జ్యేష్ఠుఁడగు దారా, చక్రవర్తిసమక్షముననే యుండి రాజ్యపాలనయందుఁ దండ్రికిఁ గుడిభుజముగ నుండెను. చక్రవర్తి యుక్తవయస్కులైన తనపుత్రుల నింటిదగ్గఱ నుండనీయలేదు. అట్లుండనిచ్చిన వారిలో వారు కలహించుకొందురని చక్రవర్తి యభిప్రాయము. అదియునుఁగాక కుమారుల నింట

నుంచుకొన్న సోమరులగుదురను భయములో మురాదును గుజరాత్ దేశమునకును, ఔరంగజేబును దక్షిణప్రాంతమున కును, షుజాను వంగప్రాంతమునకును, సుబేదారులనుగ నియ మించెను. వారు మువ్వురును దండ్రియాజ్ఞ కెదురాడనోడి యా యా దేశములకుఁ బాలకులుగ నుండిరి.

కాలచక్రము నిరంతరము పరిభ్రమించుచునే యుండును. దాని వేగము నాపగలవాఁడు, ఈరేడు లోకములందును లేఁడు. ఆ చక్రభ్రమణములోఁ గ్రిందు మీఁదును, మీఁదు గ్రిందును, నగుచుండును. వసంతముతరువాత గ్రీష్మము, గ్రీష్మముతరువాత వసంతమును వచ్చుచునేయుండును. ఒకప్పుడు ఖరకిరణుండైన ఖరకిరణుఁడు తీవ్రాతపజ్వాలలచే లోకము నాకులముఁజేసియుఁ, గొండొకప్పుడు మందీభూత తేజుఁడై సామాన్యపరిస్థితి నందుచునే యున్నాఁడు.

షాజహాన్ బహువిధోపాయ పరంపరలచేఁ దండ్రిని సోదరులను వంచించి తాను చక్రవర్తికాఁగలిగెను. అటుపిమ్మట నిరంకుశుఁడై కొన్నివసంతములు రాజ్యమేలెను. కాని కాల చక్రప్రభావమున నామహాచక్రవర్తిగూడ ప్రాణిసామాన్యము వలెనే వార్ధక్యమునుఁబొందెను. ఎంతవాఁడైనను ప్రాణిపరి మాణముల నతిక్రమింపలేఁడుగదా!

షాజహానునకు దీర్ఘరోగమొకటి శరీరమునఁ బ్రవే శించినది. దానికి జర కొంచెము చేయూతనిచ్చినది. దానితో నాతఁడు పూర్తిగ మంచముపట్టినాఁడు. క్రమక్రమముగా వ్యాధి ముదురుటచే నా చక్రవర్తి కొంతకాలమునుండి యమబాధపడ

సాగెను. ఈ యదనుఁ గనిపెట్టి రాజ్యాకాంక్షియైన దారా వెంటనే తండ్రినిబంధించి సింహాసన మాక్రమించినాఁడు.

షాజహాను చక్రవర్తి బంధనవార్త పిడుగువలె భయంకరముగ దశదిశల వ్యాపించినది. ఆవార్త వినుటతోడనే భయగ్రస్తులయి కప్పమునుఁ గట్టుచున్న కొందఱు సామంతులు కప్పముఁ గట్టుట మానివేసిరి. చోరాదులు విజృంభించిరి. రాజ్యమంత దరాజకము ప్రబలఁజొచ్చెను. ఈ భయంకర విపత్సమయమునుఁ జూచి దారా వెంటనే సైన్యమును స్వాధీనము చేసికొని గద్దెనాక్రమించినాఁడు అంతకుముందే యాతఁడు యువరాజుగా నుండుటవలనఁ బౌరులుగాని, మంత్రులుగాని, తదితరులుగాని దారా నేమియు అడ్డగింపరైరి.

క్రమక్రమముగా నీవార్త దక్షిణమునకు, వంగదేశమునకు, గుజరాతునకుఁ, బ్రాకిపోయినది. చక్రవర్తికుమారులలో నందరికి రాజ్యకాంక్ష మితిమీరిపోయినది. గుజరాతునేలుచున్న మురాదు విలాసప్రియుఁడు. అయిన నతఁడు యుద్ధమునం దతి సాహసము కలఁవాడు. ఈ వార్తను వినగనే యాతఁడు కోపించి తనసైన్యములతో ఢిల్లీపైకి దాడివెడలెను. దక్షిణప్రాంతము నేలుచున్న యౌరంగజేబు మిక్కిలి మాయలమారి. కార్యదక్షుఁడు. అతఁడునుఁ దనసైన్యములతో ఢిల్లీపైకి వెడలినాడు. ఇట్లే న్యాయదక్షుఁడని పేరువడసిన షుజాయును బెంగాలు ప్రాంతమునుండి బహుళ సేనాపరివృతుఁడై యుద్ధమునకు సిద్ధమయినాఁడు,

కపటియైన యౌరంగజేబు నెదిరించుటకై దారా తమకు మిత్రుఁడుగనున్న జస్వంతసింగును బంపెను. జస్వంతసింగు తనరాజపుత్రసైన్యమును దీసికొని హుటాహుటిగాఁ గతిపయ దినములలో నర్మదానదీ తీరమునకుఁ బోయి యచ్చట నౌరంగజేబు రాకకై వేచియుండెను.

రాజ్యతంత్రధురీణుఁడును మాయావియు నైన యౌరంగజేబు దారాపక్షమునఁ దన్నెదిరించుటకు జస్వంతుఁడు వచ్చుచుండె నని చారులవలనఁ దెలిసికొనెను. ఔరంగజేబునకు జస్వంతుని బలపరాక్రమములు బాగుగఁ దెలియును. ఐనను సాహసించి తనసైన్యముతో జస్వంతు నెదురించుటకై నర్మదా తీరముఁ జేరినాఁడు. కాని, జస్వంతుని సైన్యమునుఁ జూచి భయపడి, తానొంటరిగఁ దలపడుటకంటె మురాదు సైన్యములతోఁ గలసి తలపడుట మేలని యెంచి, కొంత వెనుకకుఁ బోయి, మురాదు కొఱకై నిరీక్షించుచుండెను. కొంతసేపటికి మురాదు తన సైన్యములతో వచ్చి యౌరంగజేబును గలసికొనెను. ఔరంగజేబు తనకు రాజ్యమక్కర లేదనియు, మక్కామసీదులో నమాజుచేయుచుఁగాలముఁ గడుపవలెనని కలదనియు, భ్రాతృభక్తి ప్రేరేపింప నన్నగారికి సహాయముచేయుటకు వచ్చితి ననియు మురాదుతోఁజెప్పెను. త్రాగుబోతైన మురాదా మాటలను నమ్మి తనసైన్యమునుఁగూడ నౌరంగజేబు స్వాధీనముఁజేసి తాను భోగములలో మునిగి యుండెను. ఆయదను గ్రహించి యౌరంగజేబు రెండు సైన్యములకుఁ దానే నాయకుఁడై సైన్యమును నడిపించుకొనుచు వచ్చి నర్మదానది కావలి దిక్కున స్కంధావారములు వేయించెను.

రాజపుత్ర వీరులకుండు సహజమైన యహంకారము జస్వంతునిలో రెండురెట్లధికముగ నున్నది. ఔరంగజేబు మురాదుసైన్యముతోఁ గలియ నప్పుడే జస్వంతుఁ డౌరంగ జేబుపైఁ బడిన జయము తేలికగా లభించియుండును. కాని గర్విష్ఠియైన జస్వంతుఁడు, ఔరంగజేబు మురాదుతో కలియు వఱకుఁ దా నూరక చూచుచుండెను. అన్నదమ్ముల సైన్యము లేకమై, యజేయములైపోయినవి.

సోదరద్వయము తమ సేన నాయత్తపఱచి నర్మదా నదినిఁ దాటి జస్వంతునిపైఁ బడవలెనని సంకల్పించినది. అందుకై వందలకొలఁది పడవలనుఁ దెప్పించి ముందుగా గొన్ని పడవలలో సైనికుల నెక్కించి నదిదాటుటకుఁ బ్రయత్నించినది. ఇంతలో జస్వంతుఁడు తనసైన్యమునకుఁ బడవలఁ బడగొట్ట నాజ్ఞాపించినాఁడు. రాజపుత్రసైనికు లొక్కుమ్మడి శరవర్షమును, ఫిరంగిగుండ్లనుఁ గురిపింపసాగిరి. ముందుకు వచ్చుటకు మహమ్మదీయసైన్యమును, వెనుకకుఁ దఱుముటకు రాజపుత్ర సైన్యమును దీక్షఁబూనినవి. రణరంగమును వివాహమండపముగా నెంచు రాజపుత్రుల దీక్షముందు, మహమ్మదీయుల ధైర్యము కఱిగి పలుచనై పరుగెత్తసాగినది. హరహరార్భటులతో మారణాస్త్రవర్షమునుఁ గురిపించుచున్న రాజపుత్రుల ధాకకు, బయలుదేరుచున్న ప్రతినావయు నదీతరంగములచే జోకొట్టఁబడి నర్మదాగర్భమున దీర్ఘవిశ్రాంతినిఁ దీసికొనఁ జొచ్చినది. ఎంత ప్రయత్నించినను మహమ్మదీయసేన మరణించుటదక్క యొక్కయడుగైన ముందుకు రాలేకపోయినది. ఈ

యవస్థనుఁజూచి యౌరంగజేబిక లాభము లేదని తలఁచి తమసేనకు వెనుకకు మరలుమని యాజ్ఞ ఇచ్చెను. శత్రుసైన్యము వెనుకకుఁ దగ్గుటతోఁబాటు క్షాత్ర తేజస్సును శాంతించినది. జయము లభించినదిగదా యని రాజపుత్రులందఱు తమతమగుడారము లలో విశ్రమింపఁజొచ్చిరి.

ఔరంగజేబు హృదయములోఁ బరాభవానలము మండఁజొచ్చెను. న్యాయముగానో, యన్యాయముగానో జయ మునుసంపాదించినఁ గాని యాతని హృదయము శాంతించునటుల లేదు. పరాభవము కంటె సామ్రాజ్యాపేక్ష యాతని నెక్కువగా బాధింపసాగినది. కంటనిదుర లేదు. ఉపాయము తోచుట లేదు. విచారించి విచారించి తుదకాతఁ డొకనిశ్చయమునకు వచ్చెను. తానొక యర్ధరాత్రమునఁ గొంతసైన్యమునుఁ దీసికొని పది పండ్రెండుమైళ్ల దిగువునకుఁ బోవలెను. మురా దిచ్చటనే యుండి నది దాటుటకుఁ బ్రయత్నించుచున్నటు లుండవలెను. ఇంతలోఁ దానునదిని దాటివచ్చి వెనుకనుండి రాజపుత్రుల ముట్టడింపగా ముందునుండి మురాదు నదిని దాటి రాజపుత్రులపైఁ బడవలెను; ఈ యుపాయము నౌరంగజేబు మురాదుతోఁ జెప్పఁ నాతఁడును సమ్మతించెను.

సూర్యుఁడు పగలంతయుఁ దిరిగిన శ్రమ వాపుకొనుటకై చరమనగ గుహాంతరమునఁ బ్రవేశించెను. చీకట్లు నలుదిశల వ్యాపించినవి. విజయగర్వోన్మత్తులైన రాజపుత్రులుతమతమ శిబిరముల నిద్రించుచుండిరి. ఆసమయమును గనిపెట్టి యౌరంగ జేబు తాననుకొన్న ప్రకారము దిగువకుఁబోయి నదిని దాట

సాగెను. పడవలన్నియు నొక్కసారిగాఁ దెరచాపలతో నావలి యొడ్డునకుఁ బోవుచున్నవి. రాజపుత్రులకీవిషయ మూావం తయుఁ దెలియదు. మీఁదుమిక్కిలి వారు, ఔరంగజేబు మురా దులు తమకు భయపడి గుడారములఁ బెకలించుకొని పోవఁ బ్రయత్నించుచుండిరనియుఁ దలపసాగిరి. ఇంతలోఁ గ్రమముగ మహమ్మదీయుల నావలన్నియు నావలిగట్టునకుఁ జేరినవి. ఇచ్చట మురాదు 'ఔరంగజేబెప్పుడు వెనుకనుండివచ్చునా, తానెప్పు డీవలనుండి నదినిదాటుదునా' యని యాలోచుచుండెను. ఇంతలో నొకపెట్టున నౌరంగజేబు వెనుకనుండి రాజపుత్రులపైఁబడెను. రాజపుత్రులకు నిద్రనుండి మేల్కనుటకుఁగాని మేల్కన్నవారికి శస్త్రముల ధరించుటకుఁగాని, వీలుకలుఁగలేదు. ఆప్రళయ మునుఁ జూచి రాజపుత్రులు విభ్రాంతులై చకచక దొరకిన శస్త్రములఁ దీసికొని మహమ్మదీయులపైకిఁ బోఁదొడంగిరి. లేచిన వారిని లేచినట్లే మహమ్మదీయులు నఱుకుచుండిరి. అదేసమయమున మురాదు నర్మదానదిని దాటి ముందుభాగ మునుండి రాజపుత్రుల నెదుర్కొనెను. ఈ మోసము రాజ పుత్రులకేమియుఁ దెలియదు. పాపము! వారు 'అడకత్తెరనడుమఁ బడిన పోకచెక్కవలె' నౌరంగజేబుమురాదుల సైన్యమధ్యమునఁ బడి నలుఁగఁజొచ్చిరి.

పోరు ఘోరమైనది. తొలుత కొంతవఱకు నిలువ గలి గినను రాజపుత్రసైన్యము నిద్రమత్తువలనను శస్త్రములు దొర కక పోవుటవలనను మహమ్మదీయులధాటికినిలువలేకపోయినది. తెల్లవాఱు జామువఱకు జస్వంతుఁడు తనసైన్యములఁ బరిశీలించి

నాఁడు. అప్పటికిఁ దరిదాపుగా రాజపుత్రసైన్యమంతయు నేల పాలయినది. ఇఁక నాలసించినఁ దనకుఁ బ్రాణముగూడ దక్క దని యూహించి జస్వంతుఁడు మిగిలిన యోడునందలసైనికులతో యుద్ధరంగమును వీడి స్వదేశమైన మార్వాడకు పలాయనముఁ జేసెను.

జస్వంతసింగు మార్వాడ సమీపింపకముందే యాతని యపజయవార్త దేశమంతయు వ్యాపించినది. అవమానకర మును, క్షాత్రమునకు కళంకపంకసంపాదకమును నైన, యీయమం గళవార్త క్రమముగా నానోట నానోటఁబడి చివరకు జస్వం తుని భార్యయైన మహామాయ చెవినిఁగూడఁ బడెను. కర్ణ విదారకమైన యావార్త చెవినిఁ బడినంతనే రాణి యాపాద మస్తక మొక్కసారి కంపించినది. ఆమె సుక్షత్రియుల యింటి యాడబడుచు. పరాజయముకంటె మరణ మన్నివిధముల యుత్తమమని యామెయూహ. ఆమె 'యీవార్త నిజమగునా! నానాథుడే యపజయమునుఁ బొందెనా! క్షత్రియకులాలంకారు డని ప్రసిద్ధిపొందిన నాభర్తయే క్షత్రియకులాంగారమయ్యెనా! అహా! ఏమి విధిచెయిదము!' అని వేడినిట్టూర్పులు విడువ సాగెను. ఈ విధముగ నారాణి కొంతకాలమువఱకు కింకర్త వ్యతా విమూఢయైయుండి యొక్కసారిగా జరాలున లేచి 'ఎవరక్కడ?' యని పలికెను. వెంటనే రాజభటులు కొందఱు వచ్చి భయంకరాకారయై మహాకాళినిఁ బోలియున్న రాణినిఁ జూచి నిశ్చేష్టులయిరి. అంతట నారాణి భటులతో "ఓరీ! దుర్గద్వారములఁ బంధింపుఁడు. పరాజయావమాన కళంకాం

కిత జీవుఁడైన వాఁ డెవఁడైనను దుర్గములో నాతనికిఁ బ్రవే శము లేదు. పొండు! దుర్గద్వారముల బంధింపుడు!" అని యనెను. గత్యంతరము లేక భటులట్లే దుర్గద్వారముల మూసివైచి యప్రమత్తులై కాపలా కాయుచుండిరి.

జస్వంతుఁడు హతశేషులయిన సైనికులతో దుర్గద్వార మును సమీపించినాఁడు ఆతఁడు వచ్చునప్పటికే పూర్వ ద్వారము మూయబడి యున్నది. ఆద్వారమేదియో కార ణాంతరమున మూయబడి యుండెనని జస్వంతుఁడు పశ్చిమ ద్వారమునకు బోయినాఁడు. అదియు మూయఁబడియే యున్నది. ఇట్లే దక్షిణోత్తర ద్వారములుఁగూడ మూయఁ బడియుండుటచే నాతని కనుమానము మెండైనది. బురుజులపై నున్న భటులను ద్వారము తెరువుడని కేకలు వేసినాడు. ఆభటులు, "తాము రాణీగారి యాజ్ఞవలన ద్వారములను మూసితిమనియు, విజయపరాఙ్ముఖుఁడైన వానికిఁ దన యాజ్ఞ యగునంతవఱకు దుర్గప్రవేశార్హత లేదనియు, రాణిగారు చెప్పి మని"రనియుఁ జెప్పిరి. ఆమాటలవిని రాజు హతాశుఁడై వెనుఁదిరిగిపోయి నగరము వెలుపలనున్న దేవాలయములో నివసించెను. రాణియొక్క పంతము నెఱిగిన వాఁడైనను, నూరుకొనఁజాలక యెన్నియో యనునయవార్తల నంపినాడు. కాని యవియన్నియు వ్యర్థములే యైనవి. జస్వంతునకు నప జయముకంటె భార్యచేసిన యవమానమే మిక్కిలి బాధాకర మైనది. ఆ బాధతో నాతఁడు మంచమెక్కినాడు. మనో వ్యాధికి మందు లేకపోవుటవలన నావ్యాధి ముదర నాతఁడు

ప్రాణావశిష్టుఁడయ్యెను. ఆవార్త విని రాణి యప్పటికి కోప ముడిగి, దుర్గద్వారము తెఱపించి, స్వయముగఁ బాదచారిణియై దేవాలయమునకుఁ బోయి, ఇఁక జీవితములో నెన్నడు శత్రువులకు వెన్నుఁజూపనని భర్తచేఁ బాసచేయించుకొని యాతనిని స్వభవనమునకుఁ దీసికొనివచ్చెను.

మాయోపాయ ధురీణుఁడైన యౌరంగజేబు, అఖండ ప్రజ్ఞకల సోదరి రోషనార సహాయముతో సోదరులను మట్టుపెట్టి చక్రవర్తియయ్యెను. కాని తనచే నోడింపఁబడిన జస్వంతుఁడు పరాభవము తీర్చుకొనుటకై తన నేమిచేయునో యను భయమున నాతనిని సాదరముగఁ దనయాస్థానమున కాహ్వానించి సైన్యాధిపత్యమిచ్చెను. బలదర్పముల నధికుఁడును నిరంకుశుఁడునైన జస్వంతుఁడు పాదుషాకుఁ బక్కలో బల్లెమువలె నుండెను. ఆతని పీడ యెట్లువదలునాయని యాలోచించుచున్న పాదుషాకు సమయమొకటి చిక్కినది. అంతవఱకు నౌరంగజేబునకుఁ గప్పము కట్టుచుండిన కాబూలీయులు పాదుషాయాజ్ఞ తిరస్కరించి కప్పముకట్టుట మానిరి. వారజేయులు; వారిని సాధించుటయన్న సామాన్యమైన పనికాదు. ఆనాటి బలాధికులలోఁ గాబూలీయులను సాధించుటకు జస్వంతుఁడే సమర్థుఁడు. ఇరువురు శత్రువులలో నెవరు నశించినను మంచిదే! యని తలచి యౌరంగజేబు సామోక్తులతో జస్వంతుని గాబూల్ దేశముపైకిఁ బంపెను. ఔరంగజేబు నాజ్ఞప్రకారము జస్వంతుఁడు కాబూల్‌పై దండెత్తెను. అష్టకష్టములతోఁ జస్వంతుఁడు కాబూలును జయించెను. కాని యచ్చటి రోగముల వాతఁ

బడి యాతఁడు తన భౌతిక శరీరమును వదలెను. ఆ వార్త విని యౌరంగజేబు లోపల నెంతయో సంతసించెను. జస్వంతుఁడు మరణించినఁ జక్రవర్తికిఁ గొంతలాభమే సిద్ధించినది. కాని యాతని పుత్రులిరువురు మరణించినఁగాని జస్వంతుని రాజ్యము పూర్తిగఁ దనకుఁదక్కదు. అదియునుగాక గులనారు మహామాయను దనకప్పగింపవలెనని పట్టుబట్టుచున్నది. ఈ ప్రయోజనములన్నియు నెఱవేఱుటకై చక్రవర్తి జస్వంతుని కుటుంబమును ఢిల్లీకిఁ బిలిపించెను. మహావీరుఁడును, స్వామిభక్తుఁడును నైన దుర్గాదాసు చక్రవర్తియందు నమ్మకములేనివాఁడగుటవలనఁ దనప్రభుకుటుంబము ఢిల్లీకివచ్చుటకు సమ్మతింపలేదు. జస్వంతుని కుటుంబము నెట్లైన బంధించుటకే చూచుచున్న యౌరంగజేబు, తాను మిత్రుఁడైన జస్వంతుని కుటుంబమునకు సానుభూతి తెలిపి, కొంతకాల మాతిథ్యమిచ్చుటకే పిలిపించితిననియు, ఢిల్లీవచ్చుటకు సమ్మతిలేనిచో నాపరిసర ప్రాంతమునఁ బదిరోజులపాటుండి, తనయాతిథ్యమును స్వీకరించి వెళ్ళవచ్చుననియుఁ గబురంపెను. చక్రవర్తిమాటఁ బూర్తిగఁ దిరస్కరించిన నేమగునో యని దుర్గాదాసందుల కొప్పుకొని, రాజధానికిఁ బదునైదుమైళ్ళలోనున్న యొకహిందూగ్రామమున మకాముపెట్టెను.

ఒకనాటిసాయంకాలము పాదుషా,సానుభూతి తెలుపుటకు కనుమిషతో, జస్వంతుని పెద్దకుమారుఁడైన పృధ్వీసింగునుఁ దన సభకుఁబిలిపించి, యాదరముకలవానివలెఁ గౌగలించుకొని, విషదిగ్ధములైన వస్త్రముల నాతనికిచ్చెను. అమాయకుడైన

యూశాలుఁ డావస్త్రములధరించి యింటికేగగనే మరణించెను. ఓయీ! ఔరంగజేబూ! నీ వెంతతేనెపూసినకత్తివి! నీయట్టి కృతఘ్నుని మాంసమునుఁ గుక్కైన ముట్టునా!

పృథ్వీసింగుమరణానంతరము పాదుషా జస్వంతుని చిన్న బిడ్డడయిన యజితునిఁ జంపింపఁదలచెను. పృథ్వీసింగు మరణ కారణము నాకళింపుచేసుకొన్న దుర్గాదాసజితునిఁ 'గంటినిఱెప్ప వలెఁ' గాపాడుచుండెను. దుర్గాదాసును బ్రలోభపెట్టి రాజ కుటుంబమును బంధించుటకై యౌరంగజే బావశ్యకమైన పని యున్నదని వెంటనే రమ్మని కబురంపెను. స్వార్థత్యాగియైన దుర్గాదా సజితునకుఁ దగిన కట్టుదిట్టములఁజేసి తానౌకనా డౌరంగజేబును గలసికొనుటకై ఢిల్లీపోయెను. అతఁడే ప్రథమ ప్రకరణమున మనకుఁబరిచితుఁడైన యశ్వారోహి. దుర్గాదాసు జస్వంతుని నమ్మినబంటు, సేనాపతి.

# 3

దుర్గాదాసూ! మీరాణికిఁ, బ్రభుపుత్రునకు క్షేమమేకదా!

సమ్రాట్! సర్వేశ్వరుని యనుగ్రహమువలన వారంద ఱకు క్షేమమే.

అజేయులైన కాబూలీయుల నుక్కడగించిన మామి త్రుఁడు జస్వంతుని ఋణమును మేమెన్నటికిఁ దీర్పఁజాలము దుర్గాదాసూ!

రాజపుత్రజాతియంతయు నంతే! ప్రభుఋణమును దీర్చు కొనుటకై యేరాజపుత్రుఁడైన నేపాత్రము జంకఁడు.

ఔను, దుర్గాదాసూ! నేనావిషయమును బూర్తిగ గ్రహించితిని. అందుకనియే రాజపుత్రజాతిని నా నిండుదర్బారులోఁ దగినస్థానమిచ్చి గౌరవించుచుంటిని.

సమరదాసిక యూరకుండలేకపోయెను. ఉత్తేజముతో లేచి "ఔను, చక్రవర్తీ! మీకు రాజపుత్రజాతియందు-విశేషించి మీసేవలో మరణించిన జస్వంత ప్రభుని యందు, వారికుటుంబము నందుఁ గల గౌరవము మొన్న మీరు పృథ్వీసింగునకుఁ జేసిన గౌరవములోఁ దేటఁబడినది."

ఆ మాటల కుల్కిపడి ఔరంగజేబు "సమరదాసూ! పృథ్వీసింగునకుఁ దగినగౌరవము జరపలేదనియా నీయభిప్రాయము!"

జరపకేమి! జరిపితిరి కావుననే యాయర్భకుఁడు గృహము చేరిచేరకమునుపే తన ప్రాణములను మీమోసమున కాహుతి చేసినాడు.

సమరదాస్! ఇఁక నూరకుందువా లేదా! నీతో వచ్చిన నేకార్యము కొనసాగదు. నీ నోటితొందరయే యన్నికార్యములకు విఘాతమగుచున్నది. నీవు సత్వరము వెలుపలికిఁబోయి నారాకకొఱకై నిరీక్షించుచుండుము.

దుర్గాదాసు మాటప్రకారము సమరదాసు దర్బారువీడి యావలకుఁ బోయెను.

దుర్గాదాసు చక్రవర్తికభిముఖుండై, "సమ్రాట్! మా తమ్ముని మాటల లెక్కింపకుడు. వాఁడనుభవము లేనివాఁడు. ఇఁక మీరు నన్నుఁ బిలువనంపిన కారణమేదియో తెలుపుఁ"డని పలికెను.

దుర్గాదాసూ! పెద్దకారణ మేదియును లేదు. మామిత్రుఁడు జస్వంతుఁడు మాకొఱకుఁ బ్రాణములవిడచినాడుకదా! అతనిని - ఆ పరోపకారిని - సాక్షాత్తుగ సత్కరించు నదృష్టము మాకబ్బలేదు. కావున నాతనికుటుంబము నైన నధికముగ సత్కరింపవలెనని నాకుఁ గాంక్షకలదు ఎచ్చటనోయుండి మాయాతిథ్యమును స్వీకరించుటయన్న నాకునచ్చదు. మా యింటనే యుండి కొన్నిరోజులపాటు మీరాణి మాయాతిథ్యము స్వీకరింపవలెనని మాయూహ. ఆ మామిత్రుని కుటుంబమును బూర్తిగ గౌరవించువఱకు మాహృదయమున కూరటకలుగదు. మామిత్రుని కుటుంబము ప్రస్తుతము నీరక్షణలోనున్నదికదా. ఒకమారాకుటుంబమును మాభవనమునకుఁ బంపుమని యడుగుటకే నిన్ను బిలువనంపినది.

కొంచెమాలోచించి దుర్గాదాసీవిధముగ బలికినాఁడు. "సార్వభౌమా! మీ యాదరబుద్ధి యెంతయుఁ గొనియాడఁదగి యున్నది. కాని సత్కారములనునవి సంతోషముగనున్న వారికే యానందసంధాయకములగును. అంతియేకాని విచారగ్రస్తులయినవారి కీసత్కారములు సంతోషమును గల్గింపకపోగా మీదుమిక్కిలి దుఃఖమునుగూడఁ గల్గించును."

నీ మాటయుఁ గాదనుటకు వీలులేదు దుర్గాదాస్! ఆ మాత్రమైన సానుభూతినిఁ జూపకపోయినచో మాహృదయమున కానందము, తృప్తి చేకూరవు. అయినను సత్కారము ఘనముగాఁ జేయున దేమియులేదు. రెండుమూడురోజులు మీరాణిగారి కాతిథ్యమిచ్చి తదుపరి యామెను సగౌరవముగ నీ కప్పఁజెప్పెదను.

ప్రభూ! విధవయై విలపించుచున్న యామె కీయాతిథ్యము లేల! అదియునుగాక మాహిందువులలో విధవ కొన్నివత్సరములవఱకుఁ బరుసింట నడుగిడఁగూడదు.

నేనుబరుఁడనా దుర్గాదాసూ! జస్వంతునికి నాకుఁ గల మైత్రి నీవెఱుగనిదా?

ఔను, చక్రవర్తీ! ఆమైత్రి నే నెఱుగనిదా! విధవయైన రాణిని మీభవనమున కాహ్వానించుటకంటె మీరాయాతిథ్యము రాణియున్నచోటికే పంపుట సమంజసమని నాయూహ.

దుర్గాదాస్! నాభవనమునకు మీరాణినిఁ బంపుటకింత సందేహింతువేల?

సందేహమేమి-సమ్రాట్! సందేహముకాదు. మారాణి తన చిన్నకుమారునితో భర్తృదేశమునకుఁ బోఁగోరుచున్నది. వెంటనే యనుజ్ఞయిండు. అజితుఁడు పెద్దవాఁడయిన తరువాత మీయభిమాన మాతనిపై జూపవచ్చును.

ఔరంగజేబు క్రోధియై "మీరాణి నిప్పుడు మాభవనమునకు బంపనందువా!"

మీకోపమునకు భయపడు పిరికి పందనుగాదు. సార్వభౌమా! మారాణిని నిర్బంధముగాఁ బంపుమని యడుగుటకు మీకేమి యధికారమున్నది?

పాదుషా (బిగ్గరగా) "దుర్గాదాస్! నాకధికారము లేదా? నే నెవరినో తెలియునా?"

తెలియకేమి; మీరు సార్వభౌములు. సార్వభౌములయినను, దేవుఁడయినను, నసభ్యతనుజూపిన రాజపుత్రజాతి యెన్నడు సహింపదు.

ఏమి! నే నసభ్యతను జూపితినా! నాయసభ్యతను నిరూపించు ఘనుఁడవానీవు. ఇదిగో! దుర్గాదాస్! నీ ప్రాణముల మీఁద నాశయున్నచో రాణిని నాయధీనమొనర్తునని వాగ్దానము చేయుము. లేనిచోఁ బ్రాణములు దక్కవు. రాణిని, రాజపుత్రుని నిచ్చిన మార్వాడయంతయు నీకు ధారవోయుదును. మహారాజువగుదువు. ఆలోచించి సమాధానము చెప్పుము.

ఆ మాటలువిని కూర్చున్న దుర్గాదాసు చరాలున లేచినాడు. ఏమి! సమ్రాట్! చక్రవర్తివి కదాయని యన్యాయబద్ధమైన నీయాజ్ఞను మేమాదరింతుమనుకున్నావు కాఁబోలు! ఆ యూహను నీ హృదయాకాశమునుండి దూరముగఁ దరిమివేయుము. నీ బెదరింపులకు లొంగుటకు మేము ముసల్మానులము కాము.

ఔరంగజేబు మండిపడి, "హమీదాద్ ఖాన్! ముందీకాఫరును బట్టి బంధింపుము. వీఁడేమిచేయునో చూతము. వీనియబ్బ యెవడడ్డము వచ్చునో కనుగొందము."

ఔరంగజేబుమాటలు వినుసరికి దుర్గాదాసుకొక్కసారి నొడలెల్ల ఝల్లుమన్నది. సహజముగనాతఁడు శాంతచిత్తుఁడు. క్షాత్రమునకే యవమానకరములైన చక్రవర్తిమాటలు వినుసరికి నాతని యొడలి రక్తమత్యుష్ణమై శరవేగమునఁ బైకుబికినది. వెంటనే దుర్గాదాసాజానులంబియైన తన దక్షిణ కరముతోఁ గాలసర్పమునుబోని ఖడ్గమును జరాలునలాగి చూపరుల కన్నులకు మిరుమిట్లు గొల్పునట్లుత్రిప్పసాగినాఁడు. కత్తియొక్క తళతళయేకాని కత్తియెవరికిని గనఁబడలేదు. ఆభయంకర ఖడ్గచాలనము పాదుషాతోసహా యందఱనుగడగడలాడించినది. ఎవరిమీఁదయెప్పుడు తెగిపడునోయని యందఱును గజగజలాడుచుఁ బ్రాణములఱచేతఁ బెట్టుకొనియుండిరి. దుర్గాదాసును బట్టుకొనుటకు ముందుకువచ్చిన హమీద్ఖానొక్క యఱపఱచి కన్నులుమూసికొని క్రిందఁబడెను. దుర్గాదాసుకత్తినాపి "ఓ! పిరికిసర్దారులారా! ఓచక్రవర్తీ! ఈసర్దారులేనా నీయంగరక్షకులు! ఇప్పట్టున నేఁదలచుకొన్న నిన్నెవ్వరురక్షింపఁగలరు! ఔరంగజేబూ! నీ మోసము నాకుఁ బూర్తిగఁ దెలియును. పృథ్వీసింగును నీవేవిధముగ గౌరవించితివో నేడుహతశేషమైన మారాజకుటుంబమును నీవేల గోరుచుంటివో నా కామూలాగ్రము తెలియును. అయినను సామముతోఁ గార్యముచక్కఁ బెట్టదలఁచితిని. అది సాగనినాఁడు ఖడ్గమే శరణ్యము. నిద్రించు సింహమును మేల్కొలిపిన వాఁడెన్నడును బ్రతుకడు. నీతాత ముత్తాతలు రాజపుత్రసహాయముతో భారతావని నేలకలిగిరి. నీ వా క్షాత్రాగ్నిలో నాజ్యమును బోయుచున్నావు. ఇంక నీకుఁగాని,నీపుత్రులకుఁగాని,నీసామ్రాజ్యమునకుఁగానిక్షేమము.

శూన్యమే. చక్రవర్తీ! పంతము వచ్చినపుడు రాజపీరుఁడు హరి హరబ్రహ్మలనైన లక్ష్యపెట్టడు. ఇఁక నీవనగా నేమిలెక్క! ఏమంటివి? మా రాజకుటుంబమును నాచేతులతోఁబట్టి నీకప్ప గింపవలెనా! ఎంతటి స్వప్నములను గనుచుంటివి! ఇదిగో వినుము. నాకంఠములోఁ బ్రాణములున్నంతవఱకు, నా శరీరములో నాఖరురక్తబిందువున్నంతవఱకు, నీవుకాదు! సమస్త భూతలము నీకుసహాయమైనను, మా రాజకుటుంబము వైపు తేఱిచూడనైనఁ జాలవు. జాగ్రత! ఇట్టి పిచ్చిప్రయత్నముల మాని సుఖింపుము. పోయివచ్చెద. పునర్దర్శన మవసరమున్న యుద్ధరంగముననే. నేనొంటరిగ వచ్చితినని తలఁచుచుంటివి కాఁబోలు నా యీఖడ్గమే యఖండసైన్యము". అనుచుఁ జకజక సింహద్వారము దగ్గఱకుఁబోయి యచ్చటనున్న తనవిజయము పైకిఁ జివాలున నెగిరి యెక్కి నిమిషములో గనుచూపుమేర దాటిపోయెను. దుర్గాదాసుయొక్క యాపోకడ ఘనాఘనములోఁ దోఁచు చపలాలత;మానసమందు నర్తించు సాహసలతి.

దుర్గాదాసుయొక్క యావీరకృత్య మౌరంగజేబుసభకు ననిదంపూర్వము, అనూహ్యము, అఖండనృత్యజిహ్వానాట్య సమమునై యుండెను. వీరాధివీరుఁడైన యాస్వార్థత్యాగి తేజః పుంజము, ముసల్మానుల కన్నుల కొట్టి కప్పివైచెను. అహో! ఏకభూమియందే నివసించు జాతులలో నెంత భేదము! ఒకటి ప్రాణములను బణముగానొడ్డి వ్యక్తిత్వమే యారాధ్యమని తలంచి తద్రక్షణకై సమస్తము తృణకణమువలె విడుచు చుండ. మఱియొకటి సామ్రాజ్యకాంక్షచే నంధమై ప్రాణభీతికలిఁగి,

యస్థిరమును, తుచ్ఛమును, నప్రతిష్ఠాకరమును నైన ధనలోభము చేఁ గృత్రిమముగఁ జీవించునది.

దుర్గాదాసు వెడలిపోయినతరువాత నఱగడియకుఁగాని, చక్రవర్తి మొదలైనవారు స్వస్థికి రాలేకపోయిరి అఱగంట గడచినతర్వాత, చక్రవర్తి బాహ్యప్రపంచమునఁ బ్రవేశించి, "యెవరక్కడ! దుర్గాదాసును బట్టుకు; కొట్టు"డని కేకలు వేయసాగెను. ఆమాటలువిని యంతకుముందు దుర్గాదాసును బట్టుకొనుటకై వచ్చి, యతనికత్తిఘుణాంఘుణాలచే గుండెపగిలి, భూశయనమందిన హామీదాన్ ఖాను లేచి నిలఁబడి తనముక్కును, దలనుఁ దముడుకొనసాగెను. అదేమని చక్రవర్తి ప్రశ్నింప హామీ దిట్లనెను. 'ప్రభూ! ఆతఁడు చాల దుర్మార్గుఁడు; వట్టిమూర్ఖుఁడు;కాకున్నచో, నింతమందిలో నింతవేగముగఁ గత్తిత్రిప్పునా! నేనాతనినిఁ బట్టుకొనుటకు ముందుకుఁ బోవుటవలన నాముక్కుముందు మఱి వి సురు గల గత్తిఁద్రిప్పినాడు. అందుచేత నాముక్కు, తల, యున్నదియు నూడినదియుఁగూడ నాకుఁ దెలియలేదు. అది తెలిసికొనుటకే నేను ముఖమును, దలను, గూడఁ దడుముకొనుచుంటిని. ముక్కులేకపోయిన ముక్కిడినగుదుకదా! ఈజ్ఞానమేమైన నాతనికున్నదా! ఈమాటలువిని నవ్వవలయునో విచారింపవలెనో చక్రవర్తికి దెలియలేదు. అతఁడట్లే కొంతసేపుండి, బద్మాష్! శత్రువును బట్టుకొనలేక నోటికివచ్చినట్లు వాగుటకు నీకుసిగ్గులేదా? ఫో!ఫో! నీకంటె నాడుది నయమని"కసరిపలికెను. హామీదు మారుమాటచెప్పక తలవంచుకొని వెడలిపోయెను.

హామీదు వెడలినతరువాతఁ జక్రవర్తి దర్బారునువీడి ప్రియురాలైన గులనార్ బేగం మహలునకుఁ జనెను. గులనార్ చక్రవర్తి ప్రియురాండ్రలో కెల్లఁ బ్రియురాలు. ఆమె మోహ పాశముచేఁ బంధింపఁబడి, యౌరంగజే బామెగీచినగీటుదాటక, యామె కనుసన్నలలో మెలగుచుండును. ఆమెనేత్రారుణిమ, సమస్తభారతప్రజాప్రాణవనవాటికి దవానలము. ఆమెనేత్రప్రస న్నత, సకలప్రజాకోటి హృదయస్పందిసుధాసార ప్రసారము. న్యాయాన్యాయము లేవియైనను నాపె ప్రేమవార్తలో నెగుర గొట్టుటకు నౌరంగజే బెప్పుడును సిద్ధముగనే యుండును. గుల నార్ బేగమునకును,జోధపురరాణి మహామాయకును,నొకప్పుడు వాదము సంఘటిల్లినది. ఆ వాదములోఁ గనోష్ణ క్షత్రియరక్త మును బంచుకొని పుట్టిన మహామాయ గులనారును దిరస్క రించి "ఓసీ! నీకుసిగ్గులేదా? నీవు నొకమహారాణినని యెట్లు చెప్పుకొనుచున్నావు? ఔరంగజేబు నీరూపమునకు మురిసి నిన్నొకదాసిగఁ గొన్నాడు. ఇంతమాత్రమునకే యింత గర్వమా! యథార్థముగా విచారించినచో నీకంటె మాయింటిఁ గుక్కయైన నయమే" యని నిందించినది. మహామాయచే నిందింపఁబడిన గులనా రామెపై గ్రౌచుపాముపగఁ బూని బగఁదీర్చుకొనుటెట్లాయని యాలోచించుచుండెను. ఇంతలో జస్వంతసింగు మరణించుటయు, మహామాయ దుర్గాదాసురక్ష ణతో నౌరంగజేబాజ్ఞవలన ఢిల్లీకి సమీపమునందున్న యొక గ్రామములో నుంచఁబడుటయుఁ దటస్థించినది. భుజంగియైన గులనా రాసమయము నూరకపోనిచ్చునా! వెంటనేయామె యౌరంగజేబుతో మహామాయను బట్టి తనయధీనమొనర్చు

మనియు, అట్లైనఁ దనపగయుఁ దీరుననియు, జస్వంతుని రెండవ కుమారుఁడుఁగూడ దమకు దక్కుననియు, నా బిడ్డను మట్టు పెట్టిన మార్వాడయంతయుఁ జక్రవర్తి కధీనమగుననియుఁ జెప్పెను. ఆ సలహాప్రకారమే యౌరంగజేబు దుర్గాదాసును బిలిపించి జస్వంతుని కుటుంబము నప్పగింపుమని యడుగుటయు నతఁడుఁ దిరస్కరించుటయుఁ గూడ జరిగినది.

ఔరంగజేబు వచ్చుసరికి గులనారేదియో యాలోచించుచుఁ దన భవనమునఁ బచారులు చేయుచుండెను ఆలోచనా తీవ్రతచే నామె యెదుటఁ జక్రవర్తినిఁ జూడలేదు. ఔరంగజేబామెసన్నిధి కేగి భుజముపైఁ జేయివైచెను. ఆమె యులిక్కిపడి చక్రవర్తివంకఁ జూచినది. చూచుటయేతడవుగ మహామాయ యేదని ప్రశ్నించినది. ఔరంగజేబామెకు దుర్గాదాసు దర్బారులోఁ జేసినవీరకృత్యము మొదలగు విషయములన్నియుఁ జెప్పినాడు. గులనారదివిని "సార్వభౌమా! దుర్గాదాసొక్కడే మిమ్ముందఱను, బెదరించి, యెదిరించి, తిరస్కరించి, నిందించి, బ్రతికి బయటఁబడగలిగెనా? ఆతఁడుమిమ్ములనిందించుచుండగ మీరు నిద్రపోవుచుంటిరా? ఏమి! దుర్గాదాసుని పరాక్రమాతిశయము! ఆతనిఁబట్టువీరుఁడు మీలోనొక్కడు లేడా? మీ ప్రేమలు కపటములని నేడు దెలిసినది. జోధపురరాణినిఁ బట్టి యిచ్చునంతవఱకు మిమ్ముల నే నమ్మను. మీకునాపై నిజముగా ప్రేమయున్న దో నొక్కదుర్గాదాసునుఁ బంధింపలేక పోయిగా?"యని ప్రశ్నించెను. "ప్రియమనీ! దుర్గాదాసు సామాన్యుఁడుకాడు. అతని ఖడ్గసంచాలనైపుణ్యమునకు నాతోఁ

పాటు మనప్రసిద్ధసేనాపతులుకూడ వెలుగును వెలుపును బొంది నా"రని పాదుసాపలికెను. "సార్వభౌమా! యింకమీరుపొండు. మహామాయను బట్టి సాయంకాలములోగా నాకప్పగింపవలె" నని చెప్పి, చరచర గులనారు లోనికేగినది. ఆ పోవునప్పుడామె దుర్గాదాసువీరకృత్యమును దలచుకొనుచుఁ బోయినది. ఆతలఁచుకొనుటలో నామెహృదయమున నొక మనోహరవీణాతంత్రి శబ్దించినది; సాకూతమైన భావగీతి నావీణ యాలపించినది; తన్మయత్వమునుగల్గించు నానందపారవశ్యమొకటి యామె సర్వహృదయమున వెల్లివిరిసినది.

## ౪

ఔరంగజేబు రాజ్యముచేయునాటికి రాజపుత్రస్థానములోనున్న ప్రసిద్ధరాజ్యములలో మేవాడు రాజ్యమొకటి. అది సూర్యకిరణములకుగూడఁ జొరశక్యముకాని, మహావృక్షములతోనిండిన యడవులచేఁజుట్టబడియుండెను. అందువలన నారాజ్యము శత్రువులకభేద్యమై నొప్పుచుండెను. ఆ యడవులు ధర్మరక్షణకు బద్ధకంకణమైన మేవాడురాజ్యమునురక్షించుటకై సృష్టికర్తచే నిర్మింపఁబడిన కోటగోడలవలెనుండెను. పట్టపగలు కూడ చోరులకునికిపట్టయి గాఢాంధకారబంధురమైన యా యడవులలో భల్లూక, శార్దూల,సింహ, గండభేరుండాది మహామృగములు భయరహితములై విహరించుచుండెను.ఒక్కొక్క

పహుడు మృగములు చెలరేగి తమ హద్దులదాటి గ్రామపరిసర ములంబడి పైరుపంటలనుం బాడిజంతువులనునాశనము చేయు చుండెను. ఆవిషయము తెలిసినవెంటనే మేవాడురాజులు వేటకై పోయి ఘాతుకమృగములను నుక్కడగించి ప్రజలం గాపాడుచుందురు.

ఆమేవాడురాజ్యమును రాజసింహుండను రాజసింహము పరిపాలించుచుండెను. అతనిబాహువులు ధర్మదేవతకువిశ్రాంతి స్థలము. పరిపంథిరాజులపరాక్రమములు నిద్రించుచోటు. యాచకసంఘముల జీవిక. దీనార్తులకు శరణ్యము.

రాజసింహుండు రాజ్యమునకువచ్చిన క్రొత్తరోజులలోం గొందఱుసామంతు లెదిరించిరి. ఉపాయశాలియు, వృద్ధోప దేశశ్రోతయునైన రాజసింహుండు, సామముచేతను, దానము చేతను, భేదముచేతను, ఈ మూఁడుపాయములకు లొంగనివా రిని దండముచేతను లోబఱచుకొని యరిభయంకరుండై యుండెను.

ఆకాలమున ఢిల్లీచక్రవర్తియైన యౌరంగజేబు, రాజపుత్రుల నందఱం గ్రమముగ లొంగఁదీసికొని, యందఱివలెనే నీవును సామంతుండవుగ నుండవలసినదని రాజసింహునకుం గబురంపెను. ఆవార్తవిని రాజసింహుండు మండిపడి యౌరంగజేబునెదిరించు టకు నిశ్చయించుకొన్నను, వృద్ధమంత్రియైన బుద్ధిసాగరుని యుపదేశముచేం గొన్నిషరతులప్రకార మౌరంగజేబుతో సంధి చేసికొనెను.

రాజసింహున కిద్దఱు పుత్రులుదయించిరి. అందుఁ బెద్దవాఁడు భీమసింహుఁడు; రెండవవాఁడు జయసింహుఁడు. స్వాతంత్ర్యాభిమానియైన రాజసింహుఁడు తనపుత్రులనిరువుర మహావీరులనుగఁ జేసి, మహమ్మదీయులవలనఁ దనరాజ్యమునకు ముందుఁగూడ నెట్టియుపద్రవము రాకుండ జేయనెంచెను. అందుకై కుమారులకు మంచియుపాధ్యాయుల నేర్పఱచి యన్ని విద్యల శ్రద్ధగఁ జదివింపసాగెను.

కొన్ని సంవత్సరములుగడచినవి. రాజపుత్రులు వేదశాస్త్రములందు, నీతిశాస్త్రమందు, విశేషించి శస్త్రవిద్యయందు, నత్యంతప్రావీణ్యమును గడించుచుండిరి. అప్పుడప్పుడు రాజసింహుఁడుస్వయముగవిద్యాలయమునకేగి పుత్రులవిద్యపరీక్షించుచుండును. పరీక్షించినకొలఁది జ్యేష్ఠపుత్రునియందు నమ్మకము తఱుగసాగెను. భీమసింహుఁడెప్పుడు నేదియో యాలోచించుచుండును. జయసింహుఁడెప్పుడుత్సాహవంతుఁడుగ నుండును. 'సముద్రమువలెఁ బొంగివచ్చు మహమ్మదీయోపద్రవమును బాపి దేశము నెట్లుద్ధరింపవలెనా' యని భీమసింహునియాలోచన. 'తానురాజపుత్రుఁడు. తనకు నవేలములైనసుఖములుకావలెను. అవి త్వరలోనే తన్ను సమీపించుచున్నవి' అని జయసింహుని యుత్సాహము. 'సంసారమనునది దేశభక్తునకుఁగంటకప్రాయము; పెండ్లిచేసికొన్నభార్యాబిడ్డలను బ్రేమించుటలోను బోషించుటలోను గాలమంతయుఁ గడపవలసివచ్చును' అని భీమసింహుని యుద్దేశము, 'భార్యయనునది పురుషునిజీవితము. భార్యవలననే పురుషుఁడు సర్వసౌఖ్యములనుభవింపఁగలఁడు. భార్యాపుత్రులు

లేకపోయిన మానవునకు సుఖమే లేదు, అట్టి జీవితమే వ్యర్థ'మని జయసింహునియుద్దేశము. 'వ్యక్తిత్వమును నిలఁబెట్టుకొనుటయే పురుషునకు లక్షణము. అభిమానము సర్వమహత్తరము. అది పురుషునకవశ్య సంపాద్యము. అది లేనినాఁడు పురుషుఁడు పశుతుల్యుఁడు. దానిని నిలఁబెట్టుకొనుటకై పురుషుఁడు సర్వదా, సర్వథా ధన తనువులను గూడ లెక్కింపక ప్రయత్నము సలుపవలె'నని భీమసింహుని యాశయము. 'మానవుఁడు జన్మించినది జీవించుటకు. ఆ జీవించుటలోఁగూడ సౌకర్యమైన జీవనమే మానవునకు ముఖ్యము. దానికైశ్వర్యాధికారములు కావలెను. తత్సంపాదనకై యవసరమువచ్చిన యేపద్ధతులనైన పురుషుడవలంబింపవలెను. త్రాడు తెగువఱకు లాగి తన సుఖమును విడనాడుట చాలపొరపాటు'ని జయసింహుని యాశయము. ఈవిధానములో భీమసింహుని విధానము కష్టసాధ్యము. దాని నెట్లుసాధించుటయాయని యాతఁడెల్లప్పుడు విచారించుచుండును. ఎల్లప్పుడేకాంతాలోచనఁ జేయుచుండుటచే నెల్లఱు భీమసింహుఁడు వైరాగ్యసంపన్నుఁడనియు,గాంతాకనకవిముఖుఁడనియుఁ దలపసాగిరి. రాఁబోవుసుఖవాతావరణమునుఁ దలచుకొని యుత్సాహపడు జయసింహునిఁజూచి యాతఁడుత్సాహవంతుఁడనియు, నాతఁడే రాజ్యార్హుఁడనియు, నందఱు నెంచఁజొచ్చిరి. ఒకఁడునివురుగప్పిననిప్పు; మఱియొకఁడువాలోద్ధూతధూమకళిక. ఒకఁడు తుషారావృతచండకిరణుఁడు; మఱియొకఁడుగాఢజీమూతాంతరితశీతకిరణుఁడు. లోకము బాహ్యం

ద్రియజ్ఞానసంపన్నుఁడే కాని యంతరింద్రియజ్ఞానసంపన్నము కాదుకదా !

రాణారాజసింహుఁడు భీమసింహుని ప్రవర్తనను బరీక్షించుచునే యుండెను. భీమసింహునకి రాజ్యమిచ్చిన నది సక్రమముగ నడచునా, నడవదా యను సందేహము మహారాణాను బాధింపఁ జొచ్చినది. అదియునుంగాక పెద్దకుమారునికంటెఁ జిన్నకుమారునిమీఁద రాణాకుఁ బ్రేమ యధికము. భార్యచనిపోవునప్పుడు పసివాఁడైన జయసింహునిఁ దనకప్పగించి తల్లిలేనిలోటు కనపడనీ ప్రతిపాలుటవలన రాణా తానే తల్లియై జయసింహునిఁ బెంచినాఁడు. ఆకారణమువలన రాణాకుఁ బితృప్రేమయేకాక మాతృప్రేమకూడ జయసింహునిపై నిలచినది. కాబట్టియే భీమసింహునిపైఁగంటె జయసింహునిపై రాణాకుఁ బ్రేమయధికము.

మఱికొన్నిసంవత్సరములుగడిచినవి. సకలవిద్యలందు రాజకుమారులారితేరిరి. విద్యాపరిపూర్ణులైన పుత్రులను రాణా స్వగృహమునకుఁ బిలిపించినాఁడు. కుమారులిద్దఱు పితకు నమస్కరించి తమవిద్యాప్రాభవమును తండ్రికిఁ జూపినారు. జయసింహుఁడు లౌకికవిద్యలనేర్చినట్లు శాస్త్రవిద్యనేర్వలేదు. భీమసింహునియందు సర్వవిద్యలు సహజముగ మిళితమయి చేరియున్నవి. ఆతనియందున్న మహాప్రాణత రాజసింహునకుఁ గూడ మహాశ్చర్యముకలిగించినది. అయిననేమి! రాణాయభిమానపాత్రుఁడు జయసింహుఁడు. కుమారుల ప్రజ్ఞనుజూచు

జయసింహునకు రక్షాసూత్రముగట్టుట భీమసింహున కేమియుఁ గ్రోధకారణము కాలేదు. ప్రత్యేకత, సంతోషకారణ మయ్యెను. 'తాను రాజైనచో స్వేచ్ఛగ దేశసేవ, ప్రజాసేవ చేయుటను వీలుండదుగదా' యని యతని యభిప్రాయము. తండ్రి రక్షాసూత్రము జయసింహునకుఁగట్టుటలో నీయభిప్రాయ మేమని తన్నడిగినప్పుడుకూడ భీమసింహుఁడు మీయభిమతమే నాయభిమతమనికూడ చెప్పెను.

రాణా యుక్తవయస్కులైన కుమారులకు వివాహము చేయ సంకల్పించెను. యువరాజు కాఁబోవుచున్న జయసింహు నకు వివాహముచేయవలెను 'పెద్దవానికి వివాహము ముందు గాఁజేసి తరువాతఁ జిన్నవానికిఁ జేయవలె'నని రాణాయూహ. ఆవిషయమును దెలిసికొని భీమసింహుఁడు తండ్రిపాలికిఁజని "తండ్రీ! మీయాశయమునకు విరుద్ధముగ బలుకుచుంటినని కినియకుడు. మనరాజ్యము సర్వదా శత్రుసిరుక్తమైనకాన నేను వివాహమాడను. స్వేచ్ఛావాయువును మనసార నాస్వాదింప లేని నాకీవైవాహికాది సంఘటనలన్నియు మిక్కిలి బాధాకర ములుకాఁగలవు. అట్టిపాశముతో నన్ను బంధించి యీయున్న కొంచెము స్వేచ్ఛాప్రసారమును గూడ నరికట్టవలదు. ఇందులకై మీకివే సహస్రసంఖ్యాకములైన నమస్కారముల"ని తండ్రి యడుగుల కెఱగెను. కుమారుని మాటలువినుచున్న రాణాకు గుండె గుభేలుమన్నది. రాజ్యములేకపోయినను, సామాన్యుని వలె వివాహమాడి, భార్యాపుత్రులతో సుఖించునుగదాయని తలచెను. కాని యదియు వ్యర్థమైనది. అంతటితో నూరుకొ

నక పలుమాటులు కుమారునకు వివాహము జేసికొమ్మని, రాణా నయ భయములఁ జెప్పెను. చాలమందిచేతఁ జెప్పించెను. ఎంత మందిచెప్పినను భీమసింహుఁడిచ్చు ప్రత్యుత్తరము మాత్రము మామూలే. ఎన్నిమాటులు చెప్పినను వినని కుమారునిపై రాణాకుఁ గోపమువచ్చినది. కాని భీమసింహుని వినయ సంపత్తిచే నా కోపము క్షణములో నెగురఁగొట్టఁబడెను. ఇఁక యెంత చెప్పినను లాభము లేదని తోచినతరువాత రాణాసరస్వతి యను రాజదుహితనుఁ దెచ్చి, జయసింహునను, వివాహము చేసెను. సరస్వతి సాక్షాత్ సరస్వతి; భర్తృబద్ధానురాగ; పాతివ్రత్య గుణశోభిత.

భోగలాలసుఁడైన జయసింహుఁడు రాత్రిందివము లంతఃపురమందే గడపఁజొచ్చెను. పతివ్రతయైన సరస్వతి తా నేమాత్రము భర్తకు వ్యతిరేకమైన పనిచేయక యాతనిచిత్తవృత్తిఁ గమనించి మెలఁగఁజొచ్చెను. ఆమెకు భర్తయొక్క భోగలాలసత యిష్టము లేదు. అయినను విధిలేక యాతని చిత్తవృత్తి ననుసరించుచు, మధ్యమధ్య యవకాశము దొరికినపుడు వీరులను గూర్చియు, దేశభక్తులనుఁ గూర్చియుఁ నుపదేశించుచుండెను. ఆ యుపదేశములు రాజకుమారున కేమియు రుచింపవయ్యెను. సరస్వతి యప్పుడప్పుడు భర్తతో భీమసింహుఁడు దేశభక్తుఁడనియు, మహావీరుఁడనియు, దేశ, ప్రజలకోసమై కాంతా కనకముల వీడినాడనియు, నామహాభాగు ననుసరించినఁ బేరు ప్రతిష్ఠలు లభించుననియు, బోధింపసాగినది. ఆబోధలవిన్న కొలఁది జయసింహునకు సరస్వతిపైఁ బూర్వపుటనురాగము తగ్గఁజొ

చ్చెను. ఇట్లే కొంతకాలము గడచునప్పటికి సరస్వతీ జయసిం హుల కొకకుమారుఁ డుద్భవించినాడు. ఆతఁడన్నిగుణముల లోను దండ్రికిఁ బ్రతిబింబనే. ఆతనిపే రమరసింహుఁడు.

జయసింహుని విషయలాలసత కుమారునిఁ గన్నను దగ్గలేదు. అతనికిప్పుడు సరస్వతి మనోహారిణి కాలేకపోయినది. అందువలన యువరాజు మఱియొకరాజపుత్రికను వివాహమాడ సంకల్పించెను. ఈవివాహము సరస్వతికిఁగాని, మంత్రులకుఁగానిఁ నేమాత్రమిష్టము లేదు. వారియిష్టము పాటించువారెవరు? మహారాణాకిష్టము లేకపోయినను, కుమారుని యందలి ప్రేమాతి శయమువలన వానికోరిక నంగీకరించెను! ఇఁక జయసింహుని నడ్డుపఱచువారెవరు! అంబరుపరాజదుహితయైన 'కమల' యను రాజకుమార్తె యందమునకు నశుండై యామెను వివా హామాడెను. కమలకెంత రూపమధికమో గర్వమంతయధికము. రూపమెంతసుందరమో, మనస్సంతకుటిలము. ముఖమెంత తేజఃప్రపూర్ణమో హృదయమంతయజ్ఞానావృతము. కలహా మన నామెకత్యంత వినోదము. కటుభాషణమన్న యామె కత్యంతప్రియము. భర్తననుసరించుట యామెదృష్టిలోనీచము. భర్తను గింకరునిగఁజేయుట యామెకు సర్వమహత్తరము.

కమల కాపురమునకువచ్చినతొలిదినములలోనే యత్త వారింటిలోఁ గలతలుమొదలసాగినవి. పరిచారికల నీసడించుటో, మామగారిని వెక్కిరించుటో, సవతినవమానించుటో, యామెకు నిత్యకృత్యము. రాణాఅమెబాధనుఁ బోగొట్టుకొనుటకై ప్రత్యేక

మందిరము నేర్పాటుచేసి యామెనచ్చటనుంచెను. ప్రత్యేకమంది రములోనున్న కమల తనతోఁబాటు భర్తనుగూడ బంధించినది. జయసింహుఁడు కమలనేడనుండి దిగుటలేదు. ఆహారన్యవహా రములన్నియు నచటనే. అతనికిఁ గమలయే ప్రపంచము; కమల యేజీవితము; కమలయేరాజ్యము; అదియిదియననేల! సర్వము కమలయే. కమలకూష్ప్పిందుమన్న కూష్ప్పిందును; లెమ్మన్న లేచును; ఈవిధముగ జయసింహుడు కమలచేతిఁగీలుబొమ్మయై బాహ్యజ్ఞానశూన్యుఁడై తనకర్తవ్యమునే మఱచియుండెను. ఈపరిస్థితి సరస్వతిని బాధింపఁజొచ్చినది. భర్తయొక్క యప్రతి ష్ఠనునామె విని సహింపలేకపోయినది. తన యందుప్రేమలేక పోయినను, దనను మోహమెనఁజూపకున్నను, సరస్వతికంతబాధ కలుఁగలేదు. ఏవిధము చేతనైన జయసింహునిఁ గర్తవ్యముఖు నిఁగ, మహావీరునిగఁ జేయువలెనని యామెసంకల్పము. అందుకై యామె యాలోచింపసాగినది. తాను భర్తకుబోధించుటకు వీలు లేదు. తన మాటనేమూడను భర్తతనమాటనెట్లుపాటించును? ఇన నికయుపాయమేమి? ఒకటేయుపాయము. కమలకుఁదానుజెప్పి, యామెద్వారా భర్తకుఁజెప్పింపవలెను. భర్తను దినముగము ముండడసీయుని సవతి గృహమునకేగుటకంటె స్త్రీకి, మరణమే యుత్తమము. అయినను భర్తను బాగుచేయుటకై సరస్వతి యాయవమానమును లెక్కింపక యొకనాటిసాయంసమయమున కమల గృహమునకేగినది.

సరస్వతి కమలగృహమునకేగునప్పటికి జయసింహుఁడు కమలగృహమునందే యుండెను. సరస్వతియాగమనమును

జూచినవెంటనే యాతఁడు మేడదిగి యెచటికో పోయెను. కమల సరస్వతినిఁజూచియు, రమ్మనికాని, కూర్చుండుమనికాని పలుక రింపలేదు. సరస్వతియేయామెదగ్గఱకుఁబోయి కూర్చుని "అమ్మా యీ! కమలా! మననాథునిఁగూర్చి లోకమేమనుకొనుచున్నదో యెఱుఁగుదువా! 'జయసింహుఁడు కమలమోహమునఁ జిక్కి రాజ్యన్యసహారములలోఁబొత్తుగఁ దలదూర్చకున్నాడు. కర్తవ్య మేమిటో నెఱుగకున్నాడు. ఇట్టివాఁడురాజ్యమేలిన మనమేమి సుఖపడుదుము! ఇంతకంటె భీమసింహుఁడే నయము'. అని ప్రజలనుకొనుచున్నారు. రాణాగారియుద్దేశముకూడఁగొంచెము మాఱుచున్నట్లున్నది. చెల్లెలా! బావగారు సర్వవిధముల దేశమునుద్ధరింపవలెనని పంతముపట్టియుండ, మననాథుఁడుభోగ లాలసుఁడై యంతపురమును విడువనని పంతముపట్టుచున్నాడు. మననాథునకువచ్చిన యప్రతిష్ట మనదికాదా! నాబోధను సుత రాము వారు వినుటలేదు. నీవుచెప్పిన విందురని నాయూహ. నీచేతఁ జెప్పించుటకే యిచ్చటికి వచ్చినా"నని మెల్లగ బెద రుచుఁ బలికెను.

సరస్వతిమాటల విని కమల చరాలునలేచి "ఏమీ! నీయిష్టమువచ్చినట్లు హద్దు పద్దు లేకుండ వదరుచున్నావు. చేత నైన నీవేనాథునకుఁ జెప్పికొమ్ము. లేకున్న నూరకుండుము. ఇంకొకమాటటువంటి మాటలాడితివా! మెడఁబట్టి గెంటింతును. పో, పొమ్మ"ని కసరి బిడాలున తలుపువైచికొని ప్రక్కనేయున్న గదిలోనికిఁ బోయినది. సరస్వతి యనుకొన్నంత యయినదని గ్రుడ్లనీరు గ్రుడ్లఁగ్రుక్కుకొనుచు ఇంటికిఁబోయినది.

సరస్వతి వచ్చిపోయిననాటినుండి కమలకుఁ దన నాథునకు రాజ్యము దక్కదేమో, తానుమహారాణిని కానేమో యనుభయము కలుఁగసాగినది. ప్రజలచే నిప్పుడు మంచివాఁడనిపించుకొనుచున్న భీమసింహుఁడు తనమహారాణీత్వమున కడ్డుతగులుచున్నట్లుగ నామెకుఁదోచెను. ఇంతవరకు మహారాణాగారికిఁ దననాథునిపై నభిప్రాయము మాఱలేదు. ఇప్పుడిప్పుడే మాఱఁబోవుచున్నదని సరస్వతి చెప్పినది. ఆభావము మాఱనంతలోనే జయసింహుఁడు రాజుగావలెను. అన్నదమ్ములకు విరోధముపెట్టి జయసింహునిచే భీమసింహునిపై రాణాగారితోఁ గొండెములుచెప్పించి భీమసింహుని రాణాకుదూరము చేయింపవలెను. అప్పుడుగాని జయసింహుఁడు రాజుకాడు. తాను మహారాణికాదు. అనియాలోచించుకొని యదిమొదలుకొని జయసింహునకు భీమసింహునిపై విరోధముపెరుఁగునట్లు బోధచేయసాగెను.

కొంతకాలముగడిచినది. జయసింహునకు భీమసింహునిపై క్రోధమభివృద్ధియయినది. ఎప్పుడు సమయముదొరికిన నప్పుడే యన్నగారినిఁ గొట్టవలెనని యాతఁడు తలచుచుండెను. ఇట్లుండ నొక్కనాడు రాజపుత్రులిరువురొకేసారి రాణాదర్శనమునకై పోయిరి. మహారాణా యప్పుడుభవనమున లేడు. జయసింహుఁడు భీమసింహునితో నచ్చట గిల్లికయ్యము పెట్టుకొనెను; మాటకుమాట వచ్చుసరికిరువురిక్రోధములు పారముముట్టినవి. క్రమముగ వారివాదన పోరాటముగమాఱినది. సమయముచూచుచున్న జయసింహుఁడు తటాలునకత్తిదూసి

భీమసింహుని కాళ్ళపైఁగొట్టెను. భీమసింహుఁడా దెబ్బను జమత్కారముగఁ దప్పుకొనెనుగాని జయసింహునికత్తి భీమసింహుని కాలిబొటనవ్రేలిని రాచికొని పోయినది. వ్రేలుచీలుటవలన నెత్తురుప్రవాహముకట్టినది. ఇఁక కోపమాపఁజాలక భీమసింహుఁడు చంగున సింహముకొదమవలె లంఘించి జయసింహునిపైకిదూకెను. దూకుటయేతడవుగ నెడమచేత నాతనికత్తిని దూరముగలాగి పాఱవైచి కుడిచేత మెడపట్టుకొని యొక్కత్రోపుత్రోసెను. ఆత్రోపుతో జయసింహుఁడొకచోటఁ గుప్పగఁ గూలఁబడినాడు. ఆత్రోయునప్పుడే మహారాణా లోపలికి వచ్చినాడు, రాణాను జూచి లేచి యిరువురు చెరియొక ప్రక్కన నిలఁబడిరి. రాణావచ్చునప్పటికి భీమసింహుఁడు జయసింహునిఁ ద్రోయుచుండుటవలన రాణా దూరాలోచనలేక తనుఁజూచిన దేయథార్థమనియు భీమసింహుని దేతప్పనియు నెంచి భీమసింహుని గట్టిగఁజీవాట్లుపెట్టెను. భీమసింహుఁడు తనకాలి బొటనవ్రేలి జూపి తనదితప్పులేదనియుఁ దప్పాతనిదేయనియుఁ జెప్పెను. రాణా తానుతొందరపడి భీమసింహునిఁ జీవాట్లుపెట్టినందులకుఁ బశ్చాత్తాపపడి నెమ్మదిగ నిట్లనెను. "భీమసింహా! నీవు వెనుకటికంటె మారినావు. నీలో రాజ్యతృష్ణ ప్రబలుచున్నట్లున్నది. నేనో జయసింహునకు రక్షాసూత్రమును గట్టితిని. దానిప్రకార మాతడు రాజుకావలెను. నాయనంతరము మీరిద్దరు తగవులాడుకొనుటకంటె నాసమక్షమందే మీరిద్దరు యుద్ధముచేయుట మంచిది. గెలిచినవానికి రాజ్యమిచ్చెదను".

తండ్రిమాటలువినిన భీమసింహుఁడు, "తండ్రీ! నేను రాజ్యముకొఱకై జయసింహునితోఁబోరాడనని శపథముచేయుచున్నా"నని పలికెను. "ఏకత్ర నివసించునప్పుడు మీయిరువురికెట్లు విరోధము వాటిల్లకుండు"నని రాణా యనెను. అతినిష్ఠురములైన యామాటలను విని భీమసింహుఁడు దక్షిణబాహువుపైకెత్తి "జనకా! నీ కా యనుమానము వలదు. నేనిప్పుడే యీరాజ్యమును వదలిపోవుచున్నాడను. ఇఁకనీరాజ్యములో మంచినీరైన త్రాగన"నిచెప్పి తండ్రికినమస్కరించి తమ్మునికౌఁగిలించుకొని వెడలిపోయెను. ఆదృశ్యమును జూచుచున్న జయసింహునికిఁ గన్నులు చెమ్మగిల్లినవి. రాణాబావురుమన్నాడు. కొంతసేపటికి రాణా తెప్పరిల్లి జయసింహునితో, "కుమారా!వీరత్వమన నేమియో తెలిసినదా? నీయన్ననుజూచి నేర్చుకొనుము. పొమ్మ"నెను. జయసింహుఁడు తూలిన హృదయముతో నెమ్మదిగ వెడలిపోయెను. రాణా విశీర్ణహృదయముతో "భీమసింహా! నీ సాహసమత్యద్భుతము. నాపైఁగోపముచే నెంతకఠోరప్రతిజ్ఞ చేసితివి తండ్రీ! నీకెంత యన్యాయముచేసితిని. నేను నీకుఁ జేసిన యన్యాయమునకై స్వర్గమందున్న నీతల్లి నన్నెంత శపించుచున్నదో" యనియనుకొనుచు లోనికేగెను.

అహో! ధన్యమూర్తీ! భీమసింహా! స్వరాజ్యమందలి మహావిప్లవమును జల్లార్చుటకై రాజ్యత్యాగము నేకాక స్వదేశత్యాగమునుగూడచేసితివికదా! నీబోటిమహానుభావుడు, స్వార్థత్యాగి, దేశాభిమాని, లోకమ్మందప్పుడప్పుడు జన్మించును. నీయట్టి

మహాపురుషుల దివ్యాత్మలకింతవఱకే కాక సర్వదా లోకమునకు రక్షకములై యొప్పారుచుందురనుట నిశ్చయము.

౫

ఔరంగజేబు భవనమునుండి బయల్వెడలిన దుర్గాదాసు శరవేగముతో గుఱ్ఱము 'నుడాయించు'కొనుచు వచ్చినమార్గముననే పోవఁజొచ్చెను. ఢిల్లీకిని, రాజపుత్రులును, మహామాయయు నున్నగ్రామమునకు దుర్గాదాసొక యర్ధగంటలోఁ బ్రయాణముచేయఁగలఁడు. ఆనాటి రౌతులలో నశ్వహృదయవేత్తయయిన దుర్గాదాసును గుఱ్ఱపుస్వారిలో మించినవాఁడు లేఁడు.

దుర్గాదాసువచ్చునపటికి రాజపుత్రులందఱును గూర్చుండి యాలోచించుచుండిరి. దుర్గాదాసుకంటె ముందుగవచ్చిన సమరదాసు పాదుషా దురాలోచనలన్నియు, రాజపుత్ర సరదారులతోఁ జెప్పి 'దుర్గాదాసు మెత్తనివాఁడు; ఔరంగజేబాతని నేమిచేయునో' యనెను. 'దుర్గాదాసఖండశేముషీధురంధరుఁడు. వీరలోకమున నాతనికెంత ప్రసిద్ధియున్నదో మనీషిలోకమునఁ గూడ నంత ప్రసిద్ధియున్నది. ఆతని మాయఁజేయుట కౌరంగజేబునకుగాదు! వాని తాతకుఁగూడ చేతకాద'ని రాఠోరువీరుఁడగు ముకుందదాసనెను. "నేనున్న కార్యము చెడునని మాయన్న నన్నుఁబంపెను, లేకున్న నాతఁడౌరంగజేబు దుష్ప్ర

త్యములన్నిటిఁగడిగి పదిమందిలో నాతనినవమానింపకుందునా!' యని సమరదాసుపలికెను. 'నీ కింగితజ్ఞానముతక్కువ; తొందర పాటెక్కువ; అందువలననే సామకార్యములు నీవలనకావు. దుర్గాదాసు నిన్నుబంపినదికూడ నందులకే. దుర్గాదాసు సామ, దాన, భేద, దండోపాయముల ప్రయోగము చక్కగ నెఱిగిన ప్రోడ. ఆతని పోకడ మనకన్నివిధముల విజయహేతువే. దానికేమియు సందియములే'దని విజయసింహుఁడు పలికెను.

వీరిట్లు మాట్లాడుకొనుచుండగనే దూరమునుండిశరవేగ ముతో నశ్వముపై వచ్చుచున్నదుర్గాదాసు వారికంటఁబడెను. 'అదుగో! దుర్గాదాసు; అదుగో! దుర్గాదాస'ని యెల్లరొక్కపరి లేచినిలఁబడిరి. ఇంతలో దుర్గాదాసు ద్వారముచెంతకువచ్చి, గుఱ్ఱముదిగి, గబగబ వీరున్నచోటికే వచ్చెను. వచ్చుచున్న దుర్గాదాసునకెదురుగ సర్దారులందఱు పోయి యాత్రముతో "నేమైనది! ఔరంగజేబెందులకుఁగబురంపినా"డని త్వరత్వరగఁ బ్రశ్నలవేయఁ జొచ్చిరి. దుర్గాదాసు వారినందఱఁ గూర్చుండఁ బెట్టి యచ్చటజరిగిన విషయమునంతయుఁ జెప్పి, మఱియునిట్లన్నాడు. "ఓవీరులారా! ఔరంగజేబు మహాపట్టుదల కలమనిషి; ఆతనిపట్టుదల మనకందఱకుఁ దెలిసినదేకదా. ఆతఁడు మన ప్రభుకుటుంబమును గోరుటయు నేఁ దిరస్కరించుటయుజరిగినది. ఇఁక బలత్కారముగనైన మనప్రభుకుటుంబమును బట్టుట కాతఁడు తప్పక ప్రయత్నించును. మనమా, రెండువందల మందిమి! స్వల్పసంఖ్యాకులమైన మనను దేలికగ సంహరించినఁ దనకోరిక నెఱవేఱునని తలచి పాదుషా తప్పక మనపైకి సైన్య

ములఁ బంపఁగలఁడు. ఆ సైన్యము కంటఁ బడకుండఁ బోవుట మనకు దుర్ఘటము. ప్రాణముల వెచ్చించియైన ప్రభుకుటుంబ మును గాపాడుటకు మన మీ సీమపమునుండియే యత్నింప వలయును. లెండు, నడుములుకట్టుడ”ని సింహగర్జనఁజేసెను. వెంటనే సరదారులందఱుఁ బ్రభుకుటుంబమును గాపాడుటకును, మొగల్ సైన్యగడ్డమువచ్చినఁ దప్పించుకొనుటకును, వీలుతప్పిన నెదుర్కొనుటకును దగినప్రయత్నములఁ జేయనేగిరి.

ఔరంగజేబు గులనారుచేఁ దిరస్కరింపఁబడినాడుకదా! ఆతఁ డామెతిరస్కృతిని క్షణముకూడ సహింపలేదు. ఆమె ప్రసన్నవదనము కోపకషాయితమైనప్పుడు పాదుషాహృద యము క్షోభించును. మహామాయను బట్టుకొని గులనారు కర్పించినకాని యామె మోము ప్రసన్నముకాదు. ప్రేయసి కోర్కె తీర్పఁదలచి పాదుషా సేనాపతియైన దిలేర్ఖానుకుఁ కబురంపెను. దిలేర్ఖాను మహమ్మదీయుడైనను హృదయము కలవాడు. తనయాజ్ఞ యయినవెంటనే యెదుట ప్రత్యక్షమై సలాముచేయుచున్న దిలేర్ఖానుతో నౌరంగజేబు “దిలేర్! నీవు తక్షణ మైదువేల సైన్యముతో దుర్గాదాసున్న గ్రామమున, రాజపుత్రుల ముట్టడించి, జస్వంతునిరాణిని, యామెచిన్నబిడ్డను గొనిరమ్ము కొనివచ్చితివా బహుమానము. లేకున్న-యవమా నము. దుర్గాదాసు శరవేగముతో నశ్వముపైవెళ్ళి యిచ్చట జరిగిన విషయమునంతను జెప్పియుండును. పదాతిసైన్యముతో వెళ్ళిన నాలస్యమగునుగాన నాశ్వికదళముతోఁ గదలిపొమ్మ”ని తీవ్రముగ నాజ్ఞాపించెను.

దిలేర్ ఖాన్ చక్రవర్తి యాజ్ఞయయినవెంటనే యయిదు వేల యాశ్వీదళముతో హుటాహుటి మహామాయయున్న చోటికిఁ బోయెను. పాపము! రాజపుత్రులు రాజకుటుంబమును మహమ్మదీయుల కంటఁబడకుండ ముందుగాఁ దప్పింపలేనని గృహముపీడి బయటకువచ్చుచుండిరి. ఇంతలో మన్ను మిన్ను నేకముచేయు ధూళితో మొగలుసైన్యము ప్రత్యక్షమయ్యెను. రాజపుత్రులపని 'తానొకటితలచిన దైవమొకటితలచిన' ట్లైనది. మొగలుసైన్యమునుఁ జూచినవెంటనే రాజపుత్రులు ప్రభు కుటుంబమును లోనికిఁదీసికొనిపోయిరి. దిలేర్ ఖా నయిదువేల యాశ్వీక సైన్యముతోను రాజపుత్రుల నివాసగృహములనుఁ జుట్టుముట్టి లోనివారు బయటకుఁగాని, బయటివారు లోనికిఁ గాని పోకుండ రాకపోకల నిర్బంధించెను. మహామాయనుఁ బ్రాణములతోఁ బట్టుకొనుమని చక్రవర్తియాజ్ఞ. యుద్ధముజరిగి నచో మహామాయ కపాయము తటస్థిపవచ్చును. ఆమె సజీవ ముగా దొరకనిచోఁ జక్రవర్తి యాగ్రహించును. రాణిని సజీవ ముగా బట్టుకొనుటకై దిలేర్ రాజపుత్రులదగ్గఱ కొక రాయ బారమంపెను. "మీరు వెంటనే మీరాజకుటుంబమును నప్పగిం పుడు. అట్లైన మిమ్ములనుఁగాని, మీస్త్రీలనుఁగాని, ఏమియు చేయము. లేనిచో మిమ్ములనందఱఁజంపి, మీస్త్రీలనపహరించి, మీరాణి నామెపుత్రిని బంధించి కొంపోదుము. ఒకరోజు మీకుగడువు. ఈగడువులో మీసమాధానము రాకపోయి నచో మీనివాసములు పరశురామప్రీతిఁగాగలవు".

రాజపుత్రులు, దిలేర్ఖాను సందేశమునువిని, ఏమిచేయుటకును దోపక గొట్టుమిట్టులాడుచుండిరి. యుద్ధమునకు సిద్ధమయినచో రాణియు, నామెచిన్నకుమారుడును నశింతురేమో. యుద్ధము మానుదమన్నను రాజకుటుంబము తమకు దక్కునట్లు లేదు. ఈక్లిష్టసమయములో నేడుగడ దుర్గాదాసేయని వారి కందఱకుఁ దెలియును. అదియునుఁగాక దుర్గాదాసు, జస్వంతుని నమ్మినబంటు. తనప్రాణము ధారవోసియయినను ప్రభుకుటుంబమును రక్షింపదొరకొన్న స్వార్థత్యాగి. అందుచే నందఱును సీయూపత్సముద్రమునుండి తప్పించుటకు దుర్గాదాసే సమర్థుడని యాభారమంతయు నాతనిమీదనే యుంచిరి.

దుర్గాదాసు దీర్ఘముగ నాలోచించుచుండెను. ప్రాణములపై నాతనికి దీపియేలేదు. ప్రభుకుటుంబము నెట్లు రక్షింపలయును? చుట్టును యమకింకరులవలె మొగలు సైనికులు కాపలాకాయుచున్నారు. తమవారు బయటకు బోవుటకుగానిఁ బయటివారు లోనికివచ్చుటకుగాని వీలులేదు గదా! అట్టితఱి రాణిని నామెకుమారుని రక్షించుటెట్లు? వీరందరిట్లాలోచించుచుండ మహామాయ యచ్చటకు వచ్చినది. ఆమెను చూచి యందరును లేచినిలఁబడిరి. మహామాయ దుర్గాదాసు నెదుట నిలచి "స్వార్థత్యాగీ! నీప్రభుభక్తి నాకిరువదివత్సరములనుండి బాగుగదెలియును. వివాహమునుగూడ దేశముకొఱకే మాని జీవితమునింతవరకు ప్రభుసేవయందే గడపిన మహాస్వార్థత్యాగివి నీవు. ఈ నీ స్వార్థత్యాగమున కఖండ భారతావనియు గర్వించుచున్నది. ఇంతవఱకుఁ గంటికెప్పవలె

మమ్ముఁ గాపాడుచుంటివి. అనాథనైన నాకిప్పట్టున నీవే యాధారమైతివి. నేడు నీ ప్రభునికుటుంబమును నశింపజేయుటకై ప్రళయవాత్య యొకటి కన్నుదెఱచినది. దానినుండి గూడ రక్షించుభారము నీదే; దుర్గాదాసూ! వినుము. నాకు మరణమనిన భయము లేదు. నాకున్న మూఁడేండ్ల యీడు గలయీడుబిడ్డ మరణించునన్న భయముకూడ లేదు. ఇఁక నీప్రభుని వంశాంకురము, కన్నులదెఱవనికసుగందు, అజితుఁడొకఁడున్నాడు. ఇతఁడు కనుమూసిన నీవిశాలప్రపంచమున నిర్వక్రపరాక్రముఁడై చక్రవర్తినిగూడ హాయిగ నిద్దురపోనీయని నీప్రభుని చిరస్మరణీయమైన నామముగూడ నిద్రించును. కాన, నీశక్తియుక్తులఁ బ్రయోగించి యీ యర్భకుని రక్షింపు"మని నిశ్చలుఁడై నిలచియున్న దుర్గాదాసున కామె కుమారుని నప్పగించినది.

మహారాణి యప్పగించిన యజితుని దుర్గాదాసు తన చేతులలోనికి తీసుకొన్నాఁడు. అజితుని మోము ముమ్మూర్తుల జస్వంతుని మోమునే పోలియున్నది. ఆమోములో నేవో యస్ఫుట భావములు దుర్గాదాసుకు గోచరింపసాగినవి. "దుర్గాదాసూ! నేను నీప్రభువునేసుమా! మొన్నటివఱకు నాకు వజ్రకవచమైయున్న నీవు నేడెట్లు రక్షించెదవో! వాహామాయ ఆదుది. నారక్షణభారమంతయు నీదే." భావనావీథిపథికుఁడైన దుర్గాదాసుకుఁ గన్నులు చెమర్చినవి. అతనికి దెలియకుండగనే రెండుకన్నీటిబొట్లు బాలుని మోముపై బడినవి. బాలుఁడు కిలకిలలాడినాఁడు. దుర్గాదాసు కన్నులు దుడిచికొని "తల్లీ! యీ రేబిడ్డను తీసికొని లోనికి దయచేయుము. నాశక్తివంచన

లేకుండ నీ శిశువును రక్షించుటకై ప్రయత్నింతును. పైన భగవంతుడున్నాడు. మా ప్రభుని యాత్మ నాకండగానుండి, ఈపనినిం దప్పక నెఱవేర్పించునని నాయూహ" యని నుడివెను. ఆమాటలువిని యొక వేడినిట్టూర్పు విడచి మహామాయ లోనికేఁబోయినది.

దుర్గాదాసొక యుపాయమాలోచించినాడు. కాశిము మహమ్మదీయుడు. ఎన్నేండ్లనుండియో దుర్గాదాసునుసేవించుచున్నాడు. దుర్గాదాసుకు కాశిము హృదయము చక్కఁగఁదెలియును. కాశిము జాత్యా మహమ్మదీయుడైనను నాతనిమనస్సు బహుమెత్తనిది. దానియందు సత్యము, అహింస, భక్తి మొదలగు సద్గుణములు ప్రకాశించుచుండెను. ఆతడు, స్వార్థత్యాగి, దేశభక్తుడు నయిన దుర్గాదాసు మహాత్మున కాశ్చర్యపడియాతనికి వశుడైనాడు. ఆనాడు మొదలుకొని కాశిము దుర్గాదాసును "మహారాజా!" అని పిలుచుచుండును. దుర్గాదాసును మహారాజా యని పిల్చిన నోటితోఁ జక్రవర్తియైన మహారాజా యని పిలువనని యాతఁ డొట్టుదల. కాశిమ్ మాట జ్ఞాపకమునకు వచ్చినంతనే దుర్గాదాసు సమరదాసుతో "కాశిమ్‌ను పిలువు" మనెను. "మహమ్మదీయుడైన కాశిమ్‌తో నిప్పుడేమిపని" యని సమరదాసు ప్రశ్నించినాడు. ఇప్పుడు వాదులాటకు సమయముగాదు. ముందు కాశిమ్‌ను పిలువుమని దుర్గాదాసు గద్దించినాడు. సమరదాసికమాఱుబల్కక వాకిటనున్న కాశిమ్‌ను బిలుచుకొని వచ్చినాడు. కాశిమ్ లోన ప్రవేశించుచునే దుర్గాదాసునకు సలాముచేసి "మహారాజా! ఎందుకు పిలిపించి

తిర"ని యడిగెను. దుర్గాదాసు కాశిమ్‌ను దగ్గఱకుపిల్చి "కాశిమ్! నీతో నొక యత్యవసరమైన పనివచ్చినది. నేడు మనప్రభువం శాంకురము నీచే రక్షింపబడవలసి యున్నది. ఈకార్యమును తీర్చి నామాట దక్కించు"మని పల్కెను. "మహారాజా! మీ యాజ్ఞ నెప్పుడైన నతిక్రమించితినా! నాప్రాణములకన్నను మీయాజ్ఞయందే నాకు మక్కువ మిక్కుటము. రాజపుత్రు నెట్లురక్షింపవలయునో సెలవిండు." అదుగో! మిఠాయిగంప. ఆగంపలో నడుగున నొత్తుకొనకుండ మెత్తని పక్క వేసి రాజపుత్రుని నిదురబుచ్చి యాపక్కపైఁ బరుండబెట్ట వలెను. ఆపైనొక బట్టగప్పి ఆగంపను నెత్తిబెట్టుకొని సింహద్వారముగుండనే పోవలయును. ఎవరైన మహమ్మ దీయు లడ్డుపడిన గంపలోనిది మిఠాయియని జెప్పుము. నీవు మహమ్మదీయుడవే యగుటవలన మొగలులునిన్ను నమ్మ దరు. ఈగంపను తిన్నగా నాయెదుటి కొండపైనున్న దేవాల యముదగ్గఱకు తీసికొనిపోయి అచ్చటనున్న పూజారి కీబాలకు నిమ్ము. ఇప్పుడింతకంటె గత్యంతరములేదు. లెమ్మని" దుర్గా దాసు చెప్పెను. కాశిమ్ అందులకుసమ్మతించినాడు.

అంతయు సిద్ధమయినది. అజితుడేడ్చి పాలుత్రాగి నిద్రించినాడు. అమ్మా!కుమారుని తెండనిదుర్గాదాసు రాణితో చెప్పెను. రాణికుమారునిఁ దీసికొనివచ్చినది. ఎదుట గంప సిద్ధముగనున్నది. రాణిబిడ్డను గంపలోఁ బరుండబెట్టఁబోయినది; భవితవ్యమును గుఱించి యామెహృదయ మూరాటపడినది. పరుండబెట్టినది; తిరిగిబిడ్డ నెత్తుకొన్నది; మరలపరుండబెట్టినది;

స్తన్యపానముచేయుబిడ్డడు! చుట్టునుశత్రుమండలి! అభీకర రాక్షసులమధ్యనుండి బిడ్డడు పోవలెను! వారేమాత్రము పసిపట్టిన నామెకడుపు కాలిపోవలసినదే! ఈయూహాతతి యామెహృద్రంగమున మెఱసినంతనే యామె బిడ్డని గుభాలున చంకనెత్తుకొన్నది. నాయనా! ఇదియేరా! నీకును నాకును నంతిమసమాగమము. తిరిగి కలిసికొందమన్న యాశ లవలేశమయిన నాకు లేదని వాపోవసాగినది. బిడ్డడు లేచును, లేచిన పంపుటకువీలు లేదని దుర్గాదాసు హెచ్చరించినాడు. ఎట్టెట్టో హృదయము పదిలించుకొని కుమారుని రాణి కాశిమున కిచ్చినది. కాశిము మెల్లగా నజితుని గంపలోఁ బరుండఁబెట్టినాడు. రాణి హృదయముఁ సుడిగాలిలో దిసుగు నెండుటాకువలె, గిలగిల కొట్టుకొన్నది. "అయ్యో! బంగరుగద్దె నధివసించి రాజదండముఁ బూని శత్రువుల గడగడలాడించుచుఁ బుడమినేలదగిన నా చిట్టి ప్రభువు శత్రువులకు భయపడి యగతికుడై యీ చిన్నగంపలో నొదిగి యుండవలసివచ్చెను గదా!" యని దుర్గాదాసు వాపోయినాడు. "మహారాజు నాజ్ఞను నెరవేర్చి యాతని దుఃఖమెట్లు తీర్తునా" యనికాశిమాలోచించుచుండెను. ఇంతలో రాణి లోనినుండి యొకబాకును దీసికొనివచ్చి "కాశిమ్! నాకుమారుని శత్రువులు చూచినచో నీబాకుతో వానిగుండె చీల్చుము. అంతియేగాని నాకుట్టిని నౌరంగజేబునకుదొరుకనీయ వద్ద"ని యాబాకు నాతనికిచ్చెను.

కాశిమ్ గంపనెతుకొని యెకాయకి బయటికిఁ బయనించెను. సింహద్వారమువఱకు నెల్లరు వాని ననుగమించిరి.

కాశిము సింహద్వారమునుదాటి మహమ్మదీయ సేనా మధ్యమునుండి పోవుచుండెను. గంపనెత్తుకొని పోవుచున్నది మహమ్మదీయుడే కాని జాలామందికి సందేహమే కలుగలేదు. ఒకరిద్దరడిగినను గాశిము యుక్తిగా సమాధానము చెప్పియుఁ, సంకనునిర్బంధించిన దగ్గఱనున్న మిఠాయీలు యుండలనిచ్చియుఁ, దప్పకొనిపోయెను. 'చావుతప్పి కన్నులొట్టపోయిన' విధమున గాశిము మొగలుల యుపద్రవములన్నియు నీగి కొండనెక్కి గుడిచేరెను.

కాశిమ్ మహమ్మదీయ సైన్యసముద్రము నుత్తరించు వఱకు పిడుగడచినట్లు రాణి దిగులుతో సౌధాగ్రమునుండి కాశిమ్‌పోవు మార్గమునే చూచుచుండెను. ఇఁకఁ దన కుమారునకు భయము తీరినదని తెలియఁగనే రాణి యొక్కసారిగ లేచి నిలబడినది. ఆమెలో నొక క్రొత్తకాంతి తాండవించినది. ఆమెయుత్తేజమున కందఱు నాశ్చర్యపడసాగిరి.

రాణి, యిటునటు పచారులుచేయుచు, "దుర్గాదాస్! ఇఁక నాకేమియు భయములేదు. మరణభయమసలే లేదు. బ్రతికియున్నచో నీనరరూపరాక్షసుల, నీబిడెయోముఖవిషకుంభముల, సమస్తసామ్రాజ్యము నొక్కపరి గడగడలాడించి వారి ప్రాణములతో నాటల నాడవలెనని యున్నది. ఈ యొక్క రోజు నన్ను రక్షింపుము. ఆవల నేనే యీమహమ్మదీయ ఘోరాటవికి దవానలమునై స్వయముగ నవసరమున్నంతవఱకు బ్రతికెదను. అవసరము తీరిన వెనుక నా నాధుని జూడఁబోయె

డ''ననిపలికెను. శక్తివంచనలేకుండఁ బ్రయత్నముచేసి రాణిని రక్షింపవలయునని దుర్గాదాసనుకొనెను.

దిలేర్‌ఖాను పెట్టినగడువుతీరినది. రాజపుత్రులదగ్గఱ నుండి యేమియు సమాధానము రాలేదు. దిలేర్ మండిపడి యుగ్రుఁడై రాజపుత్రుల ముట్టడింపుమని యశ్వసైన్యమున కాజ్ఞయిచ్చినాడు. మొగలులు "అల్లాహోఅక్బర్" అని యఱచుచు రాజపుత్రుల వసతులను ముట్టడించిరి. గృహద్వారముల బ్రద్దలుకొట్టసాగిరి. వారి యాఘాతములకు ద్వారము లూగుచుండెను; భూమికంపించుచుండెను; దిక్కులు మాఱుమ్రోగుచుండెను.

సంభవించినయీప్రళయమునుజూచి రాజపుత్రులందఱు యుద్ధమునకు సిద్ధమయిరి. దుర్గాదాసు లేచి నిలఁబడినాడు. ఆతనితో రాజపుత్రులందఱు లేచినిలబడిరి. దుర్గాదాసు తేజితకంఠముతో "వీరవరులారా! మనమిప్పుడు జీవనమరణసంధ్యలో నున్నాము. రాజపుత్రు లిదివఱకు మడమత్రిప్పి యెఱుఁగరు. మనమా! ఱెండువందలమందిమి శత్రువులైదువేలయాశ్వికులు, అయినను మనము భయపడనవసరములేదు. మనలో నొక్కొక్కర మొక్కొక్క వందమందికిఁ దగియుందుము. మనరాణి కొఱకై యొక్కొమ్మడిగ నీశత్రుదవాగ్నిలో నుఱుకుటకు సిద్ధముగ నుండవలయును. ఇందులకు మీఱందఱు నాతో సిద్ధమేనా?" యని పలికెను. రాజపుత్రులందఱు 'మేముసిద్ధము-మేముసిద్ధమ'ని ముందునకువచ్చిరి. మహామాయ తనమూడేండ్ల

యాఁడుబిడ్డను గంతమునకుఁ గట్టుకొని, జుట్టు విరియఁబోసుకొని, చేతఁగ త్తిని ధరించి, రాజపుత్రులదగ్గఱకు వచ్చినది. ఆమె కిరు ప్రక్కల,దుర్గాదాసును సమరదాసులుండ నిశ్చయించిరి. ఒకవంద రాజపుత్రులు రాణికిముందును మఱియొకవందమంది వెనుకనుఁ బోఁదలచిరి. తక్కిన స్త్రీలందఱు తమయాచారము ప్రకారము శత్రువులకుఁ జిక్కకుండఁగఁజిచ్చులోనుఱకవలెను. ఈవిధముగ శత్రువుల నెదుర్కొనుటకు సర్వము సిద్ధమయినది.

సమరదాసును దుర్గాదాసు దగ్గఱకుఁబిలిచినాడు. సమర దాసు సోదరుని దగ్గఱకు వచ్చి నిలఁబడినాడు. అంత దుర్గా దాసు,"సోదరా! ఒక తల్లికడుపున జన్మించితిమి; తల్లిదండ్రులు మరణించిన నేలోటులేకుండఁగ నొక్కచోటనే పెరిగితిమి. ఒక్క ప్రభువునే సేవించితిమి; ఒకనిసేవలోనే మరణింపనుంటిమి; ఈ విపత్సముద్రమునుండి బ్రతికి బయటఁబడుదుమో లేదో తెలి యదు సోదరా! దగ్గఱగారమ్ము. ఒకసారి నన్ను గట్టిగఁ గౌగి లించుకొనుము. ఇదియేమనకుఁ జరమాలింగనమేమో" యనెను. అన్నదమ్ములిద్దరికనుఁదమ్ములు చెమర్చినవి. ఊట లూరినవి. ప్రవహించినవి. ఇద్దఱునొకరినొకరు కౌగిలించు కొన్నారు. ఒకరికన్నీటిచే మఱియొకని వీపు తడిసినది. మూఁడు ముహూర్తముల గాలముగడచినది. ఇరువు రొక్కింతతేరిరి. "అన్నా! యుద్ధమున కేగ ననుజ్ఞయిమ్మ"ని యడుగుచు సమర దాసు దుర్గాదాసుపాదముల నభిషేకించెను. అనుజ్ఞాపూర్వక ముగ లేవనెత్తుచు నన్న దమ్ముని శీర్షమును దడిపెను. ఇందలో "ఢా"మ్మని తుపాకిమందు ప్రేలుడుశబ్దము భూనభోంతరములు

దద్దరిల్ల వినఁబడినది. "తమ్ముఁడా! స్త్రీలు చితిలోనుఱుకుటయుఁ బూర్తియయినది. ఇఁక యుద్ధరంగమున కేగుదము రమ్మని దుర్గాదాస నెను. మఱుక్షణములో నాసోదరద్వయము యథా నిర్ణయముగ యుద్ధములోఁ బాల్గొన్నది.

యుద్ధము ప్రారంభమైనది. జుట్టు విరియఁబోసికొని ఖడ్గధారిణియై సాక్షాత్ కాళివలె నుండు మహామాయనుజూచి, మొగల్ సైన్యమేకాదు రణరంగభీముఁడైన దిలేర్ ఖానుఁగూడ నాశ్చర్యచకితుఁడయ్యెను మహామాయ వక్షస్థలముపై నాడు బిడ్డ నిదురించుచుండెను. ఆబిడ్డనుగూడ లక్ష్యము చేయక యామె యాఁడుసింహమువలె గర్జించుచు రాజపుత్రులు శత్రుపులనుఱుమాడి తన్నసుఁద్రోవఝుచ్చుచుండగ శీఘ్రగతిలోఁ బోవుచుండెను. వీరాధిపుఁడైన దుర్గాదాసు తనధవళాశ్వము నెక్కి రాణినిఁ గంటికిఱెప్పవలెఁగాపాడుచుండెను. ఆశ్చర్యచకితమైన మొగల్ సైన్యము చూచుచుండెనే కాని యామె నడ్డు పెట్టలే కుండెను.

మహామాయ సగము మొగల్ సైన్యము నతిక్రమించి నది. ఇంతలోనే దిలేర్ నిదురనుండి మేల్కొనినవానివలె మేల్కొని "సైనికులారా! కత్తులదూయుఁడు; రాజపుత్రులఁగొట్టుఁడు; రాణినిఁబట్టుఁడు;" అని బిగ్గరగా గేకవైచెను. ఆకేకతో మొగల్ సైన్యముల్కిపడి యాయుధములనెత్తి రాజపుత్రులనడ్డగించి నది. మొగల్ సైన్యములోనుండి యొకబాణము రివ్వునవచ్చి మహామాయ జుట్టులోగుండదూసికొని పోయి దుర్గాదాసు చేతికిదగిలెను తోడనే దుర్గాదాసు కనులెఱ్ఱవారినవి. ఆరక్త

ముత్తైనవి. నిప్పులుకురిసినవి. బొమ్మలుముడిపడినవి. కోరమీస ములుహుంకరించినవి. ఖడ్గసర్పము బుసకొట్టినది.విజయాశ్వము పేరెములువారినది. దుర్గాదాసాక్క సారిగవిజృంభించెను. అది ఘోరప్రళయాట్టహాసము; త్రిపురాంతకుని ప్రళయతాండవము; కల్లోలసముద్రఘోష; దుర్గాదాసు విజయాశ్వమును జిత్ర విచిత్రముగ నడిపించుచు శత్రువుల మర్దింపసాగెను. తాను ప్రక్కనయుండగనే తన ప్రభుసత్త్వపై బాణముపడుటా యని యాతని యహంకారము. యుద్ధము ముదిరెనది. ప్రాణ ముపైఁ దీపికలవాఁడెవ్వఁడును దుర్గాదాసు నెదుటఁ బడుట లేదు. ఎన్నో యుద్ధములు చూచిన దిలేర్ ఖానుకూడ నావీరమూర్తి వీరవిహారమునకు డాసోహమనినాఁడు. మూర్తీభవించిన క్షాత్ర మువలెనున్న దుర్గాదాసు పరాక్రమముచే మొగల్ సైన్య మంతయు స్తబ్ధమైనది. ఒడలు మఱచి దారియిచ్చినది. ఆదారి నుండి మిగిలిన వందమంది రాజపుత్రులతో నతివేగముగ రాణి పయనించినది. అఱగడియ గడిచినది. దిలేర్ స్వాస్థ్యము చెంది నాఁడు. "పట్టుఁడు; పట్టుఁ"డని బిగ్గరగ నఱచినాఁడు. హతశేష మైన నాలుగు వేలకత్తులు నాకేకకు ఝణఝణశబ్దించినవి. నూతనోత్సాహముతో రాణినిఁబట్టుకొనుటకు ముందుకుదుమికినవి. ఏది రాణి! మొగలుసైన్యము రాజపుత్రులు పోయిన మార్గ మునుజూచినది. రాజపుత్రుల యశ్వఖురాహతమై నింగికెగయు చున్న పరాగమునుజూచి చప్పరించినది. నిస్తేజస్కమై పరా జయభారముతో వెనుకకు మరలినది.

## ౬

హతశేషులైన సైనికులతోను, మహామాయతోను దుర్గాదాసు మేవాడరాజ్యములో నడుగుపెట్టెను. తాను బ్రతికి యుండియుఁ దనప్రభుని పత్ని పరునిపంచకు వెళ్లుచున్న దే యని యావీరవరుని విచారము. కాలము మహాశక్తివంతము; విధి దుర్లంఘ్యము; ఏకాలమం దేదియనుభవింపవలెనో యదియను భవింపక తప్పదు. పోనీ మేవాడకుపోక మార్వాడకే పోదమన్న యాదేశమంతయు నరాజకమై తమ రాణికి నాశ్రయమిచ్చు పరిస్థితిలో లేదు. కాఁబట్టి మేవాడురాణా యాశ్రయమొక్కటి దక్క యారోజులలో నౌరంగజేబు కోఱలనుండి తమరాణిని రక్షింపఁగలది మఱియొకటిలేదు. చివరకుదుర్గాదాసొక విధముగఁ దృప్తిపడెను. మహారాణా రాజసింహుఁడు ధార్మికుఁడు, ఆశ్రితవత్సలుఁడు, సాటివాఁడు. అటువంటివాని యండఁగోరుట తమ కధర్మముకాదు. ఈవిషయములనే మహామాయకుఁ గూడఁ జెప్పి దుర్గాదాసామెనొప్పించెను. శత్రుమారణహోమమునకై పట్టుపట్టిన యారాచపడుచు దుర్గాదాసు బోధనాలించి మహారాణా నాశ్రయించుట కొప్పుకొనెను. ఈ విధంబగు నొడంబడికతో వారు రాజసింహుని రాజ్యమైన మేవాడు వచ్చి తమరాకను. రాణాకెఱింగించిరి.

రాజసింహుఁడు కర్ణాకర్ణిగ నౌరంగజేబు జస్వంతుని కుటుంబమునకుఁ జేసిన యపకారములను వినియుండెను. అప్పం

తొడు మరణించినప్పుడే రాణా మనము క్రించపడినది. ఆకించి పృథ్వీసింగు మరణముతో బాధగామారినది. ఔరంగజేబు పట్టు దలతో క్రోధముగ మారినది. ఏవిధముగనైన మహామాయకు దానుసహాయము చేయుటయే యుచితమని యాతఁడు తలఁచు చుండెను. ఇట్టిపరిస్థితులలో నాతనికి బాసటగానుండుటకు భీమ సింహుఁడుండిన నెంతబాగుండును! కుమారుని విషయము జ్ఞాపకమునకురాగానే రాణా కన్నుల నీరుగ్రమ్మినది "అయ్యో! భీమసింహా! నీ తత్వమును దండ్రినయ్యు గుర్తింపలేకపోతినికదా! నీయట్టి యమూల్యపుత్రరత్నమును గాలఁదన్నుకొన్న నావంటి నిర్భాగ్యపుఁ దండ్రి యెచ్చటనైన నుండునా! జయసింహుఁడు శాంతాదాసుఁడు. వాని సహాయము నాకు లభించునన్న యాశ నాకేమాత్రము లేదు" అని కొంతవాపోయెను. ఇంతలో మరల నొకసేవకుఁడువచ్చి మహామాయాదుర్గాసుల యాగమనమును నివేదించెను. మహారాణా వెంటనే భవనమునుండి బయటకు వచ్చి వారిని లోనికాహ్వానించెను. అందఱును లోనికిఁబోయి యాసనములం దుపవిష్టులయిరి.

కొంతసేపందఱు నిశ్శబ్దముగనుండిరి. చివరకుదుర్గాదాసు రాణాతో జరిగినసంగతంతయు వివరించియిట్లనెను. "మహా రాజా! మారాజపుత్రుఁడొక దేవాలయపునర్చకునియొద్ద రహ స్యముగ నున్నాఁడు. ఆతనిని సంరక్షించుటకు మీరుదక్క యన్యు లెవ్వరు సమర్థులుకారు. మీ రాశ్రయమీయనిచో నిఁక మార్వాడరాజవంశము నిలచుటకష్టము. మఱియొకవిషయము; మీ రాశ్రయమిచ్చిన నాకుఁ గుమారరక్షణభార మిఁకనుండదు. కాన నాప్రభుహంతకుని యాటకట్టించుటకే సర్వదా ప్రయ

క్షించుచుందును. ఈ విషయమున మీరొద్దు చెప్పవలదని" నా ప్రార్థన. రాజసింహుఁడామాటల విని యిట్లనెను. "దుర్గాదాసా! జశ్వంతసింగు నాసహోదరునివంటువాఁడు. అతనికుటుంబమును రక్షించుట నాకానందమే. నాశక్తివంచనసేయక తప్పక రాజకుమారుని రక్షింతును." మహారాణాతో రాణియిట్లన్నది. "ఆర్యా! నాకిరువురుపుత్రులు; ఒకపుత్రిక; పెద్దబిడ్డ ఔరంగజేబు విషవస్త్రములిచ్చి పొట్టనుబెట్టుకొన్నాడు. నాకుమార్తె నేటి ప్రయాణములో మరణించినది. ఇఁకమిగిలిన దీబిడ్డడొక్కఁడే. ఎట్లైన వానిని మీరురక్షింపవలె"నని నాప్రార్థన. మహారాణా కన్నులు చెమర్ప "అమ్మా! నీకుమారుఁడు నేను జీవించి యున్నంతవఱకేమియు భయము లేదని యభయహస్త మిచ్చుచున్నా"నని పలికెను. మహామాయ కన్నులమూసి "ప్రభూ! నీలీలలనంతములు. దిక్కులేనివాఁడు నీసృష్టిలో లేడు. దానికిప్పటి నాచరిత్రయే దృష్టాంత"మనుకొనెను.

ఇంతలోఁ గాశీమ్ రాజకుమారు నెత్తుకొని యచ్చటకు వచ్చెను. మహామాయ దభాలున లేచి బిడ్డనందుకొన్నది. మహారాణా దుర్గాదాసువలన రాజపుత్రునిఁదెలిసికొని ఈతఁడెవడని కాశీమునుగూర్చి ప్రశ్నించెను. దుర్గాదాసు కాశీమువృత్తాంతమును జెప్పినాడు. "అయిననీతఁడు మహమ్మదీయుఁడా" యని రాణా ప్రశ్నించెను. కాశీ ముులిక్కిపడి "ప్రభూ! జాతిఁబట్టి నన్ను నిందింపకుఁ"డనెను. "కాదుకాశీమ్! నిన్ను నేనునిందించుటలేదు. పరమాత్ముని సృష్టివైచిత్ర్యమున కద్భుతమందుచున్నాను. ఒకేమహమ్మదీయజాతి; ఆ జాతియందే ఔరంగజేబు జన్మించినాడు; అందే నీవు నుద్భవించితివి; సముద్రమొకటే

అగాదే పరస్పర విరుద్ధధర్మములుగల విషామృతము లుద్భవించి నవి; ఒకటి ప్రాణముతీయును; ఒకటి ప్రాణమునిచ్చును; ఆహా! కాశిమ్! చూచితివా; సృష్టిరహస్యము! దానిఁగూర్చియే నేనాలోచించుచుంటి"నని రాణా బలికెను. కాసిమ్ సిగ్గుచేఁ దలవంచుకొనెను. ఏదిరోజ్ఞప్తికిరాగా రాణా దుర్గాదాసుతో "దుర్గాదాసూ! ఔరంగజేబుదురంతములు సాంతముగ సాగుచున్నవట. మరలజిజియాపన్నును, గోవధను బ్రారంభించినాడట. అన్నిటినిమించి మార్వాడ రాజవంశమును వేటాడనుంకించుచున్నాఁడు; ఇఁక నాతని దుండగముల కొకపరి యుద్ధముతగిలిన గాని యాగునట్లు లేదు. నీయభిప్రాయమేమి? యుద్ధమయినచో రక్తపుటేఱులు ప్రవహించును. శాంతియుతముగ సంధిజరిగిన బాగుండు"ననెను. మహామాయ దిగ్గునలేచి, "సంధియా! శాంతియుతముగనా! [illegible] పడమటపొడిచినట్లే! మహారాణా! క్రూరవ్యాఘ్రమెప్పుడైన బాలహరిణముగునా! మీయాసలన్నియు నడియాసలే. ఈయాలోచనలన్నియు నెమదుకురావు; యుద్ధనే నీయెడఫలప్రదము; అదియే నాశానందము; అందు, ఆమహారణరంగమందు, నా భర్తృహంతకుని నాశనము చూచితీరవలెను. అప్పటికిఁగాని నాకు శాంతియుండదు. నా మనస్సున కూరటగలుగ"దని యాయాసపడుచుఁ బలికెను. "మహామాయా! ఎందులకంతయాయాసపడెదవమ్మా! రణమునందు మరణములును, బరస్పరద్వేషములు నెక్కువ. శాంతియుతసంధియందు విశ్వమానవకల్యాణ మిల్లుకట్టుకొన్నది. ఈ రెంటి నిప్పుడేదిమంచిదో నీవే చెప్పుము! నే చెప్పిన మార్గము మన కనుకూలమ్ముకానిచో నీమార్గము నే యనుసరింతము. దాసీ

దొందరకూడ"దని రాణాపలికెను. మహామాయ మఱిమాటాడ లేదు.

మహారాణా రాజసింహుఁడు చక్రవర్తికొకలేఖ వ్రాసెను. ఆలేఖయందలి విశేషములివి. "ఔరంగజేబూ! నిరంకుశత్వమెన్నటికి ఫలింపదు. ప్రజాదరమున్నఁగాని ప్రభుత్వముస్థిరముగనుండ లేదు. నీవుచక్రవర్తివి. ప్రజలనందఱఁ సమానముగ జూచుటయే నీవిధి. నీవిధానమంతయు నిందులకు వ్యతిరేకముగనున్నది. నీచేఁ బాలింపఁబడువారిలో నెక్కువభాగము హిందువులే. నీపాలన యంతయు వారిమీఁదనే యాధారపడియున్నది. అది గ్రహింపక లిన్నయింటివాసములు లెక్కపెట్టినట్లు హిందువులరాజ్యము పాలించుచు వారికే యెగ్గులు కల్పించుచున్నావు. ఇది కేవలము నీస్వార్థపరత్వమును దెల్పుచున్నది. హిందువులపైఁ దిరిగి జిజియాపన్నును విధించినావట. గోవధను విపరీతముగ సాగించుచున్నావట. అంతియకాక నీకెన్నో సహాయములు చేసిన జస్వంతుఁడు నీకొఱకేమరణించినప్పటికిని, విశ్వాసములేక యిప్పుడు, నిరపరాధియగు యాతనికుటుంబమును నాశనము చేయఁజూచుచున్నావట. ఈపనులన్నియు నిద్రించుచున్న హైందవజాతిని లేచ్చగొట్టుచున్నవి. ఇప్పటికైనఁ జక్కగ నాలోచించి సర్వప్రజారంజకుఁడవు కావలసినది. చక్రవర్తినిగదాయని పైచూపు చూడకుము. హిందూజాతియంతయు నేకమైన దానికసాధ్యము లేదు. ఈయుత్తరమునుజూచి మనసుమార్చుకొని మాతో స్నేహముగనుండవలెనని గోరుచున్నాము". ఇట్లు, నీక్షేమాభిలాషి, మహారాణా రాజసింహుఁడు.

దుర్గాదాసాయు త్తరమును జూచిచక్రవర్తి విషయములో నిట్టియు త్తరములు పనిచేయవనెను. "కుక్కకాటుకు చెప్పు దెబ్బయే" కాని యిట్టివి వ్యర్థములని సమరదాస నెను. ఉత్తరము పనిచేయనితోఁ జివరియుపాయ ముండనేయున్నదని రాణా పలికెను. చక్రవర్తికి సైనికబలము మెండు. మనసైన్యమంతయుఁ గలిసినను నాతనిసైన్యములో నెనిమిదవ వంతుఁగూడ నుండదు. కాన నిప్పటినుండి తగుజాగ్రత తీసికొనవలెనని దుర్గాదాసు పలికెను. ఆమాటల కందఱు సమ్మతించి తగుప్రయత్నములు చేయసంకల్పించిరి. మహామాయకూడఁ దనదేశమునకేగి సాధ్యమైన సైన్యమును సమీకరింతునని పలికినది. రాణాయనుజ్ఞపై నెవరెవరి పనులమీఁద వారేగిరి.

దిలేర్‌ఖాన్ పరాజితుఁడై మిగిలిన నాలుగువేలసైనికులతో ఢిల్లీకిఁ దిరిగివచ్చెను. ఈ సంగతి పాదుషాకుఁదెలిసినది. ఆతని యాశ్చర్యమునకు మేర లేదు. ఒక్కయోధుఁడి రెండువందల రాజపుత్రుల సహాయముతో నైదువేల యాశ్వికులను జీల్చుకొనిపోవుటయా! ఇదిసంభవమా! సంభవము కాకుండు టెట్లు! ఈవిషయమే ఢిల్లీయంతట మాఱుమ్రోగుచున్నదే! ఆవిషయమందలి సంభవాసంభవములను జక్రవర్తి నిర్ణయింపలేక పోయెను. యథార్థమును దెలిసికొనుటకై దిలేర్‌ఖాన్‌ను బిలిపించెను. దిలేర్ వచ్చి సలాముచేసి నిలఁబడినాడు. పాదుషా యాతని నాపాదమస్తకము చూచినాడు. దిలేర్ నిశ్చలముగ నిలచియుండెను. 'దిలేర్! నే విన్న మాటసత్యమేనా?' 'సత్యమే సమ్రాట్' 'సత్యమా! ఇదియుసత్యమేనా? నీవపుడు సైనికులతో నిద్రపోవుచుంటివా?' 'లేదుసామ్రాట్; ఆమహారాణిస్వరూపము

మాతృ మహాకాళిస్వరూపమువలెఁ గన్పడినది. ఆ మాతృ స్వరూపమును బట్టుకొనలేక మేము కొంతసేపూరకుంటిమి. రాణి మన సైన్యముమధ్యనుండి పోవుచుండెను. ఇఁక నూరకున్న లాభములేదని రాణినిఁ బట్టుడని సైనికుల కాజ్ఞయిచ్చితిని. కాని యాదుర్గాదాసు ఖడ్గముముందు, ఆతని విజయాశ్వ చంక్రమణములముందు మా యుత్సాహములన్నియు వమ్మయి నవి. సాహసముతో రాణినిఁ బట్టుకొనఁబోయిన వేయిమంది మొగల్ సైనికుల ప్రాణములు ననంతాకాశములో లీనమయినవి. మొగల్ సైన్యమా వీరవిహారమునకు దడిసి వెనుకకుమరలినది. ఆసమయమున రాణితో దుర్గాదాసు మనసైన్యముమధ్యనుండి వడివడిగఁబోయినాడని దిలేర్ఖాను పలికెను.

ఔరంగజేబు దిలేర్ఖానునుఁ గొన్నిచీవాట్లువైచి పంపి వేసెను. ఈమాత్రైననుఁ దనప్రియురాలిక్రోధచ్యుతి కలుఁగునని యాతఁడు తలఁచెను. కాని జరిగినసంఘటనవలన నామెయగ్నిలో నాజ్యముపోసినట్లు కాఁగలదు. ఏమైనను జేయునదిలేక పాదుషా మెల్లమెల్లగ నంతఃపురమునకేగెను. గులనారంత కుముందే యావార్తనువినియుండుటచే నౌరంగజేబును జూడ గనే 'లోకత్రోక్కి-నత్రాచువలె' లేచి యిట్లు పలికినది. 'ఓయునవచక్రవర్తీ! నీఘనత నాకిప్పుడు తెలిసినది నీచక్రవర్తిత్వ మును నమ్మి నిన్ను వివాహమాడిన నాయదృష్టముఁ గూడ నేఁడు నాశనగతమైనది. ఇంత చక్రవర్తివైయుండియు నొకయాఁడు దానినిఁ బట్టుకొనలేక పోయినందుకు నీకు సిగ్గుకలుగుటలేదా! ఏమొగముపెట్టుకొని నా మొగముచూడవచ్చితివి!' ఔరంగజేబా మె కడ మోకరిల్లి "ప్రేయసీ! నీవిషయమున నేనెప్పుడైనను

బ్రాలుమాలితినా! నీకోర్కెను సంపూర్ణముగఁ దీర్చుటకై ప్రయత్నము చేసితినిగదా! పంపినది తక్కువసైన్యమా! అయిదు వేల యాశ్వికదళము; దానినంతయు నాకాఫరు దుర్గాదాసు గడగడలాడించినాడట. ఆతఁడు రాణికంగరక్షకుఁడై కత్తి త్రిప్పుచుండగా నెవ్వడును, సాక్షాత్ దిలేర్ఖాను గూడ నామె దగ్గఱకే చేరలేకపోయినాడట. పిదపఁ బంతముతో రాణినిఁ బట్టిపోయిన వేయిమందిని నాకాఫరొక్కఁడే నఱికివేసినాడట. లేనిచో నీకోర్కె నెఱవేఱియుండెడిదే" యనెను. గులనారు హృదయమానందాప్లావితమైనది. ఆ! దుర్గాదాసెంతవీరుఁడు. ఆతని నామమే చక్రవర్తికిఁగూడ భయహేతువైనది. అంతటి మహావీరుఁడీ భరతఖండమున మఱియొకఁడు లేఁడనుట నిక్కము. గులనారునకు పరాక్రమవంతులనిన నమితాభిమానము. ఇందులకుఁ గారణమామె చిన్నతనమునఁ గొంత శస్త్రవిద్యనభ్యసించుటయే. అమానుషపరాక్రమవంతుఁడైన దుర్గాదాసామెకొక దివ్యపురుషుఁడుగఁ గోచరించినాడు. అతనిపై యూహాలతో నామె కన్నులు మెఱసినవి. ఒడలు గగుర్పొడిచినది. ఆభావముల నడంచుకొని యామె లేనికోపముతో నౌరంగజేబువైపు తిరిగి "మహామాయ యిపుడెచటనున్నది? దుర్గాదాసెచటనున్నా"డని ప్రశ్నించెను. ఇరువురునూ మేవాడరాణా యాశ్రయమందే యున్నారని యాతఁడు చెప్పెను. 'మేవాడు దేశముపై తక్షణమే యుద్ధము జరిగితీరవలెను. ఆ యుద్ధములో మహామాయయు, దుర్గాదాసునుఁ బట్టుపడవలెను, వారిరువురిని నేనే స్వయముగా నధీనముచేసుకొని శిక్షింపవలెను.' తెలిసినదా! చక్రవర్తీ! ఆలస్యముచేయక వెంటనే సైన్యములఁ బంపుమని గులనారు

విసురుగఁ బలికెను. 'ప్రేయసీ! ఈ విషయమాలోచించెదను. మేవాడు రాజపుత్ర దేశము. రాజపుత్రులకుఁ బులులకు నేమియు భేదము లేదనువిషయము నీకును తెలిసిన దేగదా! అదియునుఁ గాక యిప్పుడు రాజపుత్రులందఱు నేకమగుచున్నట్లు కనప్పట్టు చున్న'దని పాదుషా పలికెను. 'ఏమి! భారతసార్వభౌము నకు చిన్న మేవాడ దేశముమీఁద దండెత్తుటకుఁగూడ నాలోచన యా! వీలు లేదు. నాకోర్కె యీడేరినప్పుడే తిరిగి మనప్రణయ విశ్వాసము. అంతవఱకు నాదగ్గఱకు రావలదని, కసరి యామె లోని కేగినది. పాదుషా యవమానముతో తలతముడుకొనుచు మేవాడు యుద్ధమునుఁగూర్చి సేనాపతులతో నాలోచించుటకై పోయెను.

౭

ఔరంగజేబు తన లేఖను లక్ష్యము చేయక దానిని నిమిత్త ముగఁ జేసికొని మేవాడుపై కెత్తివచ్చుటకు యత్నములు చేయు చున్నాడని రాణాకుఁ దెలియవచ్చెను. పాదుషాదండయాత్ర నదివఱకే రాణా యూహించుచుండెను. చక్రవర్తి లక్షలాది సైనికులతోఁ దనపైకి వచ్చుచున్నాడు. తనసైన్యమో వేలాదిలో నున్నది. ఈసైన్యవేణితో నా సైన్యసముద్రమును భేదించు టెట్లు? రాజపుత్రరక్త మత్యల్పమైనసమయమున నసాధ్యముం డదు; అదియునుంగాక మహావీరుడైన దుర్గాదాసు తనయండ నుండ నౌరంగజేబు నెదిరించు టేకాదు త్రిభువనములోకపెట్టున

నత్తివచ్చినను భయపడనవసరము లేదు. ఆనాఁటి దుర్గాదాసుని మహత్తటువంటిది. ఇఁక నాలస్యముచేసిన లాభము లేదని తలచి దండయాత్రవిషయ మాలోచించుటకై రాణాసత్వరము రావల సినదని రాజపుత్రసరదారుల కందఱకు వార్తలనంపెను.

సభజరుగురోజువచ్చినది. రాజసింహుని యభ్యంతర గృహమున సభకేర్పాట్లుచేయఁబడినవి.సభాంగణమువిశాలమై యుండెను. నేలనంతయు రత్నకంబళములచే నాచ్ఛాదింపఁబడి యుండెను. అతిథులు కూర్చుండుటకుఁ దగు నేర్పాట్లన్నియుఁ జేయఁబడెను. కొలదిసేపటిలోనే యాహూతరాజపుత్రులచే సభ నిండిపోయినది. దుర్గాదాసు,రాణాలు సభకింకను రాలేదు. ఇంతలో మూడుసారులు ఫిరంగులుమ్రోగినవి. అదియే రాణా రాకనుసూచించుధ్వని; రాణారాకను గమనించిన సభ నిశ్శబ్ద మయినది.రాణాసోపానముల నధిరోహించుచు దుర్గాదాసుతోఁ గూడ సౌధాగ్రమునను్న సభకు వచ్చెను. రాణాను జూచిన వెంటనే రాజపుత్రులెల్లరు భయభక్తులతో నిలఁబడిరి. మత్త శుండాలగమనములో దుర్గాదాసువెంబడింప రాణా ధీర స్మిత మైన నడకతో సింహాసనముఁ జేరి రాజపుత్రులఁగూర్చుండుడని చెప్పి తాను గూర్చుండెను. రాణాకుఁ గుడిభాగముననున్న మఱియొక యుచితాసనముపై దుర్గాదా సుపవిష్టుఁడయ్యెను. రాణా తమనేలపిలిపించెనో యేమిచెప్పునో యని రాజపుత్రు లాతురతతో నెదురుచూచుచుండిరి.

కొలఁదిసేపుండి రాణా నెమ్మదిగఁ దనయాసనమునుండి లేచి, యొకక్షణముండి "వీరవరులారా, నే నత్యవసరముగ

మిమ్మెందులకుఁ బిలిపించితినో మీలోఁ జాలమందికిఁ దెలిసి యుండదు. పాదుషా రెండు సంవత్సరములకుఁబూర్వము హిందువుల కసమ్మతములైన, గోహింసాది కార్యముల జేయనని యొక విధముగ మనతో సంధి చేసికొన్నాఁడుగదా! ఇప్పు డాతఁడా సంధి నియమముల నుల్లంఘించి, తిరిగి జిజియా పన్ను మొదలగు హైందవవిరుద్ధములైన కార్యములఁ జేయుచుండుటయేకాక, మన సాటివాఁడైన జగ్గంతుని కుటుంబమును నాశముచేయఁ గోరుచున్నాఁడు. నేనిమ్మహాసంధినుల్లంఘించిన, రాజపుత్రులు మీలోఁ గలిసియుండిరనియు, మీరు మాకుఁ దిరిగి వైషమ్యము లేర్పడుననియు, వానిపరిణామము భయంకరముగ నుండుననియు, లిఖిత పూర్వకముగఁ బాదుషాకుఁ దెలుపుఁ జేసితిని. ఆ లేఖను నిమిత్తముగఁ జేసికొని, నాయాశ్రయమందున్న మహారాణాయను బట్టుకొనుటకై చక్రవర్తి యనేకలక్షల సైన్యముతో మేవాడుపైకి రానున్నాడట. ఆతని నెదిరించుటకై మనమందఱ మేకము కావలెను. ఇందుకే మిమ్ముల బిలిపించితిని. చక్రవర్తి నెదిరించుటకై తగిన సలహాలనిచ్చి, యార్థికముగ, సైనికముగ మీరు నాకుఁ బూర్తిగఁ దోడ్పడవలెను. దీనివిషయమై మీ మీ యభిప్రాయములఁ దెల్పు”డని పలికి యాసనమున నుపవిష్టుఁడయ్యెను.

సభయంతయు నాలోచనాసముద్రమున మునిగియుండెను. చీమచిటుక్కుమన్న మాఱుమ్రోగుచుండెను. ఎవరేమి చెప్పిన నేమివచ్చునోయని ప్రతియొక్కఁడును జంకుచుండెను. వైరము సామాన్యునితోనా! భారతచక్రవర్తితో; అర్థాంగబలము లపరిమితముగఁగల చక్రవర్తితో; సరియైన సలహా చెప్పవలెనన్న సామాన్యమా! ఇట్లే యర్ధగంటగడచినది. సభమౌనముద్రను

పీడలేదు. ఇఁక లాభము లేదని దుర్గాదాసులేచి యిట్లు హెచ్చరించెను. "సోదరులారా! యేమి! యీమహానిద్ర; మాతృభూమి విపద్గతమైయుండ నేమి! యీ మీ యౌదాసీన్యము! క్షాత్రమంతయు నన్యపాదాక్రాంతమగుచుండ, ఏమి! యీనిద్ర! మీలోనున్న క్షాత్రరక్తము గడ్డకట్టుకపోయినదా! ఈయమూల్యావకాశమును జారవిడిచిన మఱి మనకు ముక్తి లేదు. నేఁడే మనమండలము మనబలములతో రాణాకు నండగనుండిన మన వంశగౌరవము తిరిగి తలయెత్తఁగలదు. ఇట్టి సందిగ్ధసమయములోనా! మీ మహానిద్ర! లెండు నడుముకట్టుఁడు." ఆ హెచ్చరికతో రాజపుత్రులకుఁ గన్నులు తెరువఁబడినవి. ముకుందదాసు లేచి, "దుర్గాదాసూ! మేము సహాయముచేయుట కెప్పుడు సిద్ధులమే. ఈ మహాసంగ్రామము జరుపుట కనువైన, యీహా మాకుఁ దోచకుండుటచే నూరకుంటిమి. అంతియకాని మాకు మార్గదర్శకుఁడొకఁడున్న నగ్నిలోనుఱుకుమన్న నుఱికెదము; సముద్రములనీదమన్న నీదెదము; కొండలఁబిండికొట్టమన్నఁ గొట్టగల"మని పలికెను. తక్కిన రాజపుత్రులుకూడఁ దమతమ యుత్సాహముల వెల్లడించిరి.

ఇంతలో దూరమునుండి యశ్వపదఘట్టన వినవచ్చినది. క్రమముగ నాశబ్దము సమీపించినది. ఆవచ్చువారెవరాయని వారు చూచునంతలో నౌరంగజేబు యుద్ధసన్నాహములఁ దెలిసికొనుటకేగిన సుబలసింగు గబగబ మెట్లనెక్కి రాణావారి యనుమతి మీఁద సభారంగమునకువచ్చెను. రాణా కభివాదనముచేసి రాణా కెదురుగ వంగి నిలఁబడెను. "సింగూ, విశేషములే"మని రాణాయడుగగ నాతఁడు "మహారాజా! పాదుషాసైన్యము

సుమారు మూఁడులక్షలున్నది. దానినాతఁడు మూఁడుభాగములుగఁ జేసి యొకభాగమున కక్బరుని నాయకునిగఁ జేసినాడు. అతనివశముననున్నది యేఁబదివేలసైన్యము. ఆసైన్యముతో నక్బరుదయపురమార్గమున మనపైకివచ్చును. రెండవది దిలేర్ ఖాను నాయకత్వమున దాసురీమార్గమున వచ్చును. అదియు నేఁబది వేలే. మిగిలినభాగమునకు సాక్షాత్ పాదుషాయే నాయకుఁడు. అతఁడు రెండులక్షలసైన్యముతో రాజపుత్రరాజ్యములఁ గ్రమముగఁ గబళించుచు దోహారీమార్గమున వచ్చును. ఈ యేర్పాట్లన్నియు నతిచురుకుగ సాగుచున్నవి. వారమురోజులలో సైన్యములు బయలుదేరవచ్చును. దేవరకీ విషయములఁ దెల్పుటకై హుటాహుటిగఁ బయనించి వచ్చితినని విన్నవించెను.

ఔరంగజేబు ప్రయత్నములన్నియు విన్నతోడనే యందఱకుఁ గోపముకలిగినది! మహారాణా కోపముతోలేచి "వీరులారా! వింటిరిగదా! ఈదెబ్బతో రాజపుత్రజాతినే సమూలముగఁ బెకిలింపవలెనని పాదుషాయుద్దేశము. మనమూరకున్న నాతని యాగడముల కంతకంత కంతము లేకుండ పోవును. పాదుషాకు సుమారు మూఁడులక్షలసైన్యమున్నదని తేలినది. మనకా! యింతవఱకు సైన్యసమీకరణమే లేదు. రాత్రింబగళ్లు మన మూపిరిసలుపకుండ పనిచేసినకాని మనప్రయత్నముల కొక రూపము రాదు. ఈవారములో మీ రెవరెవరెంత సైన్యమును సమీకరింపఁగలరో తెల్పు"డనెను. కొంతసేపటివఱ కెవ్వరును మాటాడలేదు. దుర్గాదాసు లేచి "మహారాజా! నేనొకప్రభువును గాను. నా యధీనమున సైన్యమేమియు లేదు. నేనొక రాజపుత్ర సామాన్యుఁడను. అయినప్పటికినీవారములోఁబదివేలసైన్యమును

సమీకరింపఁగలన నెను. దుర్గాదాసుమాటలుపూర్తికాకమునుపే సభయంతయు జయజయధ్వానములతోను, హస్తాస్ఫాలనములతోను, బ్రతిధ్వనించెను. రాజపుత్రులలో నుత్సాహ మతిశయించినది. ఆజయధ్వానులమధ్య 'విక్రమసోలంకి' యను సర్దారు లేచి తా నిరువదివేల సైన్యము సమకూర్తు న నెను. గోపీనాథుఁ డొక యిరువదివేలు పంపగల న నెను. భిల్లనాథుఁడైన గరీబ్ దాసు తానొక పదివేలవిలుకాండ్ర నంపుదు న నెను. విజయసింహుఁ డిరువదివేలిత్తు న నెను. ఇట్లే రాజపుత్రులందఱొసగిన భాగములుకలసి యొక లక్షనఱకుండెను. ఎక్కడలక్ష! ఎక్కడి మూఁడులక్షలు! ఇంతలో మహామాయలేచి తానును గొంత సైన్యమును మార్వాడనుండి సమీకరింతు న నెను. స్త్రీయయ్యును నామె పట్టుదలకుఁదిరిగి సభయంతయుజయజయధ్వానములతోఁ బ్రతిధ్వనించెను.

రాజపుత్రసైన్యము పాదుషాసైన్యములో మూఁడవవంతు మాత్రమేయగుటచేఁ బాదుషా నెట్లెదుర్కొనవలెనో యెవ్వరికిఁ దెలియలేదు. అదియునుగాక పాదుషా రాజపుత్రులమీఁదికి ముప్ఫ్రధములుగ వచ్చుచున్నాఁడు. ఆమూఁడుభాగములలోఁ దా నెవరిమీఁదకుఁ బోవుట. ఏ యొక్కరిమీఁదకుఁగాని పోయిన పాదుషాసైన్యములమధ్య నలఁగి పోవలసివచ్చును. రాజపుత్రులందఱు నాలోచించుచుండిరి. కాని యెవ్వరికిని నేయూహయుఁ దోచలేదు. తోచినను నది సబబుగనుండునో యుండవో యని సందేహము. ఈ మహాసంగ్రామములో మార్గదర్శకుఁడు దుర్గాదాసే యని వారియుద్దేశము.

ఆపరిస్థితిగమనించి దుర్గాదాసులేచి, రాణాకభివందన మాచరించి యిట్లనెను. 'మహారాజా! నాదొకవిన్నపము; ఔరంగజేబు మూఁడువైపులనుండి ప్రచండసైన్యముతో మనపైకి వచ్చుచున్నాఁడుకదా! మన మేకముగనున్నచో మూఁడుదిక్కుల నుండి వచ్చు శత్రువాహినుల నడికట్టఁజాలము. శత్రువులు మన దేశసమీపమునకువచ్చువఱకు మనమూరకుండరాదు. అట్లూరకున్న శాంతిభద్రతలకు భంగము వాటిల్లును. శత్రువు మూఁడు ప్రక్కలనుండి వచ్చుచుండుటవలన మనముకూడ ముర్విధము లుగఁజీలి వాని నెదిరింపవలెను. అట్లయిన శత్రువేప్రక్కనుండియు ముందుకురాజాలడు. ఇదియే యిప్పటిమనకర్తవ్యము.

దుర్గాదాసుని సమయోచితప్రతిభ, రాణాను, దక్కిన సర్దారుల నాశ్చర్యసముద్రములో ముంచివైచెను. అప్పటికంత కంటె మంచియుపాయములేదని యందఱు నాతని సలహానే యనుసరించుటకంగీకరించిరి. ఇఁకమిగిలినది సైన్యవిభాగము

సైన్యము నెట్లువిభజింపవలెను? ఏభాగమున కెంతసైన్య ముంచవలెను? ఏభాగమున కెవ్వని నాయకునిగఁ జేయవలెను? ఆసైన్య మెప్పుడేమార్గమునఁ బోవలెను? ఈవిధముగఁ బ్రశ్న పరంపర, లుత్పన్నములైనవి. ప్రశ్నలుద్భవించుచేకాని వానికి సమాధానము లేదు. ఒకప్రశ్న మఱియొకప్రశ్నపై నాధారపడి యున్నది. మొదటిప్రశ్నకు సమాధానమువచ్చినఁగాని రెండవ ప్రశ్నకు సమాధానము రాదు. ఈప్రశ్నపరంపరలో సర్వసేనాధి పతియెవ్వరనుప్రశ్నగూడ నొకప్రక్కనుండి వచ్చినది. మహా సేనాపతి నిర్ణయమైనఁ దక్కినసమస్యలనన్నిటిని నాతఁడే తీర్చునని

మఱియొకఁడుపలికెను. మహారాణాతలంపుఁగూడ నదియే. ఆయనకు దుర్గాదాసునుసర్వసైన్యాధ్యక్షునిగఁ జేయవలెననియున్నది. ఆవిషయమును ముందుగఁజెప్పిన రాణా పక్షపాతముచూపెనని యందురు. ఆనాటివిఁగణములో దుర్గాదాసుదే పైచెయ్యి. సభవారిసమక్షమున నావిషయముంచిన వారందఱు దుర్గాదాసునే కోరుకొందురని రాణా యూహ.

అంతరాణా లేచి "రాజపుత్రులారా! సర్వసేనాపతియన సామాన్యుఁడుకాడు. మనభవిష్యత్తంతయు నాతనిపై నాధారపడి యుండును. ఇప్పట్టున మనసమస్య చాలగష్టముగనున్నది. ఇట్టికిష్ట సమస్యనుఁ దీర్చగల, ధీరుని, వీరుని, స్వార్థత్యాగిని, పరేంగితావగాహిని సైన్యాధ్యక్షునిగ మీరెన్నుకొను"డని పలికెను. రాజపుత్రులందఱు నొక్కుమ్మడిలేచి "దుర్గాదాసే మా సేనాపతి"యని హర్షధ్వానములతోఁ దెలియపఱచిరి. దుర్గాదాసును మహామాయ వినా యందఱును శ్లాఘించిరి. రాణా బంగారుపిడి కలిగి, రత్నాలుచెక్కబడి, దృఢమై, దీర్ఘమై, కుబుసమునువీడిన త్రాఁచువలెనున్న ఖడ్గరాజ మొకండు తెప్పించెను. అదిసర్వసేనాపతిఖడ్గము. సర్వసేనాపతిగా నెన్నుకొనఁబడువాడు రాణానుండి యాఖడ్గమును దీసికొనుట యాచారము. రాణాయాఖడ్గమును రెండుచేతులతోఁ బట్టుకొని దుర్గాదాసు నాహ్వానించెను. దుర్గాదాసు వినయవినమితోత్తమాంగుఁడై మెల్లగ రాణాదగ్గఱకు వెళ్ళెను. రాణా దుర్గాదాసుతో "దేశభక్త! ఈఖడ్గముతోఁబాటు సమస్తరాజపుత్రసైన్యము నీయధీనమగును. వానితో నీ మాతృదేశము నుద్ధరించి నీకీర్తిలతకుఁ బందిరివేసికొనుము. ఇది మొదలు సర్వయుద్ధతంత్రములు నీచేతిమీదుగ నడచు"నని

ప్రీతివిస్ఫారితలోచనములతో ఖడ్గమునందిచ్చి యాశీర్వదించెను. దుర్గాదాసు ఖడ్గమును స్వీకరించి, తన కంతగౌరవమిచ్చినందులకు, రాణాకు, రాజపుత్రులకుఁ గృతజ్ఞతఁదెలిపి యిట్లనెను. "మహారాజా! ఇపుడు నాశిరముపై మహాభారముంచితిరి. సైన్యములు సమాయత్తములైవచ్చిపిదమ్మాటవిభాగము చేయుటమంచిదని నాయుద్దేశము. ఏ సైన్యము లెట్టివో బరికించి విభాగములు చేసి, తగిననాయకుల నేర్పాటుచేయుదము. మహారాణాగారికి నాదొకకోరిక. ఈ ప్రచండసంగ్రామరంగములో సైన్యాధిపత్యము వహించుటకుఁ ద్యాగశీలురు, సాహసులు కావలెను. అట్టివారిలో మీజ్యేష్ఠపుత్రుఁడు భీమసింహుఁడగ్రగణ్యుఁడు. అతఁడు మీయాజ్ఞ లేనిదే మేవాడులో నడుగిడఁడు. ఆతనిని మీరుపిలిపించిన మనకుముఖ్యసహకారిగ, నొకసైన్యభాగమునకు నాయకుఁడుగ నతఁడుండగలఁడు. కాన మీరాతనిఁబిలిపింపవలె" నని నామనవి. దుర్గాదాసుమాటలు వినుచున్న రాణా కన్నులశ్రుపరిపూర్ణములయ్యెను. రాజపుత్రులందఱు తప్పక భీమసింహునిఁ బిలిపింపుఁడని రాణాను గోరిరి. రాజస్థానములోఁదన పుత్రునకున్న గౌరవమునకు రాణా మిక్కిలి తోషించెను. రత్నమును బోఁగొట్టుకొన్నందుకుఁ జాలవిచారించెను. రాణాయంగీకారముతో సభముగిసినది. రాజపుత్రులును, మహామాయయు, దుర్గాదాసును, దమదమ వాసస్థానముల నెఱవేర్పుటకై పోయిరి. రాణా యంతఃపురమునకేగెను.

మహామాయ యొకరసపుత్రునితో మార్వాడపోయి తన భవనము సమీపించెను. ఆభవనము మహమ్మదీయుల వశమందుండుటచే నామె యొకపేదవాని యింటికేగి తన్నెఱింగించు

కొనెను. వాఁడును భయసంభ్రమములతో నామెను సత్కరించి తనయింట నామెను విడిది యేర్పాటుచేసెను. రాణి యచ్చటనే యుండి తనవెంటవచ్చిన రసపుత్రునిద్వారా తన రాకను ప్రజలకుఁ దెలియఁజేయుచుఁ బ్రజల విశ్వాసమును సంపాదింప నారంభించెను.

ఒకరోజున మహారాణి యొక సభ నేర్పాటుచేసినది. దానికి గ్రామీణులందఱువచ్చిరి. రాణి వారికి జరిగినవిషయ మంతయుఁ జెప్పినది. ఔరంగజేబు తన కుటుంబమునకు జేసిన పరాభవమును, నాశనమును దుద్ఘాటించినది. నాఁడుసు చేయనున్న నాశనమును విశదీకరించినది. "ఓ ప్రజలారా! పాదుషా మీరాణి కాశ్రయమిచ్చిన మేవాడుపై దిరిగి మూఁడులక్షలసైన్యముతో వచ్చుచున్నాడు. మీరాణికొఱకై మీరందఱు మేవాడ్ రాణాకు సహాయము చేయవలెనని కోరుచున్నాను." ఆమె మాటలువినఁ బ్రజలు చాలవిచారమునుదెలుపుచు, "అమ్మా! మిమ్ములను జూచిన మాగుండెలు తఱుగుకొని పోవుచున్నవి. కాని మే మేమిచేయఁగలమమ్మా! ఎక్కడిపాదుషాసైన్యము! ఎక్కడిమే"మని ప్రజలు తమనిరుత్సాహమును ప్రకటించిరి. రాణి యుద్రిక్తయై "మీరేమియు చేయలేరా! మీ మహారాజే యిప్పుడు బ్రతికియున్న వారిముందఱ మీరీమాటల ననఁగలిగి యుండెడివారేనా? నేను వారి విధవస్త్రీని; అనాథను; కాన నన్నీవిధముగ మీరు తిరస్కరింపఁగలిగితిరి. నా ప్రజలయండకూడ నాకుఁ దక్కులేదుగదా!" యని నిట్టూర్చినది. ఆనిట్టూర్పుగాలి ప్రజలను గదలించినది. రక్తముడుకెత్తించినది.

ముందుకుమాకడని త్రోసినది. “అమ్మా! మాప్రాణము లొడ్డియైన నిన్ను రక్షింతుము; నీకు సహాయముచేతుము; నీవు చెప్పినట్లు నడచుకొందు”మని వారు కేకలువైచిరి. రాణిసంతోషించి వారిలో దృఢగాత్రులను, నుత్సాహవంతులను, గూర్చి యొకసైన్యమును దయారుచేయ నారంభించెను.



వారముదినములలో రాజపుత్రసైన్యమంతయు మీవాడ చేరినది. మహామాయకూడఁ బదివేల సైన్యమునుదీసికొనివచ్చినది. మొత్తము రాజపుత్రసైన్యము లక్షపదివేలు. ఈసైన్యములో నౌరంగజేబు నెదిరింపగలమా! యనిరాణా ప్రశ్నింప, దైవమనుకూలించిన నేమియు ఫరవాలేదని దుర్గాదాసు పలికెను. సైన్యమంతయు నుదయపురముచుట్టు డేరాలువేసికొని యుండెను. చుట్టను డేరాలు, మధ్యనుదయపురము, చూచుట కాదృశ్యము సముద్రమధ్యమందున్న ద్వారకవలెనుండెను.

ఒకనాటిప్రొద్దున దుర్గాదాసు రాజసింహద్వితీయుఁడై సైనికనికాయము పరిశీలించుటకై వెళ్ళెను. తమనాయకుఁడైన దుర్గాదాసుని జూచి సైన్యసముద్ర మొక్కపరి పొంగినది. సైన్యమును జూచుచున్న రాణాతో, ధుర్గాదాసు ‘మహారాజా! సైన్యమునిట్లుంచిన లాభములేదు. ఈ మహాసైన్యములో నెవరు మనవారో, యెవరు పరులో గుర్తింపలేము. ఇట్లున్నచో

శత్రువులగూఢచారులు మనసైన్యములోఁ బ్రవేశించి రహస్యములు గుర్తింతురు. ప్రత్యేకసైనికపద్ధతినొక దాని నేర్పాటు చేసిన పరసైనికుల వెంటనే గుర్తింపవచ్చు'ననెను. "వీరవరా! నీవుసర్వసైన్యాధ్యక్షుఁడవు! అన్నివిషయములందు నీకు సంపూర్ణాధికారమున్న"దని రాణాయనెను. సైన్యమునంతయుఁ బరిశీలించి యిరువురును నివాసములకరిగిరి.

మఱునాడు దుర్గాదాసు సైనికవ్యవస్థనొకదాని నేర్పాటు చేసెను. పదిమందిసైనికుల కొకనాయకుఁడుండును. వాఁడు తన పదిమందిని గుర్తుపెట్టుకొని వారిబాగోగులు చూచుచుండవలెను. ఇట్టినాయకులకుఁ బదిమందికిఁ గలిపి మఱియొకనాయకుఁడుండును. అట్టిశతనాయకులకుఁ బదిమందికిఁ గలిపి యింకొక నాయకుఁడుండును. అట్టిసహస్రనాయకులకుఁ బదిమందికి గలిపి యింకొక నాయకుఁడుండును ఈవిధముగఁ బదివేలవఱకు సైనికవ్యవస్థనుగట్టుదిట్టము చేసెను. శత్రుభీకరమైన యీవ్యవస్థనుజూచి రాణా యత్యాశ్చర్యముకలవాఁడయ్యెను. తదుపరి సైన్యమును మూడువిధములుగ విభజించెను. పదిహేనువేలొక భాగము, ఇరువదియైదువేలొక భాగము, చొప్పున రెండు భాగములు చేసెను. మిగిలినయరువదివేలొకభాగము; మొదటిరెండు భాగములకు నిరువురునాయకులుండవలె. వారిరువురు, దిలేర్ ఖానును, అక్బరును నెదుర్కొనవలెను. అరువదివేలకాధిపత్యమునహించిన వాఁడు పాదుషాప్రచండసైన్యము నెదుర్కొనవలెను. ఇంకను మిగిలిన పదివేలు నగరమును రక్షించుచుండవలెను. ఈవిధముగ

సైన్యవిభాగము పూర్తియగునప్పటికి బాదుషాయుద్ధమునకుఁ ద్రివిధసైన్యముతో బయల్దేరినాడనివార్తవచ్చెను.

భీమసింహుఁడు తండ్రిపిలుపునందుకొని మేవాడవచ్చెను. వచ్చుచు నాతఁడుఁ గొంతయాహారమును, పానీయమును వెంట దెచ్చెను. ఆతనిపట్టుదల కందఱు నాశ్చర్యపడిరి. రాణాహృదయము కుమారునిజూడగనే సంక్షోభించినది. ఐనను ధీరుఁడు కావున సంతాపమును లోన నిముడ్చుకొని "భీమా! మాతృదేశముపై నీకున్న యాదరాభిమానములకు నేనెంతయో సంతసిల్లితిని. 'నిన్ను గన్నందుకు గర్వించుచున్నా'నని పుత్రునాలింగనము చేసికొనెను.

భీమసింహుఁడు సంగతిసందర్భములన్నియు నాకళింపుచేసికొని సర్వసైన్యాధ్యక్షుఁడైన దుర్గాదాసుకు నమస్కరించెను. అందఱును దగుప్రయత్నములోనుండఁ, బ్రథమ భార్యయైన సరస్వతిచే నెట్లో ప్రబోధింపఁబడి జయసింహుఁడుగూడ యుద్ధసన్నాహములు జరుగుచోటునకు వచ్చెను. అంతఃపురమును వీడి యాతఁడెట్లువచ్చెనా! యని యందఱాశ్చర్యపడిరి. రాణా, జయసింహుని ప్రవృత్తి తెలిసినవాఁడుకాన యుద్ధమునకు రమ్మని కబురంపలేదు.. రాణాదుర్గాదాసుతో నిట్లనెను. "సర్వసైన్యాధ్యక్షా! ఇరుగో! నాకుమారులు; వీరిరువురనుగూడ మహాసేనానివైన నీయధీనము చేయుచున్నాను. ఇది మొదలువీరిరువురు నీయాజ్ఞానువర్తులై మెలగగల"రనెను. రాజపుత్రులిరువురు తమయంగీకారమును దెలిపిరి. దుర్గాదాసామాటల కపరిమితానందము పొందెను. రాణాయంతవాని పుత్రులుకూడఁ దన చెప్పుచేతలలో

నుండుటన్నఁ దనకెంతగౌరవము. రాణా మాటలస్వీకరించి మహారాణాకు దుర్గాదాసు నమస్కారము చేసెను.

దుర్గాదా సిరువదియొకువేల సైన్యభాగమునకు భీమసింహుని, మఱియొకభాగమునకు జయసింహుని నాయకులనుగాఁ జేసెను. తక్కిన యిరువదివేలభాగమును దాను దీసికొనెను. దానిలో నాతఁడుక్కుతునకలవంటి పాదుషాసైన్యముతోఁ దలపడసాహసించెను. "యశోవా, మృత్యుర్వా" ఈరెంటిలో నేదియో యొకటి సుక్షత్రియునకుఁ గాంక్షణీయమని యావీరవరుని యాశయము. ప్రభుభక్తుఁడును, స్వార్థత్యాగియు నైన యామహాత్మునకుఁ బ్రాణములు తృణప్రాయములుకదా!

దిలేర్ఖాను వచ్చుమార్గము పర్వతమయము. అందువలన నది శత్రువులకగమ్యమై యున్నది. సహజదుర్భేద్యమైన యాప్రదేశమున నున్నవానికి శత్రువు నెదిరించుట కష్టసాధ్యము కాదు. ఉపాయమున్నవానికును; దుర్గాదాసుని యనుచరులలో గరీబ్దాసని యొకఁడుండెను. అతనికి గొండమార్గములన్నియుఁ గొట్టినపిండి; కండ్లకు గంతకట్టి దుర్గమములైన యాకొండలలో వదలినను నాతఁడు నిరపాయముగ బయటకు రాగలఁడని యానాటి ప్రతీతి. ఈ విషయములన్నియు నాలోచించి, దుర్గాదాసు గరీబ్దాసుసహాయముతోఁ గొండమార్గములందు జయసింహుఁడు దిలేర్ఖాను నెదిరించున ట్లేర్పాటుచేసెను. ఇఁక నక్బరొకమార్గమున నేబదివేలసైన్యముతో వచ్చుచున్నాఁడుకదా! అతనికిఁ దహావ్వర్ఖానను నొకపఠాన్ సేనానికలఁడు. అతఁడు యుద్ధమున ముక్కాకలుతీరిన మొనగాఁడు. అట్టివాని నెదిరించు

టకు సాహసవంతుఁడు, పరాక్రమవంతుఁడు కావలెను. అందు లకు భీమసింహుఁడే సమర్థుఁడు. భీమసింహుని నిరువదియైదువేల సైన్యముతో నక్బరుపైకి పోవుట కేర్పాటుచేసెను. ఇఁకమిగిలిన సైన్యమేయున్నది, తానేయున్నాడు. పాదుషాయున్నాడు; ఆవిషయమున దుర్గాదాసుకంత విచారమేలేదు. ముగ్గురును ముగ్గురుశత్రువుల నెదుర్కొనవలెను. ఏవైపుననుండియు నొక్క శత్రుసైనికునిగూడ మేవాడపైఁ రానీయరాదు. ఇది సైన్యాధ్యక్షుని నిర్ణయము.

దుర్గాదాసునకు యుద్ధవిషయముకంటె శ్రద్ధనూపఁదగిన విషయము మఱియొకటికలదు. అదిజస్వంతుని పుత్రుఁడైన యజితుసరక్షణ. అజితుఁడు మేవాడు రాజగృహమందుఁ బెరుగుచున్నాడు. ఇంతలోఁ బ్రళయయుద్ధము తటస్థించినది. జయాపజయములు దైవాధీనములు. ఒకవేళ మహమ్మదీయులు మేవాడ్ నాక్రమించిన! శాంతం పాతం! ఏదియెట్లున్నను బ్రస్తుతస్థితిగతులనుబట్టి రాజకుమారుని మేవాడలోనుంచుట క్షేమముకాదు. మఱియెచ్చట నుంచవలెను! ఔరంగజేబుకందని చోటెక్కడ గలదు! దుర్గాదాసు తలయెత్తి యాలోచింపనారంభించెను. తలయెత్తిన యాతసకెదురుగఁ గొన్నిమైళ్ళలో నంబరచుంబిశిఖరంబులగు నారావళీపర్వతములు కనుపించెను. అవి యలంఘ్యములు; అగాధములు; దుర్గమములు; నిత్యమునచటఁ దిరుగు భిల్లులే త్రోవతప్పి తబ్బిబ్బులపడుచుందురు. సూర్యుఁడుగూడ, జొరశక్యముగాని గుహాపర్వతగుహాలలో రాజపుత్రునుంచిన నౌరంగజేబుగాని మఱియెవ్వఁడుకాని కనుగొనఁజాలఁడు. దుర్గా

దాసు దీర్ఘముగనాలోచించినను రాజపుత్రు నచ్చటనుంచుట కంటె గత్యంతరముతోచలేదు. దుర్గాదాసు వెంటనే విశ్వాస పాత్రులైన, శివసింహుఁడు, ముకుందసింహుడను రాథోరువీరుల తో "రాజపుత్రులారా! రాజకుమార రక్షణభారమంతయు మీదే. రెండువందలసిపాయిలతో రాజపుత్రుని నాకొండల మధ్యకు గొనివెళ్ళి యనువైన ప్రదేశముచూచి రాజపుత్రు నచటడించుడు. ఔరంగజేబు వీనికొఱకై వేయికండ్లతో వెదకు చుండును. ఏమాత్రమపాయమువచ్చినను నాకొఱకు భటునిఁ బంపు" డని చెప్పి తాను వెళ్ళిపోయెను.

ఔరంగజేబు యుద్ధసన్నాహములఁ బూర్తిచేసితనగమన వార్తను ప్రేయసియైన గులనార్‌తోఁ జెప్పుట కంతఃపురమున కేగెను. పాదుషా వెళ్ళునప్పటికిగులనారేదియో యాలోచించు చుండెను. చక్రవర్తి యామెనుజేరి బుజ్జగించుచు, "నారూ! ఈమాఱునీకోరిక తప్పక నెఱవేరును. నీకోర్కె కంతరాయమగు చున్న దుర్గాదాసు నీమాఱు తప్పక పట్టిబంధింతును. నీవుకోప ముగ నున్నచో నాకుత్సాహముండదు. దరహాసితమైన నీమో మును జూచివెళ్ళిన, యుద్ధమును జురుకుగఁ జేయింపఁగలను. ఏదీ! నీనగుమోము!"

వయసులో నౌరంగజేబు గులనార్‌కంటె రెట్టింపుఁ బెద్ద. చక్రవర్తికాన నాతని వివాహవిషయములో వయోగతభేదము పాటికిరాలేదు. గులనార్ ఒకహిందూవనిత. ఆమెసహజనామము విశాల. దరిద్రుఁడైన యామెతండ్రి పాదుషా యడుగగనే

తన పుత్రిక నర్పించినాడు. సుందరియైన గులనార్ చక్రవర్తిని బాగుగనాకర్షించినది. పెండ్లియైనతరువాత పాదుషా యామెకు గులనారని పేరిడినాడు. చక్రవర్తికి దడిసి గులనార్ శరీరమునుమాత్ర మర్పించినది. మనసు నర్పించలేదు. కొంత కాలమగుసరి కామెకధికారవాంఛ పొడచూపుటవలనఁ జక్రవర్తిని బాదాక్రాంతునిగఁజేసికొని తానే రాజ్యమేలసాగినది.

దుర్గాదాసు నామమువినగనే యామె యొడలుపులకించినది. ఆ మహావీరుని నామమును వినుటయేకాని దర్శనమెన్నఁడు కలుగఁలేదు. యుద్ధరంగమునకుఁ దానువెళ్ళినచోఁ బరాక్రమధనియైన దుర్గాదాసును జూడవచ్చును. దుర్గాదాసుని పరాక్రమును దప్పక చూడవలెను. అంతఃపురస్త్రీయైన తానేడ! మృత్యుదేవీభీకరదంష్ట్రికామధ్యమైన యుద్ధరంగమేడ! పాదుషా తన్నచటకుఁ బోనిచ్చునా. ఎట్లయినను సమ్మతింపఁజేయవలె. ప్రేమపాశముచే బంధించి తనకోర్కను నెరవేర్చుకొనవలెను. ఇట్లూహించుచు గులనార్ చిరునవ్వుతోఁ బాదుషానుజేరి యాతని భుజముపైఁజేయివైచెను. దానితో నౌరంగజేబామెకుఁ బాదాక్రాంతుఁడయ్యెను. ఓయీ! పిచ్చియౌరంగజేబూ! కృత్రిమవృక్షోపడలలో మెఱుగులువారిన నీ తెలివితేటలు కాంత ముందు చిత్తయ్యెనుగదా! పడుచుపెండ్లాలనుకట్టుకొన్న వృద్ధులందఱిపనియింతియే!

గులనార్ చిఱునవ్వునుజూచి పాదుషా తన్మయుఁడై యామెభుజమునఁ జేయివైచి ప్రపంచమునే మఱచియుండెను. సమయమును గుర్తించి గులనారిట్లుపలికెను. "ప్రియతమా!

మీరు యుద్ధరంగమునకుఁబోవుచుండ నేనింటనుందునా! మీ కంటెనాకుఁ బ్రాణములెక్కువా? అదియునుగాక యుద్ధమును జూడవలెనని నాకెన్నినాళ్ళనుండియో యభిలాష. ఆయభిలా షను మీకంటెఁ దీర్పఁగలవారెవరు? అచట నాకేమేని యపా యముకలుఁగునందురేమో! సింహసదృశులైన మీయండ నుండు నన్నుఁ గన్నెత్తిచూచుటకైన నెవనికి గుండెలుండును? ఈ నాకోరికను దిరస్కరింపవద్దని ప్రార్థించెను. పాదుషాకు గూడ గులనారును విడిచిపోవుట కిష్టము లేదు. అబలయైన గులనారు యుద్ధరంగమునకు వచ్చుటకు జంకునని యాతఁడు తలఁచెనేకాని యామెలో సింహమునకు మించిన తెగువయు, వ్యాఘ్రమునకు మించినకౌటిల్యము నున్నదని యెఱుఁగఁడు. గులనారు తనను విడచియుండలేదని వినిన యావృద్ధప్రేమికుఁ డనిర్వచనీయానంద మనుభవించెను. నాయీ! అట్లేవత్తువుగాక, త్వరగ సిద్ధమగుమని పాదుషా పలుక ఒకగంటలో సిద్ధమగుచున్నానని గులనారు సమాధానమిచ్చెను. బేగమ్ ప్రయాణసన్నాహములు సిద్ధము చేయుటకై పాదుషాక్రిందకుఁ బోయెను.

ఔరంగజేబు గులనారుతోసహ యుద్ధయాత్రకు బయల్దే రెను. ఏనుగంబారిపైఁ బాదుషా యాసీనుఁడయ్యెను. ఆతని యెడమప్రక్కనున్న మఱియొక జలతారు అంబారీలో గుల నారుకూర్చుండెను. ఆయంబారితలుపులు మూయఁబడియుండెను. సూర్యకిరణములాజలతారులోఁ బ్రతిఫలించి యాసైన్యమధ్య మున కొకవింతసోయగము కూర్చుచుండెను. ప్రయాణమునకు శుభసూచకముగ శతఘ్నులుగజ్జిల్లినవి. మున్ముందు కొండల

గుంపువలె గజములు బారులుతీర్చి నడచుచుండెను. ఆ యేను గుల పదఘట్టనచే భూమికంపించుచున్నదా యన్నట్లుండెను. ఆవెనుక సముద్రతరంగములవలె నశ్వదళము బయల్దేరినది. దానికిరుప్రక్కల నిసుకపాతరవలెఁ గాల్బలములు నడువసాగినవి. వానివెనుక ఫిరంగులు మొదలయిన మారణాయుధశకటములు కదలిపోవుచుండెను. దిగన్తరములన్నియు గజఘీంకారములచేతను, హయహేషలచేతను, గాల్బంట్లవిజయనినాదములచేతను, మాఱు మ్రోగుచుండెను. సౌధములపైనుండి చూచువారలకా సైన్యము, పర్వత, తరంగ, జలచరపరివృతమైనసముద్రమువలెఁ గన్పట్టెను. రాజధానియందలి హిందువులు పాదుషాయట్టహా సములుజూచి తమకు మరణముకన్న గత్యంతరము లేదని భయ పడిరి. ఈవిధముగఁ గొంతదూరము పోవునప్పటికి సైన్యము నాపుమని పాదుషా హుకుముచేసెను. సైన్యములన్నియు నాగి నవి. అచ్చటినుండి యంతకుముందే యేర్పడియున్నప్రకారము, అక్బరు, దిలేరుఖానులు తమసైన్యములతోఁ జీలి చెరియొక మార్గమునఁ బోయిరి. పాదుషాతనసైన్యముతో దోవారీమార్గ మునననుసరించెను. అంబారీలో గులనారేమియో మధురస్వప్న ములు కనుచుండెను. ఆమెయానందమవేలము; ఆమెయూహా లమృతతుల్యములు.

## ౯

ఔరంగజేబు దండయాత్రకుఁ బయల్దేరినాడని వినగానే దుర్గాదాసు మహారాణాదగ్గఱకుఁ బోయి యౌరంగజేబు దండయాత్రవిషయము చెప్పి యిట్లనెను. 'మహారాజా! మా నిర్ణయము ప్రకారము మొగల్ సైన్యముల మధ్యమార్గముననే యడ్డగింపవలెను. కాన జైత్రయాత్రకుఁ బయల్దేరబోవుచు, మీయనుజ్ఞకై వచ్చితిని'. దుర్గాదాసుని వినయసంపదకు బ్రహ్మానందము పొంది రాణా యాతని మనసార దీవించి పంపివైచెను.

రాణాభవనమునుండి దుర్గాదాసెకాయకి తననివాసమునకు వెళ్ళెను. వెళ్లుచునే యొకజాములో సైన్యమంతయు సిద్ధముగనుండవలెనని ప్రయాణభేరీ వేయించెను. ఆభేరీ నినాదము చెవిసోకినంతనే వీరులుప్పొంగిరి. దుర్గాదాసు తన భవనము చేరి సైనికవేషము ధరించెను. శిరమున సర్వసైన్యాధ్యక్షునికుండవలసిన కిరీటము పెట్టినాడు. వక్షస్థలము చుట్టునుఁ గవచము తొడిగెను. మొగమున సిందూరతిలకము సరిదిద్దెను. అంగరకా దొడిగెను. కటిపట్టికను బంధించెను. దానిపై మహారాణాయొసంగిన రత్నాలపిడిగల మహాఖడ్గమును గుదిరించుకొనెను. కోరమీసముల మెలివెట్టెను. వక్షస్థలముపై సర్వసైన్యాధ్యక్షపతకమును నెలగొల్పెను. వీరవేషము పూర్తి యయినది. ఆవేషములో నున్న యావీరవరునిఁ జూచినఁ బ్రత్యర్థి యెంతటివాఁడైన నమోవాకములర్పించఁడా యన్నట్లుం

డెను. యుద్ధమునకు సిద్ధమయి దుర్గాదాసు తన శయనమందిర మునకుఁ బోయెను. ఆమందిరమున జస్వంతుని పటమొకటి వ్రేలాడుచుండెను. చిత్రపటగతుఁడైన జస్వంతుని దుర్గాదాసు యుద్ధమునకనుజ్ఞవేడెను. కొన్ని నిమిషములాపటమెదుట తల వంచుకొని యుండి దుర్గాదాసు తల పైకెత్తి ప్రభువువంక చూచెను. పటమునందున్న జస్వంతుఁడు చిఱునవ్వుతోఁ దన్నా శీర్వదించుచున్నట్లుండెను. దుర్గాదాసు నిదానించి చూచినాఁడు, "ఓయీ! నా ప్రియభృత్యుఁడా! ఔరంగజేబు నావంశమునకుఁ దీరని యపకారమును జేసినాడు. ఇంకను జేయుచున్నాఁడుగదా! అట్టివాని నోడింపుము. అవమానింపుము; అప్పుడు కాని నా యాత్మకు శాంతిలేద"ని దీనముగా వాపోవుచున్నట్లుగ జస్వంతుఁడు కనుపించెను. అభావము తోఁచిన తోడనే తొలుత దుర్గాదాసు కన్నీరు విడచెను. ఇంతలో నౌరంగజేబు గుర్తునకు వచ్చెను. ఆతని మోము జేవురించినది. కన్నులెఱ్ఱవాఱినవి. శరీరము క్రోధముచేఁ గంపించెను. జస్వంతుని పటమునకు మఱియొకసారి నమస్కరించి యాతఁడు బయటకేగెను. ఆతని యుద్వేగాకృతినిఁ జూచి పార్శ్వచరులును, ఇతరులును, మాట్లాడించుటకుఁగూడ జంకిరి. బయటికివచ్చునరికి దుర్గాదాసుని బహిఃప్రాణము విజయాశ్వము సజ్జీకృతమై యుండెను. అతఁడు గుఱ్ఱమును డాసి దానిని వెన్నుపైఁ జఱచెను. అశ్వము దిశలలమటించునట్లు సకిలించినది. ఆహాయహేష నంగీకారముగ స్వీకరించి, దాని నధిరోహించి యావీరుఁడు సేనానివహమునకు

వెడలెను, సేనానివహము చేయునటుకాతని యుగ్రాకృతి యట్లే యుండెను.

సైన్య మంతయు సిద్ధము చేయఁబడినది. భీమసింహ, జయసింహులు, సమరదాసు, మొదలైన ప్రముఖులందఱును వచ్చియుండిరి. దుర్గాదాసు గుఱ్ఱము దిగి యొక యెత్తుప్రదేశము నెక్కి సైన్యమునంతయుఁ బరిశీలించెను. సైనికులయుత్సాహమునకు సంతసించుచు నాతఁడిట్లు చెప్పెను. "ఓవీరులారా! నేడు మనపరీక్షాదినము. చక్రవర్తి యనేల సైన్యసాగరముతో మనల నామరూపములు లేకుండఁగఁ జేయ వచ్చుచున్నాడు. హిందూజాతికి విశేషించి రాజపుత్రజాతికి, ధన ప్రాణముల కంటె, స్వాతంత్ర్య, అభిమానరక్షణలే ముఖ్యము. యుద్ధములో రాజపుత్రుఁడెవఁడును వెనుకంజ వేయఁడు. అట్లు వేయుటకంటె మరణించుట సర్వోత్తమము. శత్రువుల ఫిరంగిగుండ్లను గందుకముల వలె మనము పూర్వోపంపవలయును. సముత్సాహముతో యుద్ధముచేయుదము. లేదా, సమయముకేల్పు"డని గర్జించెను. ఉద్దీపనాత్మకమైన యాగర్జనను విని సైన్యమంతయు సముత్తేజమై పోయినది. హరహరారావములతో నాకమూలు విజృంభించినది. ఖడ్గములు లోకమునారి ఝణంఝణాత్కారములఁ జేసినవి. సంఖ్యకుఁ దక్కువగ నున్నప్పటికిని మహోత్సాహవంతమైన యాసైన్యము పాదుషాసైన్యముకన్న మిన్నగా నున్నట్లు కనిపించెను.

శుభముహూర్తమునఁ బ్రయాణభేరి శత్రుభీకరముగ మ్రోగినది. రాజసింహుఁడును సైన్యమును సాగనంపుట కచ్చ

టికివచ్చెను. ఆతని యనుజ్ఞ పొందుటకై పుత్రులిరువురు వచ్చిరి. భీమసింహుఁడు తండ్రిపాదముల కెఱగెను. రాజసింహుఁడు భీమసింహుని నెమ్మదిగ లేవనెత్తెను. పుత్రుని మోము చూడగనే తండ్రి హృదయము బావురుమన్నది. ధీరుఁడు కాన రాణా సంబళించుకొని, కుమారుని హృదయమునకు హత్తుకొని, శిరము పుణుకుచు "నాయనా! ఉత్తర జన్మమందుఁగూడ నిన్నే పుత్రునిగఁ బడయఁ గోరుచున్నాను. అప్పుడైననీవి శేషమును గుర్తింపగలనేమో తండ్రీ! నాయందున్న పక్షపాతబుద్ధి నిన్నుఁ జూచినప్పుడెల్ల నన్ను నిలువునఁ దగుల బెట్టుచున్నది. ఈవ్యథానలము నన్నెంతకాలమో బ్రతుకనీయదు. యుద్ధవిజయివయిన నిన్నుఁ జూతునన్న యాశ నాకు లే"దని నెమ్మదిగ నాతని వదలెను. ఆదృశ్యము వారి నందఱఁ గలఁచి వైచినది. జయసింహుఁడు నమస్కరింప రాణా వానితో "బిడ్డా! మచ్చలేని మనవంశమునకు మచ్చను దేఁబోకుము" అనెను. ఇరువురును దండ్రి యాశీర్వచనములఁ బొంది తమ కర్తవ్యనిర్వహణకై చనిరి.

దుర్గాదాసు,భీమసింహునిఁబిలిచి,"రాజపుత్రా!నీవక్బరు నెదుర్కొనుము. ఆతని సేనాపతితహవ్వర్ ఖాఁ కడుకౄరుఁడు, వీరుఁడు. ప్రబల శత్రువు దగ్గఱ కేవలము క్షాత్రమునే కాక యుపాయమును గూడఁ బ్రదర్శింపవలెను. పొమ్ము" అనియెను. భీమసింహుఁడట్లే తన సైన్యములతో నక్బరు కభిముఖముగఁ బోయెను. దుర్గాదాసు జయసింహునిఁ బిలిచి "ఓయీ! నీవు దిలేరుఖానును బర్వతప్రదేశమున నుండి యెదిరింపుము. కొండమార్గములన్నియు నెఱిఁగిన గరీబ్ దాసును నీవెంట బంపు

చున్నాను. జాగ్రత్తగఁ బోయిరమ్మనెను. అమోఘవచస్కుఁడైన దుర్గాదాసు, భీమసింహునిఁ బొమ్మనియు, జయసింహునిఁ బోయిరమ్మనియు ననుటచే విజ్ఞానులు కొంతమంది కలఁతపడిరి. జయసింహుఁడును మహాసేనాని యుత్తరువు ననుసరించెను. ఇరు సైన్యములఁ బంపి దుర్గాదాసు విజయాశ్వము నెక్కి యౌరంగజేబు నెదుర్కొనఁ బోయెను.

దిలేర్ దాసురీమార్గమున వచ్చుచున్నాడని తెలిసికొని జయసింహుఁడు వాని కభిముఖముగఁ బోయెను. పర్వతమార్గమపరిచిత మగుటవలన మొగల్ సేన నెమ్మదిగఁ వచ్చుచుండెను. ఎంతదూరమువచ్చినను రాజపుత్రులు కనఁబడకుండుటచే వారు భయపడి ముందుకు రాలేకపోయిరని దిలేర్ తలచెను. మార్గమిరుకుగను, కష్టముగ నుండుటచే వారిప్రయాణము నెమ్మదిగ సాగుచుండెను. కొంత దూరము పోవునప్పటికి మార్గము రెండుగాఁజీలెను. ఏమార్గమునఁ బోయిన నుదయపురము చేరవచ్చునో తెలియక దిలేర్ సైన్యములతో నాగి మార్గములఁ బరిశీలింపసాగెను.

వీరిట్లాలోచించుచుండగనే యాసమీపలతాకుంజమునుండి యొక మూలుఁగు వినవచ్చెను. ఆమూలుఁగెచ్చటనుండి వచ్చుచున్నదియు ముందుగ వారికిఁ దెలియలేదు. దిలేర్ ఖానాజ్ఞ మీఁదఁ గొందఱా లతాకుంజముదగ్గఱ వెదక నారంభించిరి. వెదకగ వారి కచ్చట కరచరణములు కట్టబడి నోట గుడ్డలు గ్రుక్కఁబడిన యొక వ్యక్తికానిపించెను. సిపాయీలాతనిని సేనాపతి యెదుటికిఁ దెచ్చిరి. ఆవ్యక్తి గడ్డములు, మీసములు కలిగి

నున్న నితల కలిఁగియుండెను. వేషమునుబట్టి యాతఁడు మహమ్మదీయునివలె నుండెను. సిపాయిలు సేనాపతియాజ్ఞచే వానినోట నున్న గుడ్డలు తీసివేసి బంధవిముక్తునిగఁ జేసిరి. దిలేరుచే నడుగఁ బడిన యాప్రశ్నకు యిట్లు చెప్పెను. "అయ్యా! నాపేరు మహమ్మద్ ఖాను. నే నీపర్వతసమీపమునను న్న గ్రామములో నివసించుచు, వేటవలన నా కుటుంబమునుఁ బోషించుకొనుచుందును. మూఁడురోజులకుఁ బూర్వమెవ్వఁడో రాజపుత్రుఁడు గొప్ప దండుతో వచ్చి పర్వతముకావల విడిసియున్నాఁడు. ఆప్రదేశమిచ్చటికి యాఱుమైళ్లు. ఈరోజు ప్రొద్దున నేను వేటకై వచ్చి వలపన్ని పొంచి యుండఁగనిఱువురు రాజపుత్రులాదారినే తమదండులోనికిఁ బోవుచుండిరి. నావల వారు వచ్చుమార్గమున కడ్డముగ నుండెను. కొంచెము దగ్గఱకు వచ్చి వారు నన్ను, నావలనుఁ జూచిరి. అందులో నొకఁడు గుఱ్ఱమునుండి దిగి "దుర్మార్గుఁడా, ఈ వల త్రాళ్ళతో మా గుఱ్ఱములఁబడఁ గొట్టి మమ్ముఁ జంప నెంచితివా! నీ జాతిద్వేషము చూపించితివి కా" దని నన్నుఁ జేతనున్న కొరడాతో రెండు కొట్టినాడు. రెండవ వాఁడును గుఱ్ఱమునుండిదిగి, "ఓరీ! నీ యుబ్బుకోఁ జెప్పుకొనుము" అని నాలుఁగు తన్నినాఁడు. ఈబాధ భరింపలేక నేఁ బారిపోవఁ జూచుచుండ వారు నన్నుఁబట్టి కట్టి నోట గుడ్డలుఁగ్రుక్కి "ఓరీ! బద్మాష్! మీపాదుషాకు రోజులు దగ్గఱకు వచ్చినవి. మీ యాటలిఁక సాగ" వనుచు బిగ్గరగ నవ్వుచు పాదుషా మాకు జుట్టుపన్ను వేయుచున్నాడు. మేముగడ్డములకుఁబన్ను వేయుదుమనిపోయిరి. బాబూ! మీరెవరో నాకుఁ దెలియదు. చూడ

మహమ్మదీయులవలెనున్నారు. నామాట లబద్ధములైనఁ జూడు డని వల తుంపులనుఁ జూపెను.

దిలేర్ కొక యాశపుట్టినది. రాజపుత్రులపై హఠాత్తుగఁ బడిన జయము తేలికగ లభించును. "మహమ్మద్ సహాయ ముతోఁ దాను సైన్యసమేతుఁడై మాఊత్రోవనుండి పోవలె" ననియాతని సంకల్పము. ఒకవేళ నీవ్యక్తి శత్రువుల చారుఁడు కాదుకదా! ఆ సందేహము తీరుటకై దిలేరు మహమ్మదు ననేకప్రశ్నల వేసెను. కాని సందేహావకాశ మేమియుఁ గలుగ లేదు. "మహమ్మద్! రాజపుత్రుల కంటఁబడకుండ వారి వెనుక భాగము చేరుటకేమైన రహస్యమార్గమున్నదా?" యని దిలే రడుగ "ఉన్నదిది.గో"యని మహమ్మదొక మార్గమునుఁజూపి యిట్లనెను. ఈమార్గము జనసంచారములేనిది. దీనిగుండ పయ నించిన, నెత్తినపడువఱకు రాజపుత్రులకుఁ దెలియదు. దిలేరు సందేహించెను. తా నొకప్రశ్నవేసిన వీఁడు పది సమాధాన ములు చెప్పుచున్నాడు. ఇందెంతనిజమో! యెంతయబద్ధమో! దిలేరు సందేహమును గమనించి, "అయ్యా! నన్ను సందే హించుచున్నారా? మీకార్యము పూర్తియగువఱకు నేను మీయొద్దనే యుండెదను. నే చెప్పిన దానిలో నొక్కయక్షర మసత్యమైనను నాతల నఱుకుఁడు. రాజపుత్రులు చేసిన యవ మానము నన్నేమియు బాధించుటలేదు. కాని, అల్లాతో సమానుఁడైన పాదుషాను నీచాతి నీచముగ నిందించిన యాదుర్మార్గులకుఁ దగినశాస్తి కావలెనని నాయుద్దేశము.

కానిచో నా కీగొడవ యెందుకు ! నా చేత నయినంత సహా
యము చేయవలెననియున్నది. తరువాత మీయిష్టము" అనెను.

దిలేరుకు మహమ్మద్ మాటలు విశ్వాస హేతువులయ్యెను.
ఆతఁడు తనతో నుండునుగాన మోసముచేయలేడు. ఈ ధైర్య
ముచే దిలేరు మహమ్మదుమాటల కంగీకరించెను. ముందు
మహమ్మద్ త్రోవచూపుచుఁ బోవుచుండెను. అశ్వారోహియై
దిలేరాతని వెంబడించెను. ఆవెనుక సైన్యము. కొంతదూరము
వఱకుఁ ద్రోవ యతివిశాలముగ నుండెను. ఆపైనఁ గొంచె
మిరుకుగ నుండెను. "ఎట్లున్న నేమి ! ఏమఱిపాటున నున్న
శత్రువులు తేలికగఁ జిక్కుదు"రని దిలేరు సంతోషము. పోను
పోను మార్గ మిఱుకుగా నుండఁజొచ్చెను. సైనికులు నొకరివెను
కగ నొకరుపోవుచుండిరి.

ఆ యిరుకుమార్గమునఁ గొంతదూరము పోవునప్పటికి
త్రోవ మఱియునిరుకయ్యెను. గజములామార్గమునుండి రాలేక
పోయెను. దిలేరుఖానున కేమియుఁ దోచలేదు. ముందుకుఁ
బోవుటెట్లని మహమ్మద్ నడిగెను. " బాబూ! గజసైన్యము
రాలేనిచోఁ దురగసైన్యమును రప్పింపుడు. వెనుకనుండి హఠా
త్తుగ రాజపుత్రులమట్టుపెట్టుటకునా సైన్యముచా"లని మహమ్మద్
పలికెను. సరే యని దిలేరు తురగసైన్యముతో ముందునకుఁ
బోయెను. మహమ్మద్ మొగల్ సైన్యమును చిత్ర విచిత్రమార్గ
ములనుండి తీసికొని పోవుచుండెను. మార్గము కొంతదూర
మిరుకుగనుండును. మఱికొంతదూరము విశాలముగ నుండును.
మధ్యమధ్య మార్గము విశాలముగ నుండుటచే దిలేరునకుఁ

గొంతధైర్యము వచ్చెను. ఇట్లు కొంతదూరము పోవుసరికి గుఱ్ఱములు నడచుటకుఁ గూడవీలులేకపోయెను. మార్గమతిక్లిష్టముగ నున్నది. ఈ పరిస్థితినిఁ జూచుసరికి దిలేరుఖానునకు సందేహ మినుమడించినది. ఆతఁడు గుడ్లెఱ్ఱజేసి "ఏమిరా! ఆఱుమైళ్ళంటివే" యని ప్రశ్నించెను. "రహస్యమార్గము కాన దూరమెక్కువ" యని మహమ్మద్ సమాధాన మిచ్చెను. ఈవిధముగ మఱి కొంచెము దూరమతికష్టముగఁబోయిరి. ఇఁకనావల మార్గము లేదు. ఉన్నవన్నియు మేఘములనొఱయు పర్వతములే. దిలేరు కోపమునకంతులేదు. మహమ్మద్ తనను నమ్మించి ద్రోహము చేసినాఁడని యాతని యాగ్రహము. "స్వామిద్రోహియయిన వానినెట్లు దండింపవలెనా" యని దిలేరాలోచించుచుండ వెనుక భాగమునఁ గోలాహలముప్పతిల్లినది. అదేమియో తెలిసికొనుటకు వీలులేదు. కొండలోయలో చిక్కిన యాసైన్యము ముందు వెనుకలకుఁ గదలనేరకుండెను.

మొగల్ సైన్యమంతయు లోయలోఁ బ్రవేశింపఁగనే లోయద్వారము హఠాత్తుగ రాజపుత్రులచే నాక్రమింపఁబడెను. చూచుచుండగనే పర్వతమంతరాళ్లు దొర్లి వచ్చి మార్గమున కడ్డుపడుచుండెను. అడ్డుపోయిన మొగలులు తుత్తునియలై పోవుచుండిరి. కొండపైనుండియు, లోయకెదుటినుండియు భిల్లులు, రాజపుత్రులుఁ శరవర్షమును, శిలావర్షమునుఁ గురిపింపసాగిరి. ద్వారబంధనను భేదించుటకై ముందుకు వచ్చుచున్న మహమ్మదీయు లెంతమందియున్నను ఫలితము మరణముకన్న మఱి యొకటి యగుపించుటలేదు. క్రమముగ ద్వారము మూయఁ

బడెను. జయసింహుఁడు సైన్యముతో ద్వారమును గాపాడుచు ముందుకు వచ్చు మొగలుల నఱుమాడుచుండెను. అప్పట్టున పది ఫిరంగులు చేయలేని పని నొకకొండరాయి చేయుచుండెను. చేయునది లేక మొఁగలులూరకుండిరి. ప్రాణమునకుఁ దెగించి యే మహమ్మదీయుఁడైన ముందుకు వచ్చిన మఱుక్షణములో నాతని తలపై నొకకొండరాయి యుండును. దానితో నాతఁ డొక్కఁడే కాక మఱిపందమంది నామరూపములు లేకుండఁబోవుదురు. మార్గము పూర్తిగ నడ్డగింపఁబడినతరువాత, దిలేరున కీవిషయము తెలిసినది. ఏమని? మొఁగల్ సైన్యమంతయు రాజపుత్రులచే బోనులోఁ బడిన నెలుకవలెఁ జేయఁబడినదని.

దిలేర్ ఖానుని యాగ్రహమునకు మితిలేదు. మహమ్మద్ ఖానును జూచుచున్నకొలఁది యాతని యాగ్రహము హద్దులు దాటుచుండెను. పండ్లుపటపటకొఱుకుచుఁ జేత నున్నకొరడాతో మహమ్మద్ నొక్క దెబ్బకొట్టెను. ఆదెబ్బతో మహమ్మద్ నిస్పృహుఁడవలెఁ గ్రిందపడిపోయెను. దిలేరున కేమియుఁ దోచలేదు. అత్యున్నతములైన యాకొండల నెక్కుటెట్లు? ఎక్కకున్న నెట్లు? సేనాపతియాజ్ఞచేఁ గొందఱు కొండల కెగఁబ్రాకసాగిరి. ఆప్రాకుటలోఁ గొందఱు జారి పడిపోవుచుండిరి. కొండచెట్లో ప్రాణములఁ బిగపట్టుకొని చిన్నఁబుకుఁ బోయిరి. కాని - యేమి లాభము? సూదులవంటి రాళ్లు నెత్తినఁబడుటచేఁ గ్రింది యగాధములోఁ బడిపోయిరి. దిలేరు సైనికులనందఱఁ గొండలకెగబ్రాకమని యాజ్ఞాపించెను; పరుషోక్తులాడెను; శాసించెను; విధిలేక వేలకొలఁది మొగలులు కొండల నధిరోహించుచుండిరి. పైన

జాగరూకతతో నున్న రాజపుత్రు లిదిగమనించి సలసల కాచి యుంచిన నూనెను బోసిరి; పెనుబండలను వారిపై దొర్లించిరి. పాపము! నూనెపడుటచేఁ గొందఱు నల్లులవలె మాడిరి. బండల క్రిందఁ బడిన కొందఱు నామరూపములు లేకుండఁ బోయిరి. ఎక్కుడువారెక్కుచుండిరి; చచ్చెడివారుచచ్చుచుండిరి. సైనికుల యుత్సాహమడుగంటినది. ప్రాణములపైఁ దీపి యధికమగుటచే వారు సేనాపతియాజ్ఞఁ దిరస్కరించిరి. సేనాపతి బెదరింపులు మొగలుసైనికులముందు అరణ్యరోదనములైనవి. క్రిందనున్న మొగలులనుఁ బైనున్న రాజపుత్రులు కొట్టుట సులువు. అందు వలన నేమాత్రము తాము ప్రతిఘటించినను బ్రాణములు దక్కవని వారికిఁ దెలియును. అల్లాపై భారముంచి వారంద ఱున్నవారున్నట్లే కదలక మెదలక యుండిరి.

మొగలుల యార్భాటము గంగలోఁ గలియుటనుజూచి రాజపుత్రులు కొన్ని కరపత్రములను లోయలో విసరివైచిరి. వానిలోని విషయమిది. "మొగలులారా! ఇప్పుడు మీరు మా బందీలు. మిమ్ముల నాశనము చేయఁదలచుకొన్న మా కొక గంటకంటె నెక్కువ పట్టదు. మా మాటలువిని మాతో సంధి చేసికొన్నచో రెండు మూఁడు రోజులలో మిమ్మువదలెదము. అంతవఱకు మీ కాహారపదార్థములఁ బంపుచుందుము. సంధికి షరతులు. మొదటిది మహమ్మద్ఖానును జెక్కుచెదరకుండ మాకప్పగింపవలెను. అతని కేమాత్ర మపాయము వాటిల్లినను మీలో నొక్కరును బ్రతుకరు. రెండవది, మీ యాయుధము లన్నియు మాకు స్వాధీనము చేయవలెను. మీ యంగీకార

మును దెలుపుట కొక్కపూట గడువు. గడువుదాటిన జరుగునది ప్రళయమే". ఈ పత్రము దిలేరుఖానుగూడ చదివెను. కొరడా దెబ్బకుఁ బడినట్లు నటించిన మహమ్మద్ కరపత్రమునందలి వార్తల విని నెమ్మదిగ లేచి నిలఁబడెను. అతనినిఁ జూచిన తోడనే దిలేరు మండిపడినాడు. ఏమిలాభము! "పేదవానికోపము పెదవికిచేటు" మహమ్మద్‌పై దెబ్బపడిన, దిలేరు నెత్తిన కొండ పడును. దిలేరు కోపమును దిగమ్రింగి యేదియో యాలోచించు చుండెను. గడువు పూర్తియయిన, సంఘమరణము సంభవించు నని భయపడి సైనికులందఱు సంధికంగీకరింపుమని దిలేరు నొత్తిడి చేసిరి. ఆతనికి నంతకంటె గత్యంతరము తోచలేదు. ఆతఁడు మహమ్మద్ వంక చూచి, "మొగలులపాలిటి కాళరాత్రీ! నమ్మించి, యెంత చేసితివి? ఇప్పటికైన నీ నిజవిషయమును జెప్పు" మనగా మహమ్మదిట్లు చెప్పెను. "సేనాపతీ! నేను దుర్గాదాసుని యను చరుఁడను. నాపేరు గరీబ్‌దాసు. ఆతని యాదేశానుసారము మిమ్ముల నీకొండలలో నిఱికింప నీవేషముతో వచ్చితిని. ఇప్పుడీలోయచుట్టు రాణా రాజసింహుని ద్వితీయపుత్రుఁడు జయసింహుఁడు కాచికొనియున్నాఁడు. మావారిలో నొక్కఁడు చావకుండ మీరందఱు మాకుఁ జిక్కవలెను. రక్తపాతము లేని యీ యుద్ధము నీకు బాగుగలేదా? దుర్గాదాసన నెవరను కొంటివి? ఆతఁడు, సర్వాంతర్యామి. ఆతఁడు, సర్వదక్షుఁడు. వాని మనసుకందని యూహా లేనేలేవు."

గడువు పూర్తియగుచుండుటచే రాజపుత్రులు శత్రుమారణహోమమునకై కొండపైభాగమునఁ జేయుచుండిరి. ఆసంద

డిని చూచి దిలేరు భయపడి సంధిసూచకముగు దెల్లజెండాను బైకెత్తించెను. అదిచూచి రాజపుత్రులు జోలెవంటిదాని నొక దానిని గ్రిందకు బంపిరి. దిలేరు గరీబ్ దాసు నందుగూర్చుండ బెట్టుడనెను. తోడనే శిపాయిలు గరీబ్ దాసు నందెక్కించిరి. కొలదిసేపటిలో గరీబ్ సురక్షితముగ బైకిపోయెను. తరువాత గొన్ని వందల జోలెలు క్రిందకు బంపబడెను. ఆ జోలెలలో "నాయుధములు బైకి పంపు"డని లేఖలపై వ్రాయబడి యుండెను. సైనికులొకరి మొగ మొకరు చూచుకొని, విధిలేక తుపాకులు మొదలగు మారణాయుధములన్నియు, జోలెలలో బెట్టి పైకిపంపిరి. పిమ్మట జోలెలద్వారా యాహారపదార్థములు క్రిందకు బంపబడినవి. తమనెప్పుడు విడుదలచేయునది తెలుపుమని జయసింహునకు దిలేరుఖానొక లేఖనంపుకొనెను. దానికిట్లు సమాధానము వచ్చినది. "ఔరంగజేబుకు గూడ మీకు జరిగిన గౌరవము జరుగువఱకు మిమ్ములను వదలము. ముందుగా వదలిన బాదుషాకు జరుగు గౌరవమునకు మీరడ్డుపడుదురు. అంతవఱకు నీలోయలో మీరు మాకతిథులుగనుండవలసినదే. రాజపుత్రజాతి శత్రునాశనమేకాదు, శత్రురక్షణముకూడ నెఱుగును." ఆ సమాధానమ్ముచూచి దిలేరు నిట్టూర్చెను. మొగల్ సైనికులు కన్నీరుకార్చి, దుర్గాదాసుని యఖండప్రజ్ఞను కొనియాడిరి.

# ౧౦

భీమసింహుఁడు, దుర్గాదాసు నాజ్ఞప్రకారము సైన్యము
లతో నక్బరుపైకి పోయెను. అక్బరు సైన్యమెంతయో, భీమ
సింహునకు సరిగఁ దెలియదు. శత్రుబలమెఱుంగకుండ తలఁ
బడుట యవివేకము. ఒక యరణ్యములో భీమసింహుఁడాగి
యక్బరు విషయము తెలిసికొనిరమ్మని రహస్యచారుల నిరువురఁ
బంపెను. కొంతసేపటికి రహస్యచారులువచ్చి "యువరాజా!
అక్బరువెంట నర్ధలక్షకు మించిన సైన్యమున్నది. దానిని తహవ్వర్
ఖాను నడుపుచున్నాఁడు. ఎడనెడ ప్రయాణములచే వారి సైన్య
మలసియున్నది. విశ్రాంతికై యొకరోజుపాటు వారచ్చటనిలువఁ
దలచినారు. ఆప్రదేశమిచ్చటికి ఐదుగవ్యూతులు" అని చెప్పిరి.

తనసైన్యమునకు మూఁడురెట్లున్న శత్రుసైన్యమును గెలుచు
టెట్లు! గెలువనిచోఁ దన తండ్రిపేరును, మహావీరుఁడగు దుర్గా
దాసుని పేరును గంగలోఁ గలిపినట్లగును! ఆలోచింపగా భీమ
సింహునకొక యాలోచన తట్టినది. ఆయాలోచనలో నశ్వత్థామ
శత్రుసంహారము చేసిన విధము జ్ఞాపకము వచ్చినది. క్షత్రియుఁ
డైన వానికా సంకుచితమార్గము తగునా యని కొంచెమాలో
చించినాఁడు. భగవానుఁడు నరునకు బోధించిన దివ్యబోధనలు
భీమసింహుని కార్యక్రమమున కూతమైనవి. అక్బరుసైన్యమెంత
యున్నను నర్ధరాత్రమున వారేమరియున్నపుడు తన యిరువది

యైదువేల సైన్యముతో మీాఁదఁబడినఁ దనకు జయము తేలికగ లభింపఁగలదు. అంతకంటె గత్యంతరము లేదు.

సూర్యుఁడ స్తమించినాడు. వియోగినీవిరహాగ్ని సముద్భూత ధూమసంఘమువలెఁ జీకటి నలుదెసల నాక్రమించినది. అంధ కారసముద్రమున మునిగిన వస్తుచయమంతయు నొక్కరూపున నుండెను. కన్ను బొడుచుకొన్నను గనుపించని యాకాఱుచీక టిలో భీమసింహుఁడు జైత్రయాత్రకుఁ బయల్దేరెను. రణభేరి విన్నంతనే సైన్యమంతయు నిశ్శబ్దముగ నాయకుని యానతి ప్రకారము సిద్ధమయి కదలినది. ఆకాశము మేఘావృతమై కన్నులకు మిఱుమిట్లుగొలుపు మెఱుపులతో భయంకరముగ నుండెను. ప్రళయరాక్షసి మేను ననుకరించు నాయాకాశము నుండి వెలువడు నురుములు "విశ్వగ్రాసిష్ఠమైన పరమేశ్వరుని హుంకారములా" యన్నట్లుండెను. పర్వతములనుగూడ పర మాణువులవలె నెగురఁగొట్టఁగల వాయువు లాదేవదేవుని యుచ్ఛ్వాసనిశ్వాసముల ననుకరించుచుండెను. ఉరుములతో, మెఱుపులతోఁ బాటు వర్షముకురియసాగెను. ఆ వాయువు హోరులోఁ బ్రళయసముద్రఘోష పరిపాటికేరాదు! ఆ మెఱుపు వెలుఁగులో గనుపించునవి వర్షధారలుకావు. ఆకాశమున వ్రేలఁ గట్టఁబడిన సర్పరాజములు!

భీమసింహుఁడశ్వారోహియై ముందుజనుచుండెను. అతని ననుసరించి సైన్యమంతయుఁ బ్రయాణము చేయుచుండెను. దేశ భక్తియుక్తమైన యాభీమసింహునకు,వానిసైన్యమునకునావర్షమే కాదు, పిడుగులైనను లక్ష్యము లేదు. పదిగడియలు ప్రయాణము

చేయునప్పటికి రాజపుత్రులకు శత్రుగుడారములు దగ్గఱించినవి. మెఱుపుకాంతిలో వారు శత్రువుల గుర్తించిరి. ఆగుడారములు దీపములులేక, గాలివానకుఁ గొంతశిథిలములయి శ్మశానవాటిక వలె నుండును. భీమసింహుఁడు తన సైన్యముల శత్రుసైన్యము నకుఁ గూతవేటుదూరములో నాపెను. అప్పటికి పదిగడియల ప్రొద్దుపోయినది. భీమసింహుఁడు తనసైన్యము నచట రెండు భాగములు చేసెను. ఇరువది వేలతోఁబోయి తాను శత్రుల నఱుమాడును. గోపీనాథుఁడను రాఠోరువీరుఁడు మిగిలిన యైదివేలతోఁ ద్రోవలుగాచి పాఱిపోవు శత్రువుల నఱికివేయ వలెను. ఈ యేర్పాటుచేసి, భీమసింహుఁడు సైనికులనుద్దేశించి, "సైనికులారా! అరుగో! శత్రువులా గుడారములందు నిద్రించు చున్నారు. మనము హఠాత్తుగ వారిపైఁ బడి యానిద్రనే దీర్ఘ నిద్రచేయవలె. అసంఖ్యాకములైన శత్రువుల గెలుచుట కింత కంటె మార్గములే"దని తన గుఱ్ఱమును ముందుకు దూకించెను. ఆతనివెంట ఇరువదివేలసైన్యము పరుగెత్తినది. ఆవేశపరుఁడైన యాతని వేగమును సైన్యమనుసరింపలేక పోయినది. గాలివాన యేమాత్రము తగ్గలేదు. పిడుగులు పడుచునే యుండెను. ఇవి యేమియు భీమసింహునకుఁ గన్పించుటలేదు. ఆతని గన్తవ్య స్థానము, శత్రుశిబిరము; కర్తవ్యము, శత్రునాశనము; లక్ష్యము మాతృదేశస్వాతంత్ర్యము.

సరిగా యర్థనిశీథి. బయట నేనుగుతొండములంత వర్ష ధారలు పడుచుండుటచే మొగల్‌సైన్యమంతయు శీతబాధకుఁ దాళఁజాలక డేరాలలో నొకరిప్రక్కనొకరుగ శయనించి

యున్నది. మధ్య మధ్య పిడుగులుపడుచుండుటచే నులిక్కిపడి లేచిన కొందఱు మాత్రము మాట్లాడుచుండిరి. వర్షధారల చప్పుళ్లు, పిడుగులు ఢమఢమలు, కీచురాళ్ళ మోతలు, విరుగుచున్న వృక్షముల ఫెళఫెళలు, నధికమగుటచే, చరాచరప్రకృతి యంతయుఁ బరమాత్మయందిమిడినట్లు శబ్దాంతరములన్నియు నావార్షికశబ్దమునందు లీనమయి పోయినవి. ఇట్టి ప్రళయసమయమున శత్రువుమాట దేవుఁడెఱుఁగు! ముందు బ్రతికి బయటపడినఁ జాలునని పహరావారుగూడ నొకమూలన నొదిగి పడియుండిరి. అహో! ఒకసృష్టియందేయెంతభేదము! ప్రాణాపాయకరమైన విపత్సమయమున రాజపుత్రజాతి స్వాతంత్ర్యరక్షణకై ముందుకు దుమికినది. ధనముకొఱకై సైనికులుగాచేరిన మొగల్‌జాతి, చక్రవర్తిగౌరవమును బాటింపక ప్రాణములను వెఱచి హాయిగ డేరాలో నిద్రించుచున్నది.

ఆకాళరాత్రి నడిమిదిశలో భీమసింహుఁడొక్కపరి వెనుకనుండి శత్రుగుడారముల ముట్టడించినాడు. ఇరువదివేల రాజపుత్రులొక్కుమ్మడిగహరహరానినాదములతోనుత్సాహము రేకెత్త గుడారములపైఁ బడిరి. రాజపుత్రుల హుంకారములను నురుములుగా మొగలులు తలఁచిరి. కోపోద్రేకముచే డేరాలను జించి రాజపుత్రులు శిబిరములలోఁ బ్రవేశించిరి. అకస్మాత్తుగ వచ్చిన రాజపుత్రులను జూచి మేల్కొన్న మొగలులాశ్చర్యపడిరి. చేతులతో నాయుధములు లేకున్న రాజపుత్రులు విలాసముగా వచ్చిరని తలచెడివారే!

సంహారక్రియ ప్రారంభమయినది. రాజపుత్రులు "హార హారా" యనుచు ప్రవేటునకొక్క శత్రువును నఱుకుచుండిరి. హఠాత్సంభవమైన యీప్రళయమున కాశ్చర్యపడుచుఁ గొంత మంది మొగలులు నిద్రమత్తుచేఁ గన్నులు నులుముకొనుచుం దురు. మఱుక్షణములో వారి తలలు భూదేవికి బలిగానీయఁ బడును. కొంతమంది రాజపుత్రులను జూచి యాయుధముల కొఱకై పరుగిడి యాయుధములఁ దీసికొనఁబోదురు. ఉత్తరక్షణ ములో వారిచేతులు నఱుకఁబడును. కొంతమంది బ్రతికినబలుసు కూరతినవచ్చునని పరుగిడుదురు. రెండవనిముసములో వారికాళ్లు తుండెములయి యుండును. మఱికొందఱు రాజపుత్రుల కను మొఱఁగి పాఱిపోఁ జూతురు. కాని తల నఱుకబడి యెదురువచ్చు కబంధమును జూచి "హా" యని కేకవైచి మూర్ఛపోవుదురు. ప్రతియొక్క రాజపుత్రుఁడు పదిమందికి సమాధానము చెప్పు చుండెను. వందలు, వేలు, శిరములు బంతులవలె నెగిరి పోవు చుండెను. రక్తప్రవాహమునఁగొట్టుకొనిపోవుమానవాంగములు నదీప్రవాహమునఁగొట్టుకొనిపోవు జలచరశైవాలాదులను బోలి యుండెను. మూడుగడియలీవిధముగ రణయజ్ఞము జరుగునప్ప టికి పదివేలమొగలులు బలియయిపోయిరి. రాజపుత్రులలో వేయిమంది మరణించిరి.

ఒక్కమాటుగ సంభవించిన యీయాపత్తును జూచి సేనా పతియైన తహవ్వార్ ఖాన్ ముందు గొంత కంగారుపడెను. అక్బర్, తహవ్వార్ ఖానుల డేరాలు మధ్య వేయఁబడి చుట్టును సైనికశిబిరములు వేయఁబడుటచే రాజపుత్రుల కరాళకరవాల

ములు వారినింతవఱకు రుచి చూడలేదు. తహావ్వర్ ఖాన్ డేరాకు దగ్గఱిలోనికి మృత్యుజిహ్వ వచ్చినది. అదిచూచి తహావ్వర్ ఖాన్ అక్బరుడేరాలోనికిఁ బరుగెత్తెను. అక్బరంతకు ముందే లేచి యేమిచేయుటకుఁ దోచక యటునిటు పరుగెత్తుచుండెను. తహావ్వర్ ఖాన్ లోనఁ బ్రవేశించి "యువరాజా! రాజపుత్రులు మోసముగ మనపైఁబడి యొకవరుసనుండి నఱుకుకొని వచ్చుచున్నారు. ఇంకఁ గొంచెము సేపున్న మనకు నాగౌరవమే చేయుదురు. మీరు వెంటనే గజమునధిష్ఠించి కుమార్తెతోఁ గూడ నీదారిని పాఱిపొండు. ఇటు రాజపుత్రులు లేరు. లేనిచో మరణముతప్పదు, నేను వారినెదుర్కొని పాఱిపోవుచున్న మిమ్ములఁ బట్టుకొనకుండ జేసెద"ననెను. అక్బరు మాఱుమాట చెప్పక బ్రతుకు జీవుడాయని పాఱిపోయెను.

తహావ్వర్ ఖాన్ గుఱ్ఱముపైనెక్కి తనవారిఁ బ్రోత్సహించుచు రాజపుత్రుల నెదిరించెను. మొదటఁ గొంచెము కష్టమైనను గొలఁది సేపటికి మొగలాయిలందఱు సేనాపతిదగ్గఱకుఁ జేరి యేకమయిరి. పోరు ఘోరమయినది. ఇరు తెగలసైనికులు గుట్టలుగుట్టలుగఁ గూలుచుండిరి. ఆ భయంకరవర్షపాతధ్వనిలోనే దీనునివార్తనాదమును వినరాదయ్యె. ఏప్రక్క చూచినను విలయతాండవము చేయుచున్న మృత్యుదేవి యనుపగజ్జెల చప్పుడే. గాఢాంధకారములో గుర్తుతెలియక చేతికందిన వారిని నఱుకుచుండిరి. ప్రాణభీతికలవారు మొగలులు. ప్రాణముల మీఁద నాసలేనివారు రాజపుత్రులు. తెగించినరాజపుత్రులు కొందఱు మొగలుసేనలోఁ జొరఁబడి యుందినవారినందినట్లు

తుండెములు చేయుచుండిరి. అందువలన రాజపుత్రులకంటె మొగలులు కొన్నిరెట్లు మరణించుచుండిరి. మొగలులకు భయ మధికమయినది. కటికచీకటి! ఎవఁడుతనవాఁడో! యెవఁడు పరుఁడో! తెలియక తమద్దఱనున్న వానినెల్ల రాజపుత్రునిగాఁ దలచి మొగలులు వారిలో వారే నఱుకుకొనుచుండిరి. తన సైన్యము, రాజపుత్రసైన్యముకంటె మితిమీఱినశించుటను మెఱుపులవెలుఁగులోఁ జహాన్ఖాన్ కనిపెట్టెను. అమితక్రోధముతో నాతఁడు భీషణముగఁ గత్తినిఝళిపించుచు ముందుకు దూకినాడు. పట్టాకత్తినిఁజేబట్టి ముందుకు గుఱ్ఱమును దుమికించుచు వచ్చుచున్న యీపఠాణ్నాయకుని వీరవిహారమునకు రాజపుత్రులు కొంచెము జంకిరి. తహావ్వర్కత్తి తడవకిద్దరుముగ్గుఱును బొట్టఁ బెట్టుకొనుచు స్వేచ్ఛగ రాజపుత్రుల శిరములపై నాట్యమాడసాగినది. పఠాణ్వీరునిముందుఁ బడుటకు రాజపుత్రులు జంకుచుండిరి. ఆతనిముందున్న సైన్యము పలుచనై పాఱిపోయినది; తమనాయకుని పరాక్రమమునండగాఁగొని,పాఱిపోవుచున్న మొగల్సైన్యము వెనుదిరిగి ధైర్యముతో రాజపుత్రులపైఁబడి వారినిఁగత్తికొకకండగ నఱుకఁజొచ్చెను. భయకంపితమైన రాజపుత్రసైన్యము తట్టుకొనఁజాలక చలించి వెనుకకుఁ బోవుచుండెను.

భీమసింహుఁడు మఱియొకప్రక్క యుద్ధము చేయుచుండెను. యుద్ధమననేమి? కాయకసరులను నఱికినట్లు, పైరు పచ్చలను గోసినట్లు, అరటిపిలకలఁ దుండెములుచేసినట్లు, మొగలుల శిరములో, బదములో, నడుములో, కంఠములో నఱుకు

చుండుటగాదే! ఆతఁడు రెండుచేతుల రెండుగత్తులధరించి గుఱ్ఱముపైనుండి శత్రుమధ్యమునకు లఘించి యుద్ధము చేయుచుండెను. అప్పటికి భీమసింహుఁడొక్కఁడే రెండువందలమందిని హతమార్చినాఁడు. శత్రుకృతాపరాధ మొక్కక్కటి గుర్తు వచ్చినపుడెల్ల నాపీనుని ఖడ్గములు చిత్రవిచిత్రములుగఁ దిరిగి శత్రుమారణము నినుమడింపఁజేయుచుండెను. యుద్ధముప్రారంభమయినది. మొదలంతనుఁ ఖడ్గములకు విశ్రాంతిలేదు. భీమసింహుఁడు పదిమందినిఁజంపిన నాస్థానము నిరువదిమంది యాక్రమించుచుండిరి. ఇరువదిమందినాతఁడు పరువెత్తించును. ముప్పదిమందిచే నాస్థానమాక్రమింపఁబడును.

భీమసింహుఁడిట్లు యుద్ధముచేయు చుండ నొకప్రక్కనుండి రాజపుత్రుల యపజయధ్వనులును, బశ్చాద్గమనములును, నాతనికిఁ దెలియవచ్చెను. చూచుచుండగనే రాజపుత్రులలో నధైర్యము పేరుకొనుచుండెను. ఒక్కగడియ యిట్లుజరిగినచో రాజపుత్రసైన్యమంతయు యుద్ధవిముఖము కాఁగలదు. రాజపుత్రులకు భీతిని, మొగలాయిలకుత్సాహమును గల్గించు తహావ్వర్ ఖానును మరణింపఁజేయకున్న నిఁక తమకు జయము దుర్లభ" మని భీమసింహుఁ డనుకొనుచుండగనే తవహ్వార్ ఖడ్గము నతి వేగముగఁ ద్రిప్పుచు వంగమంద్రి రాజపుత్రులమధ్య దుమికి - దుముకుచునేయెనుగురు రాజపుత్రులఁ దుండెములుగనఱికెను. ఆయాఘాతములఁ జూచి తక్కిన రాజపుత్రు లార్తనాదము చేయుచుఁ బరుగెత్తిరి. ఆదృశ్యమునుఁ జూడగనే భీమసింహుని కొడలు తెలియలేదు. భూతావిష్టునివలె హుమ్మనియార్చి

రొక చేతిలోనిఁ గత్తిని మొగలులపైకి విసరెను. ఆ తాఁకుపడి ముగ్గురు మొగలులు నేలకొరగిరి. భీమసింహుఁ డంతవరకు కటిసీమ నమర్పఁబడియున్న పట్టాకత్తి నొడిసి పుచ్చుకొని విజృంభించినాడు. తానిప్పుడు తహావ్వర్ మీఁదఁ బడవలెను. తహావ్వర్‌కు భీమసింహునకు మధ్య వేయిమంది మొగలులుండిరి. అప్పటి భీమసింహుని దృష్టికి వేయిమంది వందమందిగఁ గన్పించుచుండిరి. భీముని కుడిచేతియందున్న పట్టాకత్తి వాయి యాజానుబాహుని యఱచేతి వెడల్పున్నది. కుడిచేతఁ బట్టాకత్తిని, నెడమచేత మఱియొక నిశిత కరవాలమును దృఢముగఁ బట్టుకొని "హరహరా" యనుచు, సింహకిశోరమట్లు వేయిమంది మీఁదికి భీముండు లంఘించినాడు. అదియొక పిడుగుపాటు; మహాపర్వత శిఖరపతనము; ఆనాటిభీముఁడు నిజముగ భీముఁడే! అతఁడు దుముకుచునే, పట్టాకత్తినొక్కసారి యాదరినుండి యీదరికి విసరి, దూసియొక్క విచిత్రచంక్రమణము చేసెను. ఆ కత్తిదెబ్బునకుఁ బదిమంది మొగలులు కిక్కురుమనకుండ భూమికొఱగిరి. ఇద్దఱా ఖడ్గపు తళతళ నొరసి యావలించిరి. క్రమముగ భీమసింహుఁడు విక్రమించినాడు. ఐదు, పది, పదిహేను, ఇరువది, ముప్పది, క్రమముగ మారణసంఖ్య పెరిగినది. ఆ యోద్ధ భీమసింహుఁడు కాదు; ప్రళయమహేశ్వరుడు. అతని కన్నులనుండి వెలువడునవి నిశితవీక్షణములు కాదు; శత్రుదాహక జ్వాలలు. అతని రౌద్రాకారమును, మరణించుచున్న మొగలుల సంఖ్యను, విశేషించి తక్షకజిహ్వలవలెఁ దిరిగెడు నాతని ఖడ్గవిహారములను జూచి మొగలు లెటువారటు పరుగెత్తిరి.

ఇదిగో! భీమసింహుఁడన్న నటువరుగెత్తుచుండిరి. ఒక గడియ యగుసరికి మధ్యనున్న మొగల్‌సైన్యమంతయు వెన్నిచ్చి పాఱి నది. ఈప్రక్కనుండి యాప్రక్కకు మార్గమేర్పడినది. ఆ మార్గమున నీవల పాదచారియైన భీమసింహుఁడు; ఆవల నశ్వారోహియైన తహవ్వర్ ఖాన్ ఒకరినొకరు చూచుకొనిరి. తెప్పలు వాల్పకచూచుకొనిరి. తహవ్వర్ క్రూరాతి క్రూరుఁడు; మొండి. అయినప్పటికి శత్రురక్తరంజితమై, యచ్చటచ్చట స్వల్పముగఁ బడిన గాయములతోఁ బూచిన మోదుగవలెనున్న, భీముని దేహమును, ప్రజ్వలించుచున్న కండ్లను, హస్తద్వయ మునఁ గృష్ణసర్పములవలె బుసకొట్టుచున్న ఖడ్గద్వయమును. మెఱపులవెలుఁగులోఁ జూచుసరికిఁ గొలదిగఁ జలించెను. పది క్షణములు గడచినవి. ఒకరును ముందుకు రాక యుల్లో నిర్ని మేషులై చూచుకొనుచుండిరి.

తహవ్వర్ ఖాను గుఱ్ఱముపై నల్లే యుండుటను జూచి భీమసింహుఁ డొక్కపరి కత్తుల గాలిలో విసరెను. ఆవేగము నకు నుప్పతిల్లిన శబ్దము చెవిసోకినంతనే తహవ్వర్ ఉలిక్కి పడెను. మఱుక్షణములో భీమసింహుడొక్క యుదుటన ఖాన్ దగ్గఱకు లంఘించి కత్తులఁ దిరిగి విదళించెను. భీమసింహుఁడు తలచుకొన్నచో నా విదళింపులకు ఖాన్ నడుము వఱకు రెండు తుండెములయి యుండెడివాఁడే. ఏమఱిపాటుననున్న శత్రువును జంపుట ధర్మముకాదు; ఖానును సన్నద్ధునిఁ జేయుటకే భీమ సింహుని యాలంఘనము. సన్నద్ధుఁడైన ఖాను మాఁడిపడి తన గుఱ్ఱమును భీమసింహునిపైకిఁ దుమికించెను, ఖానుగుఱ్ఱముపై

నున్నాడు. భీమసింహుఁడు క్రిందనున్నాడు. క్రిందవానికిఁ బైవానినిఁ గొట్టుట కష్టము. "గుఱ్ఱము డెక్కలతోఁ ద్రొక్కించి చంపవలె" నని ఖాను దనగుఱ్ఱమును భీమునిపైకి మాటిమాటికి దూకించుచుండెను. భీమసింహునకు గుఱ్ఱము నుండి తప్పించుకొనుటకేగాని ఖానునిఁ గొట్టుట కవకాశము దొరకుటలేదు. భీమసింహుఁడు సమయము చూచుచుండెను. "ఈసారితో భీమసింహునిఁ జంపవలె" నని ఖా నమిత వేగముతో గుఱ్ఱమును భీముని పైకి దూకించెను. భీమునకుఁ దప్పుకొనుటకుఁ గూడ నవకాశము లేకపోవుటచే నాతఁడు చమత్కారముగవంగి ప్రక్కకుఁ గొంచెము తప్పుకొని పట్టా కత్తితోఁ దనమీఁదపడనున్న గుఱ్ఱపు ముందుకాళ్ళను నఱికెను. ఆదెబ్బకుఁ గాళ్లు తెగిన గుఱ్ఱము వేగముగఁబోయి ముందుకుఁ బడినది. దానిముందున్న ఖాన్ ముందుకుఁ బడెను. తగిలిన దెబ్బ కాతఁడుదిమ్మర పోయెను. పావుగడియలో ఖాన్ తెప్పిరిల్లి తన కెదురుగ నిలచి చూచుచున్న భీమసింహునిఁ జూచి "యూతండెందులకుఁ జంపలేదా" యని యాశ్చర్యపడెను. ఈ మాటు ఖానునకు గుఱ్ఱములేదు. నేలమీఁదనే యిరువు రెదురొక్కనిరి. పోరు చాల భయంకరముగ నున్నది. వారు క్రోధోన్మిషితములైన రెండు కుక్కుట రాజములు; మదోన్మత్తములైన రెండు వృషభరాజములు; ప్రచండాఘాతముఖరిత దిగ్విభాగములగు రెండు మదమత్తేభములు.

ఖాన్ మహాబలశాలి; ఖడ్గవిద్యాదక్షుఁడు; భీమసిం

హుఁడు నంతటివాఁడే. అంతకంటె భీమసింహుఁడు వేగరి. ఖాన్ కత్తిని మూఁడుసారులు త్రిప్పి యొకచంక్రమణము చేయు నప్పటికి భీమసింహుఁ డాఱుసారులుకత్తిఁ ద్రిప్పి మూఁడుచంక్రమణములుచేయును. ఖాన్ భీముని కత్తిదెబ్బలనుఁ దప్పుకొనలేక పోవుచుండెను. అక్కడక్కడ ఖానునకు రక్తము పైకివచ్చినది. భీమసింహుఁడు చెక్కుచెదరలేదు. అతిక్రోధముచే ఖానతివేగముగఁ గత్తిఁ ద్రిప్పసాగెను. ఖానుని కత్తి నేమాత్రము తగిలినను భీముఁడు తుండెములు కావలసిందే. భీముఁడు చమత్కారముగఁ దప్పుకొనుచు సమయము దొరికినప్పుడు ఖానునుఁ గొట్టుచుండెను. సైనికులందఱు యుద్ధమును మాని తమతమ నాయకుల యుద్ధమునే చూచుచుండిరి. అప్పటికి మేఘపటలి వీడిపోవ జంద్రుఁడు మింటఁ బ్రకాశింపసాగెను.

యుద్ధమునఁ బ్రథమాధ్యాయము ముగిసినది. పరస్పర రము, జయాభిలాషయు బట్టుదలయుఁ హెచ్చినవి. ఒకరు హెచ్చు ఇంకొకరు తగ్గు అని చెప్పుటకు వీలులేదు. భీముఁడు సమయముచూచి ఖానునిభుజముపైఁ గట్టిగఁగొట్టెను. ఆదెబ్బకుఁ గవచము పగిలి భుజము సగము తెగినది. ఖానుని కోపమునకు మితిలేదు; ధర్మాధర్మ విచక్షణలేదు; ఆతఁడు భీమసింహుని తొడల నఱుకఁదలచి కత్తిని విసరెను. భీమసింహుఁ డాకత్తిదెబ్బనుఁ దప్పుకొన్నాడు. కాని-యాకత్తికొన తొడకు గీసికొని తొడ తెగినది. నెత్తురు వరదలైనది. భీమసింహుఁ డాదెబ్బతో సింహమైనాడు. రెండుచేతులతో ఖడ్గముల మనోవేగమున నొక్కపరి గాలిలో విదళించి మూర్తీభవించిన క్షాత్రమువలె

ఖానునిపై నుఱికెను. భీమునిచేతులలో గిరగిరతిరుగుచున్న ఖడ్గముల నావెన్నెలలోఁ జూచుసరికి ఖానుని కన్నులు బైరులు కమ్మినవి. ఒకకత్తికైనచో ఖాను సమాధానముచెప్పఁగలఁడు. శరవేగముతోఁ దిరుగుచున్న రెండుకత్తులకు సమాధానము చెప్పుట యతనిశక్తికి మీఱినపని యయ్యెను. విజృంభించిన భీముఁడు సమయమును జూచి యిదివఱకు సగము నఱుకఁబడిన భుజమునే మఱల నఱికెను. ఆదెబ్బకు ఖానుని భుజముపూర్తిగఁ దెగి క్రింద బడినది. ఖానునకుఁ నధైర్యము హెచ్చినది. భీముఁడు మనోవేగముతోఁ దిరుగుచుండుటచే ఖానున కాతనిఁ గొట్టుట కవకాశమే లభించుటలేదు. భీముని కాళ్ళను నఱికినఁగాని ఖానున కాయనకాశము లభింపదు. భీముని కాళ్ళను నఱకవలెనని ఖానమితప్రయత్నము చేయుచుండెను. భీముఁడది గమనించి తానేమఱిపాటుగ నున్నట్లు నటించి తన పాదములు ఖానునకు దొరకునట్లుగ నిలఁబడెను. సమయమదే యని ఖాను వంగి భీముని మోకాళ్ళకుఁ దగులునట్లు కత్తి నతివేగముగ విసరెను. భీమసింహుఁడు సింహమువలె లంఘించి వంగి లేవఁబోవుచున్న ఖానుని తలపై బలముగఁ దన్నెను. ఆతన్నుతో ఖాను వెనుకవెనుకకుఁబోయి వెల్లకిలఁబడెను. ఖానట్లు వెల్లికిలఁబడుమునే తనచేతిలోనున్న ఖడ్గమును భీమునిపై విసరివైచెను. మెలుకువగనున్న భీముఁడా కత్తిని తన యెడమచేతికత్తితోనాపి యొక్కయుదుటున ఖాను గుండెలపైకి దూకి కుడిచేతికత్తితో నాతని కంఠము నొక్కవ్రేటున నఱికెను. ఖానతల మొండెమునుండి వేఱైపదిగజములు దొర్లిపోయినది.

అనాథమైన మొగల్ సైన్యము వెఱచఱచి పాఱసాగినది. తమ నాయకుని గెలుపుచే నుత్సాహవంతమైన రాజపుత్రసైన్యము వారివెంటఁ బడి నఱుకసాగినది.

భీమసింహుని యాజ్ఞప్రకారము గోపీనాథుఁ డైదువేల సైన్యముతోఁ ద్రోవలుకాచి యుండెను. ఇంతలో నక్బరు రెండువందల సిపాయీలతోఁ బారిపోవుచుండుట చూచి గోపీనాథుఁడు కొంత యాశ్వికదళముతో నక్బరు నెదుర్కొనెను. మొగలులెదిరించిరి. రాజపుత్రుఁడొకడు బల్లెమును గుఱిచూచి యేనుఁగుపై విసరెను. ఆ బల్లెము కంటియందు గ్రుచ్చుకొనుటచే నేనుఁగా బాధను భరింపలేక పడిగఁబరుగెత్తెను. గోపీనాథుఁడు సిపాయీల బంధింపుమని తనవారికాజ్ఞయిచ్చి తా నక్బరును వెంటాడెను. ఒకయర్ధగవ్యూతిదూరముపోయి బాధాధిక్యతచే నేనుఁగు పడిపోయెను. గోపీనాథుఁడు రజియాను, అక్బరును, బంధించి తనవారిదగ్గఱకుఁ దెచ్చి తిరిగి త్రోవలఁగాయుచుండెను.

మొగల్ సైన్యము పారిపోవుచుండెను. వెనుకఁబడి తఱుముచున్న భీమసింహుఁడు బిగ్గరగ శంఖమును బూరింపగనే ముందునుండి గోపీనాథుఁడు మొగలుల నెదుర్కొనెను. ఇరువురిమధ్యపడిన మొగల్సైన్యమంతయుఁ బ్రాణభీతిచే నాయుధముల విడిచి శరణువేడినది. భీమసింహుని యాజ్ఞచే నిరాయుధమైన మొగల్సైన్యమంతను రాజపుత్రులు బంధించిరి. హతశేషులైన మొగలు లిరువదివేలు. రాజపుత్రులు పదివేలు. రాజపుత్రులు బంధితులైన మొగలులతోను,అక్బరుతో నుదయ

పురమువైపు మరలిరి. కాని వారిముఖముల వికాసము లేదు. ఓడి పాఱిపోవుటకు సిద్ధముగనున్న తమను గాపాడి గెలిపించిన వారిసేనాని భీమసింహుఁడు స్వదేశోద్ధరణకై యసువుల వీడుచున్నాడు. భీమసింహుఁడు దేహమంతయు గాయములు పడుటచేతను, ఖానుకత్తిదెబ్బకుఁ దొడభాగము తెగిపోవుటచేతను, జీవితమును వదలవలసిన వాఁడయ్యెను. ఆశూరశిఖామణి మరణించుచు దన దేహమును తనరాజ్యములోనే దహనముచేయవలసినదనియు, దండ్రికిఁ దుది నమస్కార మందచేయుమనియు గోపీనాథునితోఁ జెప్పి కనులు మూసెను. అఖండవిజయము తమకు సిద్ధించినను నాయకమణి యంతరించుటచే రాజపుత్రులందఱు గోపీనాథునితో సహ కన్నీరు మున్నీరుగ విలపించుచు నుదయపురమార్గమనుసరించిరి.



దుర్గాదాసు భీమసింహ జయసింహులను శత్రువులపైకిఁ బంపి తాను దేవారీమార్గమునవచ్చు నౌరంగజేబు నెదుర్కొనుటకు బయల్దేరి యుండెనుగదా! ఆతఁడు శత్రుగూఢచారి యెవ్వఁడు తనసైన్యమునఁ బ్రవేశించుటకు వీలులేని సైనికవ్యవస్థల నేర్పాటుచేసి "శత్రువు గభాలునఁ బైఁబడునేమో; ఏమఱి యుండకుడ"ని సైనికులఁ బ్రబోధించుచుఁ బ్రయాణముచేయుచుండెను. తమకంటె నత్యధికముగనున్న శత్రువును జయిం

చుటయన్న సామాన్య కార్యమా? అందుకై యెన్ని యుక్తి ప్రయుక్తు లుండవలెను. దుర్గాదాసునకు క్షణము తీరికలేదు. గుఱ్ఱపుజీనే యాతని యావాసమందిరము.

దుర్గాదాసు సహజముగఁ బొడుగరి. ఆఱడుగుల కేమాత్రము తక్కువయుండదు. పొడుగునకుఁ దగినలావు. ఆజానుదీర్ఘములై బలిసి కండలుతిరిగిన బాహువులు, అతివిశాలమై పటిష్ఠమైన వక్షస్థలము, సన్నని నడుము, ఆకర్ణాంతములైన నేత్రములు, విశాలమైన నుదురు, ఎత్తైనమూపులు, ఇవియాతని సహజాలంకారములు. ఈ యవయవసన్నివేశముచే దుర్గాదాసొక చక్కనివీరుఁడని యాతనిఁజూచిన తత్‌క్షణమే తెలియును. శాంతవీరము లామహనీయుని మోమున గంగాయమునలవలెఁ బ్రకాశించుచుండును. సరస్వతివలెఁ గ్రోధమంతర్వాహిని. అది పొంగిన దానినాపగల తటములు లేనేలేవు. మొత్తముమీఁద దుర్గాదాసొక త్రివేణీసంగము వంటివాఁడు. ఆతనిఁజూచి సైన్యముప్పొంగును; అతనియందు తమభాగ్యమనుకొనును; "అపజయమనునది తమసైన్యాధ్యక్షునివంక తొంగిచూచుటకుఁగూడ భయపడు"నని యాతనిసైన్యమందలి ప్రతివానిదృఢవిశ్వాసము.

దుర్గాదాసెడనెడ ప్రయాణములుచేయుచు బోవుచుండెను. పగలంతయు ప్రయాణము, రాత్రినిద్ర. రాత్రియంతయు నందఱు నిద్రించుటకు వీలులేదు. కొంతమంది నిద్రించుట,కొంతమంది మెలకువగ నుండుట. నిద్రించినవారు లేచినఁగాని తక్కినవారు నిద్రింపరాదు. నిద్రించువారైన యుద్ధోచితవేషముతోనే నిద్రింపవలెను. ఆయుధములను దగ్గఱనే యుంచుకొని

నిద్రింపవలెను. గుఱ్ఱముల వీపులపైనుండి జీనులందీయరాదు. కళ్ళెములమాత్రమే తొలగించి వాని కాహారపానీయము లీయవలెను. ఏనుగులమీఁదనుండి హౌదా దింప వీలులేదు. శత్రువర్గ రాత్రమున వచ్చినను భయపడవలసిన యగత్యము లేకుండగ నాతఁడు చేసెను. నిర్దోషికి దుర్గాదాసుపిత, దోషికిఁ గాల యముఁడు. అందువలన దుర్గాదాసుచేసిన పైనియమము లన్నియుఁ బ్రతిసైనికునిచే నక్షరశః పాటింపఁబడుచుండెను.

దుర్గాదాసునకుఁ ద్రోవలో నొకప్రదేశము కనుపించినది. అదియొకప్రక్క మెరక; మఱియొక ప్రక్క పల్లమగుటవలనఁ బైనుండి క్రిందివారిని గొట్టుట, తానుఁ దప్పుకొనుట, చాలసులభము. అది తమకనుకూల ప్రదేశమని వ్యూహరచనా సమర్థుఁడగు దుర్గాదాసునకుఁ దోచెను. యుక్తి ప్రయుక్తులు దూరాలోచన కలిగియుండుటే కాదా మహాసేనాని లక్షణము. ఆ యుపాయమందఱకుఁ నచ్చుటవలన దుర్గాదాసుని యాజ్ఞచే నచ్చట స్కంధావార మేర్పాటుచేసి యుద్ధ మచ్చటినుండియే జరుపుట కేర్పాటులు చేయఁబడుచుండెను.

ఔరంగజేబు, రాజపుత్రస్థానముపైకి వచ్చుచు మార్గమునను న్న, చిత్తోర్, మాండలగడ్, మందసూర్, జీడన్, మొదలగు దుర్గముల స్వాధీనము చేసికొనుచు వచ్చుచుండుటచే, త్రోవలో నాలస్యమయ్యెను. ఈసమయ మూరక పోనీయక దుర్గాదాసు కందకముల ద్రవ్వించియుఁ గొన్ని ప్రదేశముల మెరకచేయించియుఁ దన స్థావరమును బలిష్ఠము చేసికొనుచుండెను. మార్గమధ్యమున యుద్ధములుచేయుచున్న యౌరంగ

జేబు, రాజపుత్రసైన్య మెంతయున్నదో, దానినాయకుఁడెవఁడో తెలిసికొనుటకై యిరువురఁ జారులఁబంపెను. అందులోనొకఁడు చిత్రకారుఁడు. చిత్రకారుని బంపుటలో నాతని యుద్దేశమిది. శత్రువుల స్థితిగతుల వాఁడు చిత్రించుకొనివచ్చిన తనకు శత్రువును జయించుట తేలిక. తన్నెదిరించుటకుఁ దప్పక దుర్గాదాసే రాఁగలఁడను నుద్దేశముతో బాదుషాచారులతోనిట్లనెను. "ఓరీ! మీరు శత్రుసైన్యమును, శత్రునాయకుని జాగ్రత్తగఁ జిత్రించుకొనిరండు. ఏమరకుఁడు."

పాదుషాయాజ్ఞప్రకారము గూఢచారులు దుర్గాదాసుని సైనికశిబిరముదగ్గఱకుఁ బోయిరి. లోపలికిఁబోవుటకు వారికే మాత్రము వీలుకలుఁగలేదు. ఏవిధముగనైనను లోపలికిఁబోవుటకు వీలులేకుండఁ గట్టుదిట్టముచేసిన నాయకుని ప్రజ్ఞకు వారాశ్చర్యపడిరి. బయటఁ గావలాకాయుచున్నవారి సంభాషణనుఁ బట్టి దుర్గాదా సాసైన్యమునకు నాయకుఁడని తెలిసికొనిరి. ఇంతలోదుర్గాదాసటువచ్చి వారినిఁజూచి మీరెవ్వరనెను. ఆతని నిశితవీక్షణములకు వారు గడగడవడకి మేముబాటసారులమనిరి. "మీరు బాటసారులా? నాకు మీసంగతియంతయుఁ దెలియును. పొండు. గంటకావల మీమొగము లీప్రాంతమునఁ గన్పించిన ప్రాణములు దక్క"వని పలికి తానావలకుఁ బోయెను. గూఢచారులిరువురు దుర్గాదాసుని దయకుఁ, బరేంగితావగాహనశక్తికి నాశ్చర్యపడి తమదారినిపోయిరి.

ఔరంగజేబొక మజిలీలో నుండెను. గులనారుకూడ నచ్చటనే యున్నది. గూఢచారులిరువురు తాము చిత్రించి

తెచ్చిన దుర్గదాసు చిత్తరువునిచ్చి తక్కినవిషయములు చెప్పి సెలవుతీసికొని పోయిరి. పాదుషా చిత్రమును జూచి గుండెపైఁ జేయివైచికొని "శివాజీ నెట్లైన సాధింపచ్చునేమోకాని యితనిని సాధించుటమాత్రము నాచేతఁగాద"నుకొనెను. చిత్రములో దుర్గాదా సశ్వముపై నుండి బల్లెముకొనకు మొక్కజొన్నకండెను గ్రుచ్చి క్రిందనున్న నిప్పులోఁ గాల్చుకొనుచున్నట్లుగఁ జిత్రింపఁబడెను. ఆచిత్రము చూచిన నెట్టివానికైన గుండెలు పగులవలసినదే.

గులనారా చిత్రమును జూచుటకై పాదుషాదగ్గఱకు వచ్చినది. పాదుషాయంతటివానికే యమితభయము గూర్చుచున్న యాదుర్గాదాసును జూడగనే యామె కపోలములరుణిమను దాల్చినవి. ఆవీరునిశీవి, విశాలవక్షస్థలము, దృఢబాహువులు గులనార్ హృదయమునుఁ జక్కిలిగింతపెట్టెను. "ఆమహావీరునిపరిచయముతనకెప్పుడులభించునా"యని తహతహలాడెను. పాదుషా యాపటమును, బటముతో మూసెను. గులనారు దుర్గాదాసును నిందించు నెపమునఁ బటమునుదీసికొని యాతని కపోలములను, ఉరమును, బాహువులను స్పృసించి కొంతతృప్తి పడెను.

ఔరంగజేబు తన సమస్తసైన్యముతో రాజపుత్రుల మర్దింపవలెనని బయలుదేరెను. ఆతఁడు తనసైన్యమునకు ముందు శతఘ్నులనుంచెను. శతఘ్నిబలముతో శత్రులఁగూల్చి తనబలమునకు నాశనములేకుండ చేయవలెనని యాతని యూహ!

దుర్గాదాసు వచ్చుచున్న మొగల్ సైన్యమును జూచెను. మొగలులు శతఘ్నులఁ బ్రయోగించుచు వచ్చుచుండిరి. దుర్గాదాసిట్లాలోచించెను. శత్రువునకు ఫిరంగిబలమెక్కువ; తమకుఁ దుపాకులున్నవి కాని ఫిరంగులులేవు. తెగించి ముందుకుఁ బోయిన తనసైన్యమును ఫిరంగులకాహుతిచేయుటతప్ప మఱియొక ఫలితములేదు. పాదుషాశతఘ్నిబలము రూపఱుపఁజాలకుఁ బాదుషాతోఁ దలపడఁగాదు. ఈవిషమసమస్యను గుఱించి దుర్గాదాసు తగిన యేర్పాట్లు చేసికొనియేయుండెను. మొగలులు కనఁబడఁగనే దుర్గాదాసురణభేరీవేయించెను. క్షణములో రాజపుత్రానీకమంతయు రణోన్ముఖమయినది. దుర్గాదాసు విజయాశ్వము నధిష్ఠించియేయుండెను. ఆయశ్వమున కొకప్రక్కయింకొకయశ్వముపై నున్న యాశ్వికునిచేత నొకజెండా యున్నది. దానిపై మృగేంద్రవాహనయైన దుర్గ మహిషాసురుని మర్దించుచుండెను. ఆమె భీకరదృష్టులు మొగలుల బూడిదచేయునట్లుండెను. మొగలులు పాదుషాయాజ్ఞచే శతఘ్నులనమితముగఁ బ్రయోగించుచుండిరి. వానివాతఁబడి రాజపుత్రులు మరణించుచుండిరి. రాజపుత్రులు కొంచెమెదిరించిరి. శతఘ్నులుకోపించి తమ భీకరాస్యములఁదెఱచి భయంకరముగ గర్జించుచు రాజపుత్రులఁ గబళించుచుండెను.

దుర్గాదాసు సమయోచితముగఁ దనసైన్యమునకు వెనుకకుఁ బొమ్మని యాజ్ఞయిచ్చెను. పాఱిపోవుచున్న రాజపుత్రసైన్యమునుజూచి పాదుషా గడ్డమును సవరించుకొనుచుఁ దన ప్రక్కన మఱియొక గజముపైఁ బురుషవేషముతోనున్న గుల

నారుతో "ప్రేయసీ! చూచితివా! మనసైనికుల పరాక్రమము! మన ఫిరంగుల ధాకకుఁ దాళజాలక రాజపుత్రులు పాఱిపోవు చున్నా"రని హేళనచేసెను. రాజపుత్రులోఁడిన దుర్గాదాసు పరిచయము కలుగదేమో యని గులనారు భయపడి యాందో ళనపడసాగెను.

మొగలుసేన యపరిమితోత్సాహముతో శతఘ్ని శకటముల ముందు బర్వెత్తించుచు ఫిరంగులఁ బ్రేల్చుచు వెంబడించుచుండెను. రాజపుత్రులు వెనుకకుఁబోయినకొలఁది మొగలులు సంరంభముతోఁ దఱుముచుండిరి. ఒక్క మైలుదూర మీ విధముగ రాజపుత్రుల మొగలులు దఱుముసరికి మొగలులపురోగమనమున కంతరాయముగ బెద్దమ్రోత యొండుప్పతిల్లినది. పాదుషాదంపతు లామ్రోతకులిక్కిపడిరి. భూమ్యాకాశము లేకమగునట్లు పొగవ్యాపించెను. ఆ దట్టమైనపొగలో నొకరి నొకరు కనుపించుటలేదు. పది నిమిషము లెచ్చటివారచ్చటనే యుండిరి. ధూమసంఘము వియత్తునకుఁ గెగిరినంతనే యాసంఘటన మొగలుల కర్థమయినది. ముందుఁబోవు శతఘ్నిదళము దానిని నడుపువారును శకలశకలములై పోయియుండిరి. ఒక్క ఫిరంగియైనను మిగులలేదు. పగిలిన ఫిరంగిశకలములు తగిలి వందలకొలది మొగలులు మరణించిరి. ఫిరంగిబలము మట్టిఁగలిసినంతనే దుర్గాదాసు శంఖము నొక్కదానిని భూనభోంతరము నిండఁ బూరించి వెనుదిరిగిమొగలుల నెదిరింపనాజ్ఞయిచ్చెను.

దుర్గాదాసు పాదుషాఫిరంగిబలమును ముందే రహస్య చారులవలన గుర్తించి త్రోవలో గోతులనుఁ ద్రవ్వించి వానిలోఁ

దుపాకిమందును నింపియుంచెను. కైన స్వల్పముగ మట్టిపోయించెను. మొగలులశతఘ్నిశకటము లామందున్న ప్రదేశముపైకి రాఁగానే యొక్కనిచే నందు నిప్పుపెట్టించెను. తుపాకిమందు భయంకరముగ నొక్కపరి ప్రేలినంతనే ఫిరంగులన్నియు ముక్కలుముక్కలైపోయినవి. దుర్గాదాసుని- యసాధారణ వ్యూహరచనాపద్ధతి పాదుశాహకర్థమయినంతనే యాతనికి భయ మెక్కువయ్యెను. గులనారుకు సంతోషాశ్చర్యము లుప్పతిల్లెను.

శతఘ్నిబలము నశించినంతనే రాజపుత్రసైన్యమంతయు నొక్కపరి విఱుచుకొని మొగలులపైఁబడెను. ఆపాటు, ప్రళయ కాలసముద్రతురంగతరంగసదృశము;పర్వతరాజములఁగూడపరా భవించు భయంకరవాత్య. మొగలులు తెప్పరిల్లి చూచునరికి రాజపుత్రుల కరవాలములు వారిపై వీరవిహారము చేయు చుండెను. ఇరుసైన్యములు ఢీకొన్నవి. పాదుషా గులనారుతో సైన్యమధ్యముననుండెను. ఆసైన్యమున కిరుప్రక్కల మూజిము, పఠాన్ సేనాపతియు నుండి సైన్యమునునడపుచుండిరి. ఈముగ్గురి ప్రోత్సాహముతో మొగల్‌సైన్యము రాజపుత్రులనెదిరించెను.

దుర్గాదాసు, వీపునబల్లెమును గట్టుకొని,కుడిచేత రాణా యిచ్చినపట్టాకత్తిని, నెడమచేత మఱియొక నిశితకరవాలమును ధరించెను. రెండుచేతుల కత్తియుద్ధములో దుర్గాదాసు ప్రథమ గణ్యుఁడు. అతనితరువాత భీమసింహుఁడు దుర్గాదాసు గుఱ్ఱ ముపైనెక్కి శత్రువులపైకి నడచెను. యజమాని చిత్తవృత్తిని గమనించి నడచుటలోఁ బేరువడిన యాయశ్వరాజము దుర్గాదా సదలించకుండగనే పోవుచుండెను. దుర్గాదాసు తనసైన్యమును

ప్రోత్సహించుచు శత్రువు నెదిరించెను. సంకులముగఁ బ్రారంభ మయిన యుద్ధము ముదిరినది. సైనికులు గుట్టలుగుట్టలుగఁ గూలుచుండిరి. ప్రాణములకుఁ దెగించి రాజపుత్రులు పోరు చుండిరి. ఎంతపోరిన నేమిలాభము? శత్రుసైన్యము నాలుఁగు రెట్లకు మించియుండెను. ఎంతమందిని నఱికినను మొగలులు వెనుకకుఁ దగ్గుటకుఁ బదులుగ ముందునకే వచ్చుచుండిరి. శత్రుల ఝణఝణలును, దుపాకులఢమఢమలును, నార్తులనాదములును, వీరులజయజయధ్వానములును, హయహేషలును, గజఘీంకార ములును గలిగి యాహవరంగమంతయు నతిభీకరముగనుండెను. పోరు పెరిగినకొలఁది రాజపుత్రులకు వెనుకంజవేయక తప్పాట లేదు.

రాజపుత్రుల వెనుకపాటును జూచి దుర్గాదాసు వారల నుద్దేశించి యిట్లుపలికెను. "ఓవీరులారా! మీరెవ్వరును వెను కంజవేయవద్దు. మనకు జయము తథ్యము; మనయందు న్యాయ మున్నది. శత్రువులు మనకంటె నధికముగ నున్నను మనము భయపడనవసరము లేదు. మీలో నెవరు వెనుకకుఁదగ్గునోవాఁడు, నాకును, మన దేశమునకును, దీరని కళంకమాపాదించినవాఁడు కాఁగలఁడు. మీరేమాత్రము భయపడకుఁడు. మీకు నేను మార్గదర్శకుఁడనయ్యెద" నని రెండుచేతుల ఖడ్గద్వయము నతి భీకరముగఁ ద్రిప్పుచు నశ్వమును మడమలతో నదుమ నది తూనీగవలెపోయి యుద్ధరంగమునడుమ వ్రాలెను.

అతిభయంకరుఁడై నదుర్గాదాసు సవ్యసాచియైయనిచేయ సాగెను. ఆతని ఖడ్గచాలనానైపుణ్యము చూపఱుల నందఱ

దిగ్భ్రాంతులఁ జేసెను. అంతకుముందు గుంపులుగుంపులుగనున్న మొగలులు వెఱచఱచి పరుగెత్తనారంభించిరి. తమనాయకుని యనన్యపరాక్రమవిజృంభణను జూచి వెనుకకుఁబోవుచున్న రాజపుత్రులు తిరిగి మొగలుల నెదుర్కొనిరి. మనోవేగముతోఁ దిరుగుచుండుటవలనదుర్గాదాసుని ఖడ్గము రేఖామాత్రముగఁ గన్పించుచుండెను. ఆతని భుజబలమంతు లేనిది. ఎంతమందినినఱికినను నాతని కలసటలేదు. దుర్గాదాసును బంధించుటకై యొక వందమంది వత్తురు. మఱుక్షణములో వారిలోఁ గొందఱకు ముక్కులు, కొందఱకుఁ జేతులు, కొందఱకుఁదలలు లోపించును. ఆదెబ్బతోఁ జావగామిగిలినవారు తిరిగిరణరంగము దెసచూడరు. మఱికొంత సేపటికి మఱికొందఱు పట్టుదలతో దుర్గాదాసుపైకి వత్తురు, వారిగతియు నంతే. కొందఱు భయపడుచునే దుర్గాదాసును సమీపింతురు. దుర్గాదాసుని ఖడ్గములు "బుస్సు"మనినంతనే వారుకాళ్ళకు బుద్ధిచెప్పుదురు. దుర్గాదాసెదుటఁ బహుటకుఁబ్రబలివాఁడును హడలిపోవుచుండెను. దుర్గాదాసెటుచూచిననటొకవంద ధనుస్సుల దూరము నిర్జనము. ఆతనిధాటికాగఁజాలక మొగలు లార్తనాదముచేయుచుఁ బరుగెత్తుచుండిరి. ఆయార్తనాదధ్వని యంతకంతకతిశయించి పాదుషాదంపతుల చెవినిబడినది. "అదేమో" యని వారు తలయెత్తిచూడఁ గొలఁదిదూరములో దుర్గాదాసుని ప్రళయతాండవము వారికి గోచరించెను. గులనారు నిదానించిచూచి దుర్గాదాసునుఁ బోల్చుకొన్నది. ఆమె మోమంతయుఁ గన్నుచేసికొని యావీరునిఁ దిలకించుచుం

డెను. ఆదృశ్యము పాదుషాకుఁ గ్రోధజనకముగను, గులనారున కామోదజనకముగ నుండెను.

దుర్గాదాసుని నిరంకుశత్వమునకుఁ గటకటఁబడి సేనాపతులు పురికొల్ప మెఱియలవంటి రెండువందల యాశ్వికులు హఠాత్తుగ దుర్గాదాసుపైఁబడిరి. కాని యేమిలాభము! ఒక్క గడియగడచుసరికి ఆవీరులు దుర్గాదాసుని ప్రచండాఘాతములకు గుఱియై తుండెము తుండెము లగుచుండిరి. పెక్కమంది రూపఱిపోయిరి; మిగిలినవారి పట్టుదలగాని, దుర్గాదాసుని వీరవిహారముకాని, యేమాత్రముతగ్గలేదు. ఈ విషమసంఘటనను ముక్కలుదీరిన పఠానువీరుఁడొకడు చూచెను. ఎదుటఁబడుటకాతనికి గుండెలులేక, వెనుకనుండి వచ్చి దుర్గాదాసును నఱుకుటకుఁ గత్తియెత్తెను. విజయాశ్వముయొక్క విచిత్రచంక్రమణమువలన పఠానునకు దుర్గాదాసువధ సాధ్యముకాలేదు. కత్తివిసరుటకు వీలులేక పఠాను దుర్గాదాసుపై కిబల్లెము నెత్తెను. అందుకుఁగూడ సమయము దొరకలేదు. దుర్గాదాసుని విజయము నిముసమునకుఁ బదిరకములుగఁ దిరుగుచుండును. అది పాదరసమువంటిది. పఠాన్ దుర్గాదాసునిపై బల్లెమువిసరనుండుటను జూచి గులనారు భయపడినది. ఆమె యారాటమున కవధిలేదు. విజయాశ్వము రెండునిముషములలోఁ దన యజమానిని బఠాన్ కొట్టనున్న సంగతినిఁ గనిపెట్టినది. పఠాన్ వెనుక నున్నాడు; దుర్గాదాసటుచూడక ముందున్న శత్రుల నఱుమాడుచుండెను. తాను వెనుదిరిగిన ముందున్న శత్రువులు తనయజమానిపైఁ బడుదురు. తా నాలస్యముచేసిన పఠాన్ బల్లెము

విసరఁగలఁడు. ఇఁక విజయమాలస్యము చేయక, ఉన్నట్లుండి యొక్క మొగు తెగిరి వెనుకటికాళ్ళను గట్టిగ జాడించినది. అతన్ను వెనుకనున్న పఠానుని గడ్డమునకుఁ దగిలినది. తగులుటయే తడవుగ నా పఠాన్ మూడు 'పల్టీలు' గొట్టినాడు. అతని చేతిలోని బల్లెము వెనుకనున్న మఱియొక మహమ్మదీయుని డొక్కలో దిగఁబడినది. విజయముయొక్క యుద్ధతలంఘనమునకు ఫలితమును గుర్తించి దుర్గాదాసు సంతోషాశ్రువుల గుఱ్ఱమువీపుపైఁ బడవిడిచెను. ఆ తమాషాను జూచి గులనారు ఫక్కున నవ్వెను. "ఔరా! ఎంతవిచిత్రాశ్వము" అని పాదుషా భయసంభ్రమములతోఁ బలికెను. దుర్గాదాసుకు సంబంధించిన ప్రతివస్తువునకింతటి శక్తియుండునని గులనారు సంతోషముతోఁ బలికెను. పాదుషా యామెపై నొకతీక్ష్ణదృష్టినిఁ బ్రసరింపఁజేసెను. అందులోఁ గ్రోధము, భయము వ్యక్తమగుచుండెను.

దుర్గాదాసుని యనార్యశౌర్యమునకు వెఱగంది పాఱిపోవుచున్న మొగల్ సైన్యమును బురికొల్పుచు మహాజిము దుర్గాదాసున్న చోటికి వచ్చెను. రాజకుమారుని రాకతోఁ దిరిగి మొగలులు విజృంభించిరి. అదిచూచి మండిపడి దుర్గాదాసత్యుద్ధతముగఁ బ్రళయసంహారము చేయనారంభించెను. మహాజిము మదపుటేనుగ పైనుండి సైన్యమును బురికొల్పుచు నీటెలయుద్ధమునుఁ జేయుచుండెను. రెండుగడియలయుద్ధముజరుగుసరికి మధ్యనున్న సైనికనికాయము మడియుటచే దుర్గాదాసు మహాజిమునకుఁ బది ధనుస్సుల దూరములోనికి వచ్చెను. దుర్గాదాసు, ఈటెలవిసరుచున్న మహాజిమును జూచినాడు. మహాజిముదగ్గఱ వందలకొలది

యీటెలమర్పఁబడి యుండెను. మాజిము దుర్గాదాసునుఁజూచి క్రోధముతో నొకయీటెను గుఱిచూచి విసరెను. దుర్గాదాసు విచిత్రముగ నశ్వమును లంఘింపఁజేసి యాదెబ్బ తప్పుకొనెను. మాజిము మఱియొక యీటెను విసరెను. దుర్గాదాసదియుఁ దప్పుకొనెను. మాజిము క్రోధముతో నీటెల విసరుచునే యుండెను. దుర్గాదాసు తప్పుకొనుచునే యుండెను. పైనున్న మాజిమునకుఁ గొట్టుట తేలిక. క్రిందనున్న దుర్గాదాసునకుఁ దప్పుకొనుటకష్టము. ఈటెలువ్యర్థమగుచున్నకొలఁది మాజిమునకుఁ గ్రోధము హెచ్చుచుండెను. ఈటెలు వచ్చుచున్నకొలఁది దుర్గాదాసునకుఁ జాకచక్యము మితిమీఱుచుండెను. ఇంతలో నొక మొగలులగుంపు మొఱికలవంటిది యొక్క మారుగ దుర్గాదాసు నాక్రమించెను. వారిని నఱుకుచు నీటెలఁ దప్పుకొనుట దుర్గాదాసునకుఁ గష్టతరము, కష్టతమము నయ్యెను. శత్రువులచేఁ జుట్టఁబడిన దుర్గాదాసు రాజపుత్రులకుఁగనుపించుటలేదు. రాజపుత్రులలో నలజడి హెచ్చినది. ఆసంగతి గ్రహించి సమరదాసై దువందలమంది రాజపుత్రవీరుల వెంటనిడుకొని దుర్గాదాసుకు సహాయముచేయుటకై పోయెను. దుర్గాదాసునకుఁ దనకు మధ్య మొగల్సైన్యముండుటచే సమరదాసెకాయెకి దుర్గాదాసు దగ్గఱకుఁ బోలేక యడ్డమున్న శత్రువులతోఁ బోరుచుండెను. సమరదాసు వచ్చిపడుటవలన మొగలులలోఁ గొందఱటుతిరిగిరి. కొందఱు దుర్గాదాసుతోఁ బోరుచుండిరి. రానురాను మాజిము విసురుగ నీటెల విసరసాగెను. ఇటు మాజిమునీటెలఁదప్పుకొనుట, యటుమొగలుల ఢీకొనుట, దుర్గాదాసుకుఁ జాలకష్టమగుచుం

డెను. శత్రువుల కత్తిదెబ్బలచ్చటచ్చటఁ దగిలియుండెను. శత్రు మధ్యముననున్న యాతనికి "రాజపుత్రులు సాయము చేయుదు" రను నాశ యడుగంటినది. ఇంతలో మొగల్ వీరుఁడు విసరినకత్తి యొకటివచ్చి దుర్గాదాసుని యెడమభుజమునకుఁ గ్రుచ్చుకొనెను. స్వల్పముగ రక్తముచిందెను. సాధారణముగ నాపదవచ్చినపుడు చాలమందికి భయము, దిగులు కలుగును. దుర్గాదాసు ప్రకృతి వేఱు. పెట్టతగిలినకొలఁది, ఒత్తిడియధికమైనకొలఁది యాతని ధైర్యసాహసములు వేలనతిక్రమించును. వీరుల లక్షణమదియే కదా! ఇటు ఈటెకో, అటు మొగలులఖడ్గములకో బలికావల సిన యావశ్యకత యేర్పడినంతనే దుర్గాదాసున కెక్కడలేని క్రోధము జనించినది. తానెక్కడనున్నదియు శత్రువులకుఁ దెలియకుండ పదినిమేషములశ్వముచేఁ జిత్రాతిచిత్రములైన చంక్రమణముల నతివేగముగఁ జేయించుచు రెండుకత్తులతో నతి చాకచక్యముగ యుద్ధముచేసెను. ఆతని కత్తులముందు పర్వత పక్షచ్ఛేదకమైన కులిశాయుధము తీసికట్టు. ఆతని ధైర్యము ముందు హిమవన్నగమతిస్వల్పము. ఆతని పరాక్రమముముందు హరిహరబ్రహ్మలర్భకులు. ఆతని శత్రుమర్దనముముందు రుద్రుని ప్రళయతాండవము కొఱగానిది.

దుర్గాదాసుని యశ్వలంఘనములకు, ఖడ్గాఘాతములకు నచ్చటి మొగలులలో సగముమంది ముక్కలుచెక్కలైరి. తక్కిన వారు కాళ్ళకు బుద్ధిచెప్పిరి. ఆ సమయమున దుర్గాదాసెచ్చట నున్నది తెలియకపోవుటవలన హరాజిము చేత నీటె ధరించి కొట్ట వలెనని చూచుచుండెను. శత్రువులు పాఱిపోవుటచే దుర్గాదా

సొకింత శాంతించెను. ఆక్షణములోనే మహాజిమునీల్కి దుర్గా
దాసుపై కలికిక్రూరముగ వచ్చుచుండెను. మహాజిముని మూచేతకు
దుర్గాదాసు మండిపడెను. ఆతని కొడలు తెలియని యావేశము
వచ్చెను. తోడనే యాతఁడా యీటెను వామహస్తమందలి
కత్తిచే నావలకు నెట్టి తెప్పపాటులోఁ గళ్లెమును బైకిలాగెను.
ఆహా! ఏమాశ్చర్యము! గుఱ్ఱము లేనుఁగను జూచి భయపడి
పాఱిపోవును. విజయమట్లుచేయక యజమాని యుద్దేశమును
గుర్తించి తనముందటి రెండుకాళ్ళను మహాజిము నేనుఁగు కుంభ
స్థలముపైఁ బెట్టెను. ఆ యేనుగా మహావీరుని తేజమునకు, శివి
జంకినదోయన స్తంభించిపోయెను. గజాశ్వహృదయవేత్తయైన
దుర్గాదాసునకు, ఏ యేనుఁగు, ఏ గుఱ్ఱము మోకరింపదు!

గుఱ్ఱము పైకిలేచుటతోడనే మహాజిము తల దుర్గాదాసు కత్తి కందుబాటులోనికి వచ్చినది. తనకును మహాజిమునకు మధ్య నున్న మావటివాని నొక్క దెబ్బతో దుర్గాదాసు నఱికివైచెను. యిదియంతయు నొక్క క్షణములో జరిగెను! "తనయీటెను దుర్గాదాసు కత్తితో నావలఁబడఁగొట్టె" నను గోపముతో మహాజిము వేఱొకయీటెనందుకొనుటకై వెనుకకుఁ దిరిగి, యీటెనందుకొని "యీదెబ్బతో దుర్గాదాసును బడఁగొట్ట వలె" ననునూహతో నిటుతిరిగెను. అప్పుడు మహాజిముస్థితివర్ణింప రానిది. ఒడలంతయుఁ జెమ్మట గ్రమ్మ నాతఁడు గటగడలాడు చుండెను. నోటతడిలేదు. ఎదురుగ గుఱ్ఱముపైనుండి దుర్గాదాసు కత్తినెత్తి తలనఱుక నుంకించుచు, "దుర్మార్గుఁడా! చేయెత్తిన నీప్రాణములు దక్కవు. జాగ్రత" యని గర్జించుచుండెను.

గత్యంతరములేక, ప్రాణభీతి బాధింపగ హజిమీాఁ డను గ్రిందఁ బడవైచి చేతులుజోడించి "మహాత్మా! నన్ను జంపకుము; నిన్ను శరణువేడుచుంటిని; శరణన్నవారిని రాజపుత్రులు రక్షింతురట కదా! నీకాళ్లుపట్టుకొందును; నీయింటఁదాసుడనై వర్తింతును; నన్నువిడువు"మని యాడదానివలె నేడ్చెను. ఆతని యార్త నాదము విన్నంతనే యాపీనుని గుండెకఱగినది. దుర్గాదాసు, ఎత్తిన కత్తిదింపి, "సిగ్గులేనివాఁడా! ప్రాణములకై యెంత దీన ముగఁ బ్రార్థించితివి. ఇది మీాబోఁటివారికే చెల్లుబా"టని తన యశ్వమునకట్టియుంచి యాతని చేతుల బంధించెను. ఇంతలో సమరదాసు మధ్యనున్న శత్రుల నిర్జించి తన యన్నను గలిసి కొని యాతని యాజ్ఞచే హజిమును బందీగాఁదీసికొనిపోయెను. ఈ సంఘటనలను బాదుషాదంపతులు చూచుచునేయుండిరి. కనివిని యెఱుఁగనట్టి దుర్గాదాసుని పరాక్రమాతిశయము, విశే షించి చేతికిఁజిక్కిన శత్రునిప్రాణములుతీయక విడుచుటయందలి యాతని కరుణాతిశయము గులనారును బూర్తిగఁ బిచ్చిదానినిఁ జేసివైచెను. అట్టివానినిఁ బొందలేని తనజన్మ వ్యర్థ మనికూడ నారమణీమణి తలచెను. హజిము బంధితుఁడైనందుల కాగ్రహ పరవశుఁడై, పాదుషా సైన్యమును బురికొల్పుచు, "దుర్గాదా సును బట్టియిచ్చిన వారికి జాగీర్లిచ్చెద" నని యాశపెట్టుచు, "వెనుదిరిగిన వారినిఁ గాల్పెదను"నని భయపెట్టుచు, "ముందుకుఁ బొండు"డని చేయివీచుచు ముందుకుఁ బోయెను.

పాదుషా పిలుపువిని మొగల్ సైన్యము వెనుదిరిగి రాజ పుత్రులనెదిరించినది. మూాడువేల యంగరక్షక సైనికులమధ్య

నుండి తిలకించుచు పాదుషా సైన్యమునధికముగఁ బ్రోత్సహించు చుండుటచే మొగల్ సైన్యమంతయు నేకమై ప్రచండముగఁ దిరుగఁబడినది. దుర్గాదాసు ప్రచండ సైన్యమునుజూచి సమర దాసునుఁబిలిచి "సోదరా! నీవు పదివేలసేనతో వెనుకనుండి తలపడుము. తక్కిన సైన్యముతో నేను ముందునుండి తలపడెద ననెను. పిమ్మట సోదరులిరువురు కర్తవ్య పాలనకై యేగిరి.

దుర్గాదాసు దుర్గాంబికకు మనసార నమస్కరించి యాహావరంగమున నుఱికెను. ఆతని సంగతి చవిచూచిన మొగల్ సైన్యము, "శిలాపతనమును బొందిన నీటివలెఁ" బ్రథమమున విచ్చిననుఁ దిరిగి సంఘీభవించి యాతని నెదుర్కొనెను. తిరిగి యుభయసైన్యములకు భయంకరయుద్ధము సాగినది. దుర్గాదాసు డైన దుర్గాదాసుని యపారభుజశక్తి కడ్డులేదు. ఆతని నిశిత కరవాలము లేవేళ నెవని యుసురులఁ జవిచూచునో యెవ్వని కెఱుక! భయంకరమూర్తియైన యావీరమూర్తి యెదుటి సైన్య మంతయు బెగ్గడిల్లి తబ్బిబ్బుపడసాగినది. దుర్గాదాసు తనముందు శత్రులనుఱుమాడుచు నౌరంగజేబు నెదుటికిఁ బోవుచుండెను. దుర్గాదాసు సమీపించిన నౌరంగజేబు గతికూడ షాజిము గతియే కాఁగలదని మొగలులు భయపడిరి. ముందుకుఁ బోవుట కెవ్వరికిని గుండెలులేవు. పాదుషా పైకిఁ బోవుచున్న దుర్గాదాసును, అమీర్ ఖానను సేనాపతిచూచి సైన్యమును వడిగనడిపించుకొనుచుఁ బాదుషాకు సహాయము వచ్చు చుండెను. ఆతఁడడ్డుపడకముందే చక్రవర్తిని బంధింపవలెనని దుర్గా దాసుని యూహ. అందువలనతీవ్రముగ శత్రునాశనముచేయుచు

దుర్గాదాసు చురుకుగఁ బాదుషాకభిముఖముగఁ బోవుచుండెను. కొలఁదిసేపటిలో నిటుదుర్గాదాసును, నటు అమీర్‌ఖానును, బాదుషాకు ముప్పదిగజములదూరములోఁ దారసిల్లిరి. దుర్గాదాసమీరును లక్ష్యముచేయక పాదుషామీఁదికే పోవుచుండెను. ఆలస్యముచేసినలాభము లేదని యమీర్ దుర్గాదాసుతోఁ దలపడెను. ఇరువురుసేనాపతులును హోరాహోరిగఁ బోరుచుండిరి. దుర్గాదాసువెంటవచ్చిన రాజపుత్రసైన్యము పాదుషా యంగరక్షకసైన్యముతోఁ దలపడెను.

అమీర్ సామాన్యుఁడుకాడు. మాయాయుద్ధధురీణుఁడు. దుర్గాదాసుని పటాటోపమును జూచి యాతని మాయాయుద్ధములో జయింపనెంచి, తానోడిపోవుచున్నట్లుగ నటించుచు వెనుకకుఁ బోవుచుండెను. దుర్గాదాసు వానిని వెంబడించుచు "శత్రువులు వెనుకనుండి తనపైఁ బడుదురేమో" యని వెనుకచూపుతోఁ గూడనుండెను. దుర్గాదాసుని దృష్టి రెండువిధములుగా నుండుటను గనిపెట్టి యమీరొక్కసారి గుఱ్ఱమును ముందుకు దుమికించి కత్తితో నొక్కవిసరు విసరెను. ఇంకొకఁడైనచో నాదెబ్బకు రెండుతుండెములు కావలసినదే! యుద్ధవిషయకయుక్తిప్రయుక్తులకుఁ బుట్టినిల్లుకాన దుర్గాదాస్ గుఱ్ఱమునొక్కయుదుటున బక్కకుఁ దొలగించెను. ఖానుని దెబ్బకు దుర్గాదాసువెనుకనున్న రాజపుత్రుఁడొకఁడు భూమికొరగెను. ఖానాయూపునకు గొంతముందుకుఁబోయి త్రిప్పుకొని, దుర్గాదాసుతోఁ గలియఁబడెను. కొలదిసేపటికిఁ బాదుషాకభిముఖుఁడుగ ఖానును, విముఖుఁడుగ దుర్గాదాసును, నిలచి, యుద్ధముచేయుట తట

స్థించెను. ఆయడను కసిపెట్టి వెనుకనుండి యేనుగుచేఁ గొట్టింపుమని పాదుషా యొకమావటివాని కాజ్ఞాపించి తనయేనుగను గూడఁ బ్రక్కనుంచి దుర్గాదాసుపైకి బురికొలిపించెను. రెండు గజములును మావటీండ్రచే శిక్షింపఁబడి, భయంకరముగ ఘీంకారములుచేయుచు రెండుప్రక్కలనుండి దుర్గాదాసుపైకి వచ్చుచుండెను. అమీరది గమనించి దుర్గాదాసునకు వెనుదిరుగుట కవకాశమీయక మఱిమఱి కవ్వింప సాగెను. వెనుకటి సంగతి దుర్గాదాసు గుర్తింపలేదు. ఇఁక నిముసములో దుర్గాదాసు పరలోకమునకేగనుండెను. ఇంతలో వెనుకనుండి దుర్గాదాసు వీరకృత్యములఁ జూచుచున్న గులనారు "ఏనుఁగలు దుర్గాదాసును బట్టుకొన్న"వనుకొని కెవ్వున కేకవైచెను. ఆకేక విని దుర్గాదాసు గుఱ్ఱమునతివిచిత్రముగ ఖానునకుఁ దొరకకుండగఁ దప్పించి చటుక్కున వెనుదిరిగిచూచెను. రెండేనుగలు రెండుప్రక్కలనుండి తొండములనెత్తుకొని భయంకరముగఁ దనపైకి వచ్చుచుండెను. ఏనుగుతొండములకుఁ దనకు రెండు మూడుగజములకంటె నెక్కువ దూరములేదు. ఇటు ఖాన్, తన కంఠమునకు గుఱిచూచి బల్లెము నెత్తినాడు. దుర్గాదాసు తనను మృత్యుదేవీదంష్ట్రికామధ్యగతునిగఁ దెలిసికొనెను. ఱెప్పపాటాలస్యము చేసినను లాభములేదని తెలిసికొని దుర్గాదాస్ మెఱుపుతీగెవలె గుఱ్ఱముపైనుండి క్రిందకులంఘించెను. లంఘించుచునే ప్రక్కనుండి తనపైకివచ్చుచున్న పాదుషాగజమును జూచి బలమునంతయుఁ గుడిచేతియందుఁ జేర్చి పట్టాకత్తితోఁ బాదుషాయేనుగు తొండమును పామ్మని నఱికెను. ఆదెబ్బకు

బలిష్ఠమైన ఆ మదమాతంగము తొండము రెండు తుండెము లయినది. ఏనుఁగుతొండమును నఱుకుచునే దుర్గాదాసు వామ హస్తమందలి కరవాలమును గుఱిచూచి యమీర్ ఖానుపైకి విసరెను. ఆదెబ్బతో నమీరుతల తెగి యాననలఁబడినది. కొంత దూరము వఱకుఁ బాఱిపోవుచున్న గుఱ్ఱముపై నమీర్ కబంధ మట్లేయుండెను. దానినిఁజూచి మొగలులు భయపడి యెక్కడి వారక్కడనుండి పాఱిపోఁజొచ్చిరి. తొండము తెగిన పాదుషా గజము భయకంపితమై యెంతమంది యాపినను నాగక పాఱి పోయెను. ఆపాఱిపోవుటయే పాదుషాకు మంచియయినది. లేనిచో దుర్గాదాసునకుఁ జిక్కియుండెడివాఁడే.

అమీరు దుర్గాదాసుకంఠమునకు గుఱిచూచి బల్లెమును విసరెనుగదా! అదేసమయమున వెనుకనుంచి వచ్చుచున్న యేనుఁగు దుర్గాదాసును జంపుటకై దగ్గఱకువచ్చెను. అమీరు బల్లెమునకును, ఏనుఁగునకును, మధ్యదుర్గాదాసుండెను. రెండిం టికి లక్ష్యమొకటే యగుటవలన దుర్గాదాసు గుఱ్ఱమునుండి దూకగనే యమీరుబల్లెము, యెదురుగవచ్చుచున్న యేనుగు కంటిలో గ్రుచ్చుకొనెను. ఆ బాధను సహింపలేక యాహస్తి దిక్కులుప్రతిధ్వనించునట్లు కరుణామయమైన రోదనఁజేయుచు గిరగిరఁదిరిగి క్రిందపడిపోయెను.

కిష్టాతికిష్టమైన యాసంఘటనను దప్పించుకొని దుర్గా దాసు విజయాశ్వమునధిరోహించెను. పాదుషాగతియు, నమీరు మహాజిములగతియు, నదోగతియగుటవలన మొగల్ సైన్యమం

తయు గాలికిబుద్ధిచెప్పకొన్నది. రాజపుత్రు లెదిరించిన వారిని నఱకుచు శరణన్నవారిని బంధించుచుండిరి.

గులనారు తనముందు వీరవిహారముచేయుచున్న దుర్గాదాసుని దివ్యమూర్తి ననిమేషములైన నేత్రములతోఁ బానము చేయుచుఁ బ్రపంచమునే మఱచియుండెను. ఆమె మావటివాఁడు సంగతిసందర్భములను గమనించి యేనుఁగను వెనుకకుఁ ద్రిప్పి పాఱిపోవుచుండెను. దుర్గాదాసదిగమనించి తనయశ్వము నావైపునకుఁ ద్రిప్పి వెంబడించెను. కొన్నినిమిషములలో దుర్గాదాసుని యశ్వము ముందుకుఁబోయితనముందుకాళ్ళనుగజము కుంభస్థలమున నుంచెను. దుర్గాదాసొకయుదుటున మావటీని నఱికెను. అంతకుముందే గులనారు భయపడి యంబారీనిపటాచ్ఛాదితము చేసియుండెను. తనకు శత్రువుభయపడి లోనదాగి యున్నాఁడనియెంచి దుర్గాదాసు ద్విపముపైకి లంఘించి తెరనుఁ చించి లోనఁ బురుషాకృతితోనున్న గులనారు చేతినిఁ బట్టుకొని యొక్కలాగులాగెను. ఆవేగముచే నామెయుష్ణీషము జారిపడి పోయెను. ఆమె ఘనీలకుంతలములు, రాకాసుధాకరునిఁబోలు మోమును, దుర్గాదాసునకు స్పష్టముగఁ గన్పించెను. ఆమెను స్త్రీనిగాగుర్తించినంతనేదుర్గాదాసామెచేతినివిడిచి "ఎవరమ్మా! మీ"రని ప్రశ్నించెను. దుర్గాదాసుని కరస్పర్శచే నామె యొడలినే మఱచియుండెను. సమాధానము రాకపోవుటచే దుర్గాదాసదే ప్రశ్న మరలయడిగెను. ఈమారామె సంబాళించుకొని తన విషయమును జెప్పెను. దుర్గాదాసామెను విడువఁదలచెను. కాని యుద్ధఖైదీలను విడుచునధికారము రాణాది. తాను రాణాతోఁ

జెప్పి యామెను విడిపింపవలెను. అంతవఱకామె కెట్టియిక్కట్టును రారాదని యెంచి విజయమును దనతో రమ్మని సంజ్ఞచేసి, యేనుఁగును దానేనడుపుచు విజయధ్వానములఁజేయుచున్నతన వారి దగ్గరకుఁ బోయెను. గులనారుకుఁ బ్రయాణములోఁ బ్రత్యేకపు టేర్పాట్లు చేసి దుర్గాదాసామెను, అంగరక్షకునివలెఁ గాపాడుచు నుదయపురమునకుఁ బయనమయ్యెను.

మిగిలిన రాజపుత్రసైన్యము యుద్ధభూమిలోఁ బ్రాణభీతిచే మొగలులచే విడువఁబడిన సాధనసంపత్తినంతయు స్వాధీనము చేసికొని సంపూర్ణవిజయముతో, మహోత్సాహముతో నుదయపురమార్గముపట్టెను. దుర్గాదాసు తనకు రక్షకుఁడగుటకుపొంగుచుఁ దీయనిస్వప్నములఁగనుచు గులనార్ గౌరవమైన బందీగా నుదయపురముఁ దీసికొనిపోఁబడెను. తొండము తెగిన పాదుషాగజము కొన్నిమైళ్ళతివేగముగఁ బోయి క్రిందఁబడి పోయెను. ఆ పడుటలోఁ బాదుషాకు గట్టిదెబ్బలు తగిలినవి. కొంతనేపటికి హతశేషులువచ్చి పాదుషాతోఁగలిసిరి. పాపము! పాదుషాకు సర్వముపోయినది. సర్వముపోవుటయొక యెత్తు; గులనార్ పోవుటయొక యెత్తు. ఏమిచేయఁగలఁడు? ప్రతిక్రియ సేయ నోపలేక యౌరంగజేబు, అపజయావమానభారముతోను, ప్రియావిరహభారముతోను, దలవంచుకొని నిస్తేజస్కములైనముఖములతో, హతశేషులనుకరింప, "నచ్చటనున్న, దుర్గాదాసువచ్చునేమో" యను భయముతో రాజధానికి త్వరగఁగదలిచనెను.

# ౧౨

దుర్గాదాసు యుద్ధానంతరము సమస్తసైనికులతోను, బందీలతో నుదయపురమునకుఁ బోయెను. భీమసింహుని మరణవార్తాశ్రవణముచే మతిచెడియున్న రాణా, బందీలమీఁదసర్వాధికారమును దుర్గాదాసునకిచ్చెను. దుర్గాదాసు పాదుషాప్రేయసిని బంధవిముక్తనుఁ జేసి, రెండువందలమంది సిపాయీలను రక్షణనిచ్చి పాదుషాదగ్గఱకుఁ బంపెను. గులనారును పంపుట మహామాయ కిష్టము లేదు. గులనారును జిత్రవధచేయింపవలెనని యామెపట్టుదల. గులనారు ఆకలిగొన్న నేత్రములతో దుర్గాదాసుని రూపమును నిలువెల్లఁ జూచుచుఁ దనప్రేమ నంతను దృష్టులతో వెల్లడించెను. దుర్గాదాసు దానినేమియు గమనింపక యామెనుఁ బాదుషాదగ్గఱకుఁ బంపెను.

మహామాయ కొన్నాళ్లు రాణాభవనమునందే యుండి యాతనియనుజ్ఞపొంది మార్వాడపోయెను. దుర్గాదాసామె కంటె ముందుపోయి యచ్చటనున్న శత్రువుల నదలించి మార్వాడ నాక్రమించి యుండుటచే రాణి యెట్టికష్టము లేక యెకాయెకి భర్తృభవనమునకు వెళ్ళెను.

కొంతకాలము గడచినది. అజితునకైదేండ్లు వచ్చినవి. పంచవర్షప్రాయుఁడైన అజితుని రాజుగాఁజేయఁదలచి, యా విషయమును దుర్గాదాసు రాణితోఁ జెప్పి, యజితుఁడు రాజ్యపాలనసమర్థుఁ డగువఱకుఁ దానుగాని, తనతమ్ముఁడుగాని రక్షకులుగ నుందుమనికూడ చెప్పెను. అందులకు మహామాయ

యంగీకరించినది. దుర్గాదాసు మహాహూర్తికులచేఁ బట్టాభిషేక మున కొక్క శుభముహూర్తము పెట్టించి యందులకుఁగావల సిన యత్నములన్నియుఁ బెద్దపెట్టున నేర్పాటుచేయుచుండెను.

రాజమహాల్ అతిసుందరముగ నలంకరింపఁ బడినది. సామంతులందఱు దర్బారులో మహారాజును జూచుట కేర్పాటు చేయఁబడినది. సభాంగణము విశాలమై యుండెను. నేలయంతయు రత్నకంబళములచే నాచ్ఛాదింపఁబడినది. పైనఁగట్టబడినచాందినీ వ్యజనమారుతా హతమై కదలుచు స్వర్గంగాతరంగములలీలనుఁ బోలియుండెను. సామంతులును, దక్కిన పెద్దలునుఁ గూర్చుండు టకు ధనురాకారముగ నాసనము లమర్పంబడియుండెను. వానికి మధ్య నవరత్నఖచితమై ధగధగ మెఱయుచున్న సింహాసన మొండు దృగ్గోచరమగుచుండెను. దానిదీధితులు చూపఱులకండ్లు మిఱు మిట్లుగొలుపుచున్నది. ఆ సింహాసనము మహారాణాకై యమర్పఁ బడినదని యెల్లరకుఁ దెలియుచునేయుండెను. సభారంగమునకుఁ జుట్టు నమలమణిదర్పణము లమర్పఁబడి యుండెను. ఆయద్దము లందుఁ బ్రతిఫలించుచున్న రాజపుత్రుల యాసనములు పరిమిత ములైనను నపరిమితములవలె నుండెను. ముహూర్తమునాఁటికి జోధపుర మమరావతివలెఁ బ్రకాశించుచుండెను.

పట్టాభిషేకదినము వచ్చినది. ఆనాఁడు పగలెనిమిది గడియలప్రొద్దెక్కినప్పటికి ముహూర్తము. సభారంగమంతయుఁ గిటకిటలాడుచుండెను. సరిగాముహూర్తసమయమున కజితుఁడు సభకుఁ దీసికొనిరాఁబడెను. యథావిధిగఁ బట్టాభిషేకతంత్ర మంతయు జరిగిపోయినది. ఇఁక మిగిలినది కిరీటధారణము,

ఖడ్గధారణము. ఈరెండును నొకమహాత్మునిచేఁ బ్రభువున కీయఁబడవలెను. అట్టివాఁడెవఁడాయని యచ్చటనున్నవారిలో నెవ్వరికి సందేహము రానేలేదు. ఆసమయము వచ్చుసరి కందఱిదృష్టులు దుర్గాదాసుపై నిలచినవి. దుర్గాదాసధోముఖుఁడై నిలిచియుండెను. అతని కనుగొలకులనుండి నీటిబిందువులు రెండు కపోలములపైనుండి జారినవి. ఇట్టి శుభసమయమున సంతోషించుటకుఁ బ్రభువు లేడనికాబోలు! ఆహా! వీరశిరోమణీ! నీకంటె స్వార్థత్యాగి యేకాలమందు, నేదేశమందును లేడుకదా! జీవితమునంతయుఁ బ్రభుసేవలో వ్యయించిన నీబోటి స్వార్థత్యాగులుండుటచేతనే యీ భూమాత నేఁటికి నీదుర్భరభారము భరింపఁ గలుఁగుచున్నది. అష్టకష్టములకు లోనయ్యు, చెదరక బెదరక, ప్రభుపుత్రునిఁ బెంచి సింహాసనమెక్కించు నీకంటె మహాపురుషుఁడెవఁడు!

రాణిచేఁ బ్రబోధింపఁబడి దుర్గాదాసు, నవరత్నఖచితమై, ధగధగ మెఱయుచున్న కిరీటమును నజితుని శిరమున నిడి రాజఖడ్గము నాతనికటిసీమబంధించి యాశీర్వదించెను. సామంతులందఱు ప్రభుని ఖడ్గమును ముద్దిడుకొనుట నాఁటియాచారము. అట్లు ముద్దిడుకొనుటయే యాప్రభుని పాలన నంగీకరించుట. ప్రతి సామంతుఁడును లేచివచ్చి రాణాకు నమస్కరించి యాతనిఖడ్గమును ముద్దిడుకొనిపోయిరి. ఆనాఁటిప్రజలుతమప్రభుని, రాణా, మహారాణా, యని పిలుచుచుందురు. పట్టాభిషేకానంతర మెవరి యావాసములకు వారుబోయిరి. అజితుఁడు యుక్తవయస్కుఁడగువఱకు రాణియాతని యొద్దనే యుండఁదలచెను. దుర్గాదాసు

పితయై, మాతయై, శాసకుఁడై, సోదరుఁడై భృత్యుఁడై, యజితు నకు సర్వవిద్యలఁ గఱపుచు నాతనిచే రాజ్యపాలనఁ జేయించు చుండెను.

దుర్గాదాసు యుద్ధఖైదీలనందఱను కొన్నిషరతులప్రకారము వదలివేసి యుండెను. అట్లువిడువఁబడినవారిలో నక్బరొకఁడు. ఆతని కొక కూఁతురున్నది. ఆమెపేరు రజియా; రజియాకుఁ జిన్నతనములోనే తల్లి మరణించుటవలన నక్బరే యామె నల్లారుముద్దుగఁ బెంచెను. అక్బరు రాజపుత్రుల నతిగ మెచ్చుకొనెను. వారిపరాక్రమమునకుఁ, జేతికిఁ జిక్కిన శత్రులనందఱ విడిచిన వారి కరుణాతిశయమునకు నాతఁడు ముగ్ధుఁడై పోయెను. తనకు వారిసహాయమున్నచోఁ జక్రవర్తిత్వము తప్పక లభించును. రాజపుత్రులు తనను నమ్మిరి. పాదుషాదగ్గఱకుఁ బోవుటయే తనకర్తవ్యము. ఈయాలోచనలతో నక్బరు కొంతకాల మెవ్వరి దరి చేరకుండ కాలమును గడపెను.

ఔరంగజేబు, అక్బరు సంపూర్ణముగ నోడివచ్చినదగ్గఱ నుండి యాతని నాదరముగఁ జూడమానెను. క్రమక్రమముగ నక్బరునకుఁగూడ తండ్రిపైని నమ్మకము తగ్గఁజొచ్చెను. రాజ్యము తనకీయఁడేమో యను సందేహముకూడ నక్బరును బాధింపఁ జొచ్చెను, దుర్గాదాసుని యండ తనకున్నఁ జక్రవర్తిత్వము లభించునను నాశకూడఁ బ్రబలమౌటచే నక్బరు దుర్గాదాసు నాశ్రయింప నిశ్చయించుకొనెను.

అక్బరు పుత్రీసహితుఁడై జోధపురమందున్న దుర్గాదాసు దగ్గఱకుఁ బోయెను. సమరదా సక్బరుతో నేకీభవించుటకు

సమ్మతింపలేదు. అక్బరుతోఁ గలియుటవలనఁ దమకుగల్గులాభము లను దుర్గాదాసు విశదీకరించి చెప్పిన తరువాత నాతఁడంగీకరించెను. క్షత్రియునకు శరణాగతరక్షణమే ముఖ్యమను నుద్దేశముతో దుర్గాదాసును, రాజ్యకాంక్షతో రాజపుత్రులును, నంగీకరించిరి. అక్బరు స్వాధీనమున ముప్పదివేలవఱకు మొగల్ సైన్యముండెను. ఆసైన్యము నతఁడు దుర్గాదాసు స్వాధీనము చేసెను. దుర్గాదాసాసైన్యముతోను, గొంతరాజపుత్రసైన్యముతోనుఁ, జక్రవర్తిపై దండెత్తెను. చక్రవర్తినోడించి యక్బరును జక్రవర్తిచేయవలెననియు, రాజపుత్రరాజ్యములనిరుపద్రవముగఁ జేయవలెననియు, దుర్గాదాసుని యూహ. తననుఁ జక్రవర్తిగఁ జేసిన "రాజపుత్రులకు విధేయుఁడనుగ నుందు"నని యక్బరంగీకరించియుండెను. దుర్గాదాస్ త్రోవలోనున్న, ఝూల్‌వాడా, మాల్వా మొదలగు దుర్గములనాక్రమించుచుఁ జక్రవర్తిపైకిఁ బోవుచుండెను. సహజముగ విలాసప్రియుఁడైన యక్బరు, దుర్గాదాసుతనకభయమిచ్చుటచేతను, నప్పుడే కొన్ని దుర్గములు దుర్గాదాసునకు స్వాధీనమగుటచేతను, దాను బాదుషాయైనట్లే నటించుచుఁ దన డేరాలయందు సురాపానములతోను, వేశ్యాసుఖములతోనుఁ గాలక్షేపము చేయుచుండెను.

గులనారుకు దుర్గాదాసునిపై నానాఁటికిఁ బ్రేమయధికమగుచుండెను. కష్టమైనను, నష్టమైనను, రాజ్యమంతయు భ్రష్టమైనను, దుర్గాదాసు తనవాఁడుగాఁగావలెనని యామె పట్టుదల. దుర్గాదాసుని దృఢ సుందర దేహమును, ఆతనియత్యున్నతమైన యాత్మను దలచుకొన్నప్పు డెల్ల నామె శరీరము నే

మఱచుచుండెను. దుర్గాదాసును బ్రత్యక్షముగఁ జూచిన కండ్ల
తోఁజూడ నౌరంగజేబామెకుఁ గొండ్రముచ్చువలెఁ గన్పట్టు
చుండెను. "రాజునుఁ జూచినకండ్లతో మగనినిఁజూచిన మొట్ట
బుద్ధివేసినద"ను సామెత యుండనేయున్నది గదా. ఏమైనను
దాను దుర్గాదాసుచుఁబొందుట కౌరంగజేబును నుపయోగించు
కొనవలెను. అందుల కాతనిపైఁ బ్రేమ నటింపవలెను.

పాదుషావలన గులనార్, అజితునిపట్టాభిషేకమును, మహామాయ జోధపురమందుండుటను, అక్బరుపక్షమవలంబించి దుర్గాదాసు చక్రవర్తిపై నెత్తివచ్చుచుండుటను, వినెను. మహామాయ జోధపురమునందుండుటవలన మార్వాడపైదండువెడలుమనియు, మార్వాడను జయించుటకై ముందు దుర్గాదాసును బంధింపుమనియు, గులనార్ చక్రవర్తితోఁ జెప్పెను. ఆతఁడా విషయమాలోచించుటకై యావలకు బోయెను.

ఔరంగజేబీవిషయమును సేనాపతులతోఁ జెప్పెను. వారు పాదుషాతో "ప్రభూ! ఇదివఱకు జరిగిన ప్రళయసంగ్రామములో మూడువంతులసైన్యము నశించినది. మిగిలినదికూడ దుర్గాదాసు పేరువిన్న నిద్రాహారములుగూడ మాని తబ్బిబ్బుపడుచున్నది. కాన నిప్పుడు యుద్ధముచేయుట మంచిదికాదని మా మనవి"యని చెప్పిరి. పాదుషావారిని బంపి యాలోచింపసాగెను. అది యుద్ధమునకు సమయముకాదు. ఉపాయముచే దుర్గాదాసును ఢిల్లీపైకి రాకుండఁ జేయవలెను. అక్బరు సైన్యమును విడదీసిన దుర్గాదాసు సైన్య మల్పమగును. అప్పుడు దుర్గాదాసు ఢిల్లీమీఁదకు రాడు. ఈ యుపాయము నచ్చినది.

వెంటనే యాతఁడు గజేబొక యుత్తరమును వ్రాసి యది యొక సేవకునికిచ్చి యిట్లనెను. "ఓరీ! నీ పనుపూనింపఁ దగినవాని వలె నటించుచు నీ లేఖను సమరదాసునకుఁ జేర్పుము." వాఁ డట్లేయని పాదుషా యనుజ్ఞఁగొంది వెడలిపోయెను.

పాదుషాసేవకుఁడు సమరదాసు గుడారముదగ్గఱ తారట్లాడుచుండెను. సమరదాసునుచూచి వానినిఁ బట్టుకొని యాతని జేబునందున్న యుత్తరమును తీసికొని చదువుకొనెను. ఆతని యాశ్చర్యక్రోధములు మిన్నుముట్టినవి. జేవురించిన ముఖములో నతఁడాయుత్తరమును నాభటునిఁ దుర్గాదాసు దగ్గఱకుఁ దీసికొనిపోయి యా లేఖను దుర్గాదాసునకిచ్చెను. అందిట్లున్నది. 'అక్బరు రాకుమారునకు, నాయనా! నీయుక్తికి సంతోషించితిని. నీవు నీసేనాపతియుఁ, గలసి, యిట్టి వంటిపన్నాగము పన్నుట చాల మెచ్చదగినది. మనకు విరోధము లేనట్లు రాజపుత్రులకుఁ దెలియకూడదు. అచిరకాలములో దుర్గాదాసు సమరదాసుల బంధించి నాకప్పగించి నీవన్నమాటను నిలఁ బెట్టుకొనుము. నిన్ను దప్పక బాదుషాచేసెదను. జాగ్రత! ఏమాత్రమేమరినను దుర్గాదాసు చేతిలో నీప్రాణములు దక్కవు. ఇట్లు బాదుషా.'

ఆ యుత్తరమును జదివి దుర్గాదాసాలోచింపసాగెను. 'ఏమాలోచించుచుంటివ'ని సమరదాసు ప్రశ్నించెను. 'ఈయుత్తరము విశ్వాస్యము కాదని నాయనుమానా'యని దుర్గాదాసనెను. 'నీకెప్పుడును సందేహము లే. గోముఖవ్యాఘ్రములైన మొగలుల విషయములోఁగూడ సందేహము లేనా!' 'అట్లుకాదు సమర

దాసూ! అక్బరు ముఖమునూ యెరుఁగను. అతఁడిటు వంటి పన్నాగములఁ బన్నుఁగాఁడా, లేక నామమాత్రపన్నిన యుక్తియా యిది' యని దుర్గాదాసనెను. సమరదాసు క్రోధమునకు హద్దులేదు. 'దుర్గాదాసున కెప్పుడు నుపదేశములే; నేనక్బరున కాశ్రయ మీయవలదని తొలుతనే చెప్పితి. అయినను దుర్గాదాసే పట్టుపట్టి యక్బరున కాశ్రయమిచ్చినాఁడు. నేఁడును మరల నొకవిషమ ఘట్టమువచ్చినది. దానికిని దుర్గాదాసు బాధ్యుఁడగుచున్నాఁడు. దీనికి మనము సమ్మతింపఁ దగదు. సమ్మతించిన, మనగోతిని మనమే త్రవ్వుకొన్నవారిమగుదుము' అని కోపముతోఁ బలికిన పలుకులకుఁ దక్కిన రాజపుత్రులు 'మౌనమును వహించి తమ యర్ధాంగీకారమును సూచించిరి.

రాజపుత్రు లక్బరును వదలిరనువార్త వెంటనే యంతటా వ్యాపించెను. మొగలాయి సైనికులందఱు రాజపుత్రులు చంపుదురను భయముతో నెక్కడివారక్కడ చెల్లాచెదరై పోయిరి. ఈ సంగతి క్రమముగ నక్బరునకుఁ దెలిసినది. ఆతఁడు భయకంపితుఁడై కుమార్తెతోఁగూడ వచ్చి దుర్గాదాసు పాదములపైఁబడి తాను నిర్దోషిననియు, తనకేమియుఁ దెలియదనియుఁ, దనను విడువవద్దనియుఁ బ్రార్థించెను.

అక్బరు ఆక్రందనతో దుర్గాదాసు హృదయము కఱఁగినది. అక్బరు నిర్దోషియని యాతని హృదయము చెప్పుచునే యున్నది. ఆతఁడు గంభీరమైన స్వరముతో నిట్లనెను. "సోదరులారా! శరణాగతరక్షణము క్షాత్రధర్మము. అందుకే గదా శ్రీరామచంద్రమూర్తి శత్రుసోదరుఁడైన విభీషణున కాశ్రయ

మిచ్చుట. అదియునుగాక యీ లేఖయందేదియో మోస మున్నదని నాయంతరాత్మ నాకుఁ గట్టిగఁ జెప్పుచున్నది. అక్బరునట్లే చెప్పుచున్నాఁడు. శరణమిచ్చి నిరపరాధిని వదలుట మనధర్మమునకే విరుద్ధము. అక్బరున కాశ్రయమిచ్చుటకు మీరంగీకరింతురా, లేదా!" రాజపుత్రులందఱును మౌనముగ నూరకుండిరి. దుర్గాదాసు చరాలున లేచి యక్బరుచేతిని బట్టుకొని, "రాకుమారా! నీకేమియు భయములేదు, నాకంఠమునఁ బ్రాణములుండగ నీపై నీగనైన వ్రాలనీయను. మనకు సహాయము చేయుట కిచ్చగింపని వీరిదగ్గఱ నుండుటకంటె మఱియొక ప్రభువు నాశ్రయించుట మంచిది ర"మ్మనెను. అక్బరు సమరదాసును బ్రతిమాలి రజియానుమాత్రము రక్షింపుమని సమరదాసు నొప్పించి తాను దుర్గాదాసుతోఁ బోయెను. దుర్గాదాసట్లుపోవుట రాజపుత్రులకుఁ గష్టముగ నున్నను, మహామ్మదీయులమీఁదఁ దమకున్న కోపముచేతను, సమరదాసునిభయము చేతను నేమియు ననక చూచుచు నూరకుండిరి.

దుర్గాదాసు, అక్బరును వెంటబెట్టుకొని మహారాష్ట్ర దేశమునకుఁ బయనమాయెను. మహారాష్ట్రదేశమును శివాజీ కుమారుఁడైన శంభాజీ పాలించుచుండెను. ఆతఁడు గర్వి. వేశ్యాసురాధీనుఁడు. ఆతని దగ్గఱ కాబలేస్ ఖా నను నొక దళవాయి యుండెను. వాఁడు వట్టితుచ్ఛుఁడు. ఔరంగజే బిచ్చెదనన్న లంచమునకు లోఁబడి శంభాజీని బట్టియిచ్చుటకై వాఁడు ప్రయత్నములు చేయుచుండెను. శంభాజీ సహాయముతో నక్బరును

సింహాసన మెక్కింపవలెనను నూహతో దుర్గాదాసు శంభాజీ దగ్గఱకు బయల్దేరెను.

అక్బరుమహారాష్ట్ర దేశమునకుఁ బోవుచుండెనను వార్త పాదుషాకుఁ దెలిసినది. ఇంతవఱకొక శంభాజీయే పాదుషాను ముప్పతిప్పలు పెట్టుచుండెను. అక్బరు శంభాజీతోఁగలసిన నిక వారి నిద్దఱను దాను సాధింపలేడు. కావున నక్బరును శంభాజీతోఁ జేరకపూర్వమే బంధింపవలెను. తా నక్బరు మీఁదకుఁ బోయిన, విజయులైన రాజపుత్రులు ఢిల్లీపై బడుదురేమో! అక్బరుమీఁదకు సైన్యముల బంపవలెనన్న ముందుగా రాజపుత్రులతో సంధిచేసుకొనవలెను. పాదుషా దుర్గాదాసు తరువాత సేనాపతియైన సమరదాసుదగ్గఱకు రాయబారినంపెను. అజితుఁడు పిన్నవాఁడగుటవలన సర్వవిషయముల సమరదాసే చూచుచుండెను. పాదుషాను నమ్మక సమరదాసు సంధినిఁ దిరస్కరించెను. చివర కేమైన పణమునుంచినచో సంధికంగీకరింతుమని సమరదాసు పలికెను. శాంతిప్రియుఁడైన దిలేర్ ఖాన్ తనపుత్రుల నిరువుర పణముగనుంచుట కంగీకరించినందువలన సంధికుదిరినది. దానికి షరతులివి. పదునేనుసంవత్సరముల వఱకుఁ బాదుషా, జిజియాపన్ను, దేవాలయ, గోనాశనము, రాజపుత్రరాజ్యాక్రమణ, మున్నగు నకార్యముల మానివేయవలె. అవసరము వచ్చినపుడు రాజపుత్రులు తమతమ సైన్యములతోఁ బాదుషాకు సహాయముచేయవలయును. ఈ నియమముల కేమాత్రము భంగమువచ్చినను దిలేర్ ఖాన్ పుత్రులు బ్రతుకరు.

సంధియనంతరము పాదుషా గొప్పసైన్యముతో నక్బరును బట్టుకొమ్మని మహాజీమును బంపెను. మహాజీము దుర్గాదాసునుఁ ద్రోవలో నడ్డగించి, యక్బరును బట్టియిచ్చుటకై లక్షవరహాలను లంచముగ నాతనికి గ్గఱకుఁ బంపెను. దుర్గాదాసందులో నొక్కగవ్వయైన ముట్టుకొనక సర్వమక్బరునకు సమర్పించెను. ఓహో! స్వార్థత్యాగీ! నీచరిత్రలో గడచిన పుటలోఁ గంటె, గడువబోవు ప్రతిపుటలోను స్వార్థత్యాగము వెల్లివిరియుచున్నదికదా!

దుర్గాదాసు దేశమును వదలివచ్చునపుడు ఐదువందల రాజపుత్రు లతనిని దైవముగఁ గొల్చువార లాతనివెంటవచ్చిరి. ఆస్వల్పసైన్యముతో నక్బరును వెంటనిడుకొని యర్ధరాత్రమున దుర్గాదాసు మహాజీముసైన్యమును భేదించుకొని పోవుచుండెను. మొదటకొంచెము ఘర్షణజరిగినది. దుర్గాదాసు ఖడ్గధారలరుచి తెలిసిన మొగలులు, కిక్కురుమనక త్రోవనిచ్చిరి. మహాజీమిదియంతయుఁ జూచుచునేయున్నాఁడు. సైన్యమును, ప్రోత్సహించుటలేదు. దుర్గాదాసు, ఆతని వెనుక యక్బరు. తానును, అక్బరు నొకతండ్రిబిడ్డలు. తాను సోదరుని బంధించుటకో, లేక సంహరించుటకో వచ్చినాఁడు. దుర్గాదాసు రాజపుత్రుఁడు; అతనికిఁ దమకు సంబంధమే లేదు; అయిన నాతఁడు తన సోదరుని రక్షించుటకై, మాతృదేశమును విడిచి, ప్రాణములనుగూడ విడుచుటకు సిద్ధముగ నున్నాఁడు. అక్బరుయొక్క యమాయకమైన మోమును జూచినంతనే, ఈయాలోచనలతో మహాజీము మనస్సు ద్రవించినదియై యది కన్నులనుండి ప్రవహించినది. అందువలన

సైన్యము నేమాత్రము ప్రోత్సహింపక సూజిము సూసముగ నుండెను.

ప్రతిరోధమెక్కడుగ లేకపోవుటచే దుర్గాదాసు మొగల్ వాహినినిఁ దేలికగ నుత్తరించి, పాలీగఢమునందున్న శంభాజీ దగ్గఱకుఁ బోయెను. దుర్గాదాసుని కీర్తిప్రతాపములను విని యుండుటచే శంభాజీ యాతనికి సహాయము చేయుదునని వాగ్దానము చేసి వారికి వసతుల నేర్పఱచి తాను స్త్రీ మద్యములతోఁ గాలము గడుపుచుండెను. శంభాజీప్రవర్తన యేమాత్రము గిట్టక పోయినను దప్పక దుర్గాదాసచ్చటనే యుండుట కంగీకరించెను.

కొంతకాలము గడచినది. పాదుషా క్రొత్తసైన్యమును సమీకరించి దానికి, ఆజిమును నాయకునిగఁ జేసి, యక్బరును బట్టుకొనుటకై మహారాష్ట్ర దేశముపైకిఁ బంపెను. మహారాష్ట్రులకును, మొగలులకును యుద్ధము జరిగినది. తొలుత మొగలులు పర్వతప్రదేశముల నాక్రమించినను, మహారాష్ట్రులు క్రమముగ నాభూముల స్వాధీనము చేసికొనిరి. యుద్ధములో శంభాజీని జయించుట యసాధ్యమని యెంచి పాదుషా, కాబలేస్ ఖానుకు నైదువేలవరహాల లంచమిచ్చి శంభాజీని, అక్బరును, దుర్గాదాసును బట్టియిచ్చిన లక్షవరహాలను, ఒక జాగీరును నిచ్చెదనని యాశఁ గొల్పెను. అందులకై కాబలేస్ ప్రబల ప్రయత్నము చేయుచుండెను.

దుర్గాదాసొకనాడు తనశయనమందిరమున శయనింపఁ బోవుచుండెను. అప్పటికి రాత్రి యైదుగడియలప్రొద్దుపోయినది.

ఇంతలో నొకరాజపుత్రుడు వచ్చి నమస్కరించి దుర్గాదాసున కొకయుత్తరమిచ్చెను. అందిట్లున్నది. 'మాన్యశ్రీ, రాజపుత్ర సర్వసైన్యాధ్యక్షుల సన్నిధికి. ఆర్యా! రాణా రాజసింహుఁడు పుత్రశోకముచే దివమలంకరించినాఁడు. ఆతని యనంతరము రాణాయయిన జయసింహుఁడు ద్వితీయభార్య కమలవలలోఁబడి పాదుషాతో నవమానకరమైన సంధిచేసికొని కుమారుఁడైన యమరునకు రాజ్యమిచ్చి కమలతోఁగూడ జయసముద్ర ప్రాంతమున నివసించుచున్నాఁడు. ఇదియిట్లుండఁ బాదుషా కుత్రదారులకు లంచమిచ్చి, ప్రస్తుత సేనాపతియు, మీసోదరుఁడు నైన సమరదాసును జంపించినాఁడు. ఇంతకుముందే మన రాణి, కుమారుఁడు యుక్తవయస్కుఁడగుటచేఁ బ్రభుచిహ్నములతో సహగమనము చేసినది. అజితుఁడనుభవము లేనివాఁడగుటవలన రాజ్యవ్యవహారముల సరిగఁ జూడలేకున్నాఁడు. సర్వవిధముల మన రాజ్యమున నరాజకము ప్రబలిపోవుచున్నది, మందబుద్ధులమై వెనుక మీమాటనుఁ దిరస్కరించియుంటిమి. అందులకై మిమ్ము శతశః క్షమార్పణలతోఁ బ్రార్థించుచున్నాము. ఈ లేఖ చేరిన వెంటనే వచ్చి మన రాజ్యమును, బ్రభువును గాపాడవలసినది. ఇట్లు రాజపుత్ర సరదారులు." క్రిందసంతకములు మూడువందల దాకనున్నవి. లేఖను జదువుచున్న దుర్గాదాసు నేత్రములనుండి నీరు జలజల వర్షించినది. తనతలిదండ్రుల కిద్దరే పుత్రులు. తాను, సమరదాసు. సమరదాసు వివాహితుఁడు. తాను దేశసేవకాటంకము కలుఁగునని వివాహమాడలేదు. ఇంతవఱకుఁ దనకుఁ దమ్ముడు, తమ్మునకుఁదాను సహాయులు. తమ్ముఁడు స్వర్గస్థుఁ

డైనాఁడు; ఇఁకఁదానేకాకి. కొంచెమాలోచించినాఁడు. తన బహిఃప్రాణమైన యజితుఁడు చిక్కులలోనున్నాఁడు. ఆతనిని ప్రభువు తనకప్పించిపోయినాడు. సర్వవిధముల నాతనిరక్షింప వలసిన బాధ్యత తనయందున్నది. తానువెళ్ళకచో నక్బరొకాకి యగును. తనవాగ్దానము వమ్మగును. వెళ్లుటయా! వెళ్ళక పోవుటయా! యని పచారుఁలుచేయుచు దుర్గాదాసు తీవ్రముగ నాలోచించుచుండెను. ఇంతలో నొకస్త్రీ యార్తనాదము చేయుచు వాతధూతగాలలతికవలె వణకుచువచ్చి దుర్గాదాసు పాదములపైఁ బడెను. “అమ్మా! నీకేమియు భయములేదు. నిన్నుతప్పక రక్షింతు”నని చెప్పుచున్న దుర్గాదాసు మాట లామె కర్ణపుటములసోకనైన లేదు. ఇంతలో కాబలేఖాను ప్రేరణచే నొకసంసారస్త్రీనిఁ దరుముకొనివచ్చుచున్న శంభాజీ ఖడ్గహస్తుడై లోనఁ బ్రవేశించి యువతికిఁ దనకు మధ్యనున్న దుర్గాదాసునుఁ దొలఁగిపొమ్మనెను. దుర్గాదాసు తొలఁగక యామె తననుశరణుజొచ్చినదనియు, నామెను రక్షించుట తన విధియనియుఁ జెప్పెను. శంభాజీ గుడ్లెఱ్ఱజేసి ‘తొలగిపొమ్ము, లేకున్నఁ, గత్తిపట్టు’మని హుంకరించుచు యువతిదగ్గఱకుఁ బోవు చుండెను. తనయండనున్న యనాథబాలికవైపు నిర్లక్ష్యముతోఁ బోవుచున్న శంభాజీనిఁ జూడగనే దుర్గాదాసునకు, రక్తముడు కెక్కినది. అంతర్గతమైన క్రోధము పైకుబుక “ఓయీ! శంభాజీ నీకతిథిగానుండుటవలన నింతకాలము సహించితిని. నన్నుఁ గొట్టుటకుఁ గత్తికూడ కావలెనా” యని శంభాజీపైకి దూకి శంభాజీవిసరిన కత్తివ్రేటును జాకచక్యముగఁ దప్పించుకొని

ప్రొద్దుగ్రుంకినది. ఎనిమిదిగడియల ప్రొద్దుపోయినది. ఆనాఁడు శుక్రవారము. పాదుషా యానాఁడుపవసించి నమాజు చేయునుగానఁ దనమందిరమునకు రాఁడు. అంతకంటె మంచిసమయము దొరుకదు. ఎన్నివిధముల నలంకారములుచేసినను నానాఁడామెకు నచ్చలేదు.పదకొండుగడియలప్రొద్దుపోవునప్పటి కామెయలంకారము పూర్తియయినది. అప్పటికి రాజధాని యంతయు మాటుమణగినది. ప్రాణసమానయగు నొకచేటికవెంటరాఁ గులనారాయంధకారమునఁ బ్రియునిఁ గలసికొననేగెను. త్రోవలో నడ్డుపెట్టినవారికిఁ బాదుషాముద్రికను జూపుచుఁ గొలఁదిసేపటిలో గులనార్ దుర్గాదాసుబంధింపఁబడిన గది దగ్గఱకుఁ బోయెను.

కారాగారములో దుర్గాదాసు విచారించుచుఁబచారులు చేయుచుండెను. అతనికిఁ బ్రాణములపై దీపిలేదు. అక్బరునకు, నజితునకుఁ దానుజేయవలసిన సహాయములు మిగిలిపోయిన వనియే యాతనిచింత. అజితున కాపదలు కలుగకుండఁ జేయుమనియాస్వామిభక్తుఁడుకనులుమూసికొనిభగవంతునిధ్యానించుచుండెను. గులనార్ కారాగారము దగ్గఱకు వచ్చి కావలివాండ్రకుఁ బాదుషాముద్రికఁజూపి తాళముతీయించి లోనికిఁ బోయెను. దుర్గాదాసు కండ్లు తెఱచిచూచునప్పటికి జగన్మోహినియైన గులనార్ దుర్గాదాసునకెదురుగ నిలఁబడి యమృతదృక్కుల నాతనిపైఁబ్రసరింపఁజేయుచుండెను. దుర్గాదాసాశ్చర్యపడి. 'ఎవరమ్మా! మీ'రని ప్రశ్నించెను. ఆసంబోధన యామె హృదయమున కీటెవలె గ్రుచ్చుకొన్నది. సమాధానము రాక

పోవుటవలన నాతఁడదే ప్రశ్న మరల వేసెను. ఇఁక సహింపక గుల నార్ "మహావీరా! నేను వయసున మీకంటె కొంచెము చిన్న నే. నన్నట్లు సంబోధింపవలదు. నేను భారతసార్వభౌముని పట్టమహిషిని.. నా పేరు గులనా"ర నెను. దుర్గాదాసున కేమియుఁ బాలుపోలేదు. ఆమెకుఁ దనతో నేమిపని? అందులో నర్థరాత్రము నన్! దుర్గాదాసున కేమియుఁబాలుపోక 'మీరిచ్చటి కెందులకు దయచేసితిర'ని ప్రశ్నించెను. గులనారిట్లనెను.'మీచే నేకవచన మునఁ బిలిపించుకొనవలెనని నాయూహ. నా ప్రాణేశ్వరులైన మిమ్ము బందిఖానానుంచి విడిపించుటకువచ్చితిని.' దుర్గాదాసు తెల్లఁబోయి 'నేను మీకు ప్రాణేశ్వరుఁడనా!' యనెను. 'కాక మతేమి! ఆనాఁటియుద్ధరంగములోఁ జేతికిఁజిక్కిన నా ప్రాణముల రక్షించినది మీరుకదా! కాన నా ప్రాణముల కధినాథులు మీరే. ప్రాణేశ్వరుల బంధనమును స్వహస్తములతో విడిపించుట యెంత గౌరవము!'

దుర్గాదాసామెయుద్దేశమును గుర్తించి "యది యసంభ వము. ఇది పాదుషాకుఁదెలిసిన మీప్రాణములు దక్కవు. పొండ"ని పలికెను. గులనార్ దగ్గఱకువచ్చి "పాదుషాయెవ్వరు! నన్నడ్డుటకు! నాతర్జనీసంచలనముతోఁ బాదుషాలు తలక్రిందు లయ్యెదరు. నాయపాంగవీక్షణములతో సామాన్యులు పాదుషా లయ్యెదరు. క్రోధఘూర్ణితమైన నాదృష్టి యెటుప్రసరించునో యాప్రదేశ మెంతపటిష్ఠమైనను నగ్నిపాలే. అనురాగదయాశీతల మైన నాయాలోకన మెటు నడచునో యాప్రదేశ మెంతదుర్బల మైనను వజ్రదుర్భేద్యమే. గులనారున కోటమిలేదు; ఆమె

యెవ్వరికి భయపడడు; కాలాహిదంష్ట్రిలలో నామె సయ్యాట లాడును; ప్రళయసాగరవీచికలలో నామె జలక్రీడలాడును; మహాత్మా! పాదుషావలన భయపడకుము. నేను మీయండ నుండ బాదుషా శక్తిహీనుడు. వ్యర్థుడు" అనెను.

దుర్గాదాసేమియో చెప్పఁబోవుచుండ గులనారాతని కత్యంతసమీపమునకువచ్చి, "సుందరా! చల్లకువచ్చి ముంత దాచనేల? సాహస, పరాక్ర, మౌదార్య, రూపములఁ జూచి పదిసంవత్సరముల పైనుండి మిమ్ముఁ బ్రేమించుచున్నాను. యుద్ధమున మిమ్ముఁజూచుటచే నాకోరిక రూపొందినది. అప్పటి నుండి జరిగినయుద్ధములు, నయినహత్యలు నన్నియు మీకొఱకుఁ జేయింపఁబడినవే. అప్పుడంకురప్రాయముగనున్న నాసంకల్పము వృక్షమై నేడు ఫలింపనున్నది. మీయంగీకారమే మిగిలిన"దని తెలియని తమకముతో నామె దుర్గాదాసువక్షమున వ్రాలెను. ఆ సంఘటన గులనారునకుసుధాపూరసేచనముగను, దుర్గాదాసు నకు సర్పవృశ్చికసర్పణమువలె నుండెను. ఆమె వక్షస్థలముపై వ్రాలగనే యాతఁడు చటుక్కునఁ బ్రక్కకుఁదొలగెను. ఆధారము తొలుగుటచే నామె యించుక తూలి గోడనాధారముగఁ జేసికొని నిలచినది. 'మహావీరా! నీకై యెన్నియో యిడుములఁ బడితిని; నన్నుఁదిరస్కరింపనీకున్యాయము కాద'ని బ్రతిమాలినది; 'నీవు రాజపుత్రసామాన్యుఁడవు; నిన్ను రక్షించి నవఖండమండ లాధిపతినిఁ జేయుదున'ని యాశపెట్టినది. 'నీప్రాణములు నాచేతి నున్నవి. నామాటవిననిచో నిన్నుఁ జిత్రవధచేయింతు'నని బెద రించినది. ఎన్ని చెప్పిన నొక్కటేమాట. హైందవులకుఁ బరనారి

మాతృసమాన. ఈభావము హిందువులకు వెన్నతోఁబెట్టినవిద్య. నవఖండమండలాధిపత్యము నేకాదు, సమస్తలోకాధిపత్యమును గూడ ధర్మముతోఁ గాలఁదన్నఁగలను. ఆధిపత్యమే నేనిచ్ఛగించిన రాజపుత్రస్థానమునకంత కేనాఁడో మహారాణానయియుండెడివాఁడను. మహారాణీ! నీవేమితలపెట్టితివో కొంచెము విచారించుకొనుము. నీవుకోరుసుఖము క్షణికము. నీకురానున్న యపకీర్తి శాశ్వతము. హిందూజాతిలోఁ బుట్టిన నీచరిత్రలో నెన్నిమార్పులు వచ్చినవో సింహావలోకనము చేసికొనుము! నీవుచేయించిన యకార్యములకు మితిలేదు. వాటికన్నిటికిను త్తరవాది యెవరు? నీవేయని యెప్పుడైన నాలోచించితివా? నీవు నాశనమగుచు నన్నును నాశనముచేయఁగోరుచున్నావు. నిష్కళంకప్రేమకిదియేనా లక్షణము? ప్రేమికుని దుష్కీర్తిపాలు చేయుటయేనా నీపవిత్రప్రేమలక్ష్యము? మహారాణీ! పవిత్రప్రేమ సుధాపూరమధురము. దానికినాశనములేదు. అది దైహికసుఖముల నాశింపదు. అది సాధించలేనిదేదియు లేదు. నీవీయడియాసల వదలుము. నిరంతధ్యేయమును, నిహాపర సాధకమునైన, వ్యక్తిత్వమును నిలఁబెట్టుకొనుటయే నీకును, నాకును, సమస్తజగత్తునకును లక్ష్యము. దానినేమఱకుము." అని దుర్గాదాసువచించెను.

దుర్గాదాసు నోటివెంటవచ్చు నా మహావాక్యములకు గులనార్ మాఱిపోయినది. పర్వతశిఖరముకంటె నెత్తయిన నాతనిభావములకు, సముద్రముకంటె లోతయిన యాతని హృదయమునకు, నమృతముకంటెఁబవిత్రమయిన యాతని

చిత్తవృత్తికి నామె వాక్యములర్పించినది. ఆతనిస్వార్థత్యాగమునకు, ధర్మరక్తికి నామెకనులు మెఱసినవి. ఆమె చేతులుజోడించి 'మహాత్మా! నా యెదలో నుదయించిన కామాతిశయము నీ యుపదేశముచే నస్తమించినది. నేను మహాపాపురాలనుగనుక నే నీపవిత్రప్రేమలో భాగము పంచుకొనలేకపోతిని. – ఉత్తరజన్మ మందైన మీకష్టసుఖములలో భాగస్వామినిగా నన్ను జేయుమని భగవంతునిఁ బ్రార్థించెద. మహాశయా! మిమ్ము బంధవిముక్తులనుగఁ జేయుచుందు. ఈ కోరిక తిరస్కరింపకుఁడు. ఏమాలోచించుచుంటిరి? పాఱిపోవుటకిష్టము లేకనా? మోసగానిని మోసముతోఁ జయించుట రాజనీతి' యని దుర్గాదాసును బంధవిముక్తునిఁ జేసి యొకగుఱ్ఱమునిచ్చి యెవ్వరియడ్డు లేకుండుటకుఁ బాదుషాముద్రనిచ్చి యిట్లనెను. "మహాశయా! మీబోధచే నాహృదయము ప్రశాంతమయినది. ఈజీవితముపైనాకేహ్యము జనించినది. కొలఁదిరోజులలో నామరణమును మీరువినఁగలరు. ఈ యభాగినిఁగుఱించి యొకకన్నీటిబొట్టు విడువుఁడు. అదియే నాకుఁబదివేలు" అనఁడిచెను. దుర్గాదాసామెయందలి పరిణామమునకుఁ బవిత్రప్రేమకు నాశ్చర్యపడి యామెవద్ద శెలవుతీసికొని యశ్వమునారోహించి వెడలిపోయెను. గులనార్ పాశ్చాత్తప హృదయముతో స్వభవనమునకు వెళ్ళినది. ఏమియుఁదోచలేదు. జాగ్రత్ స్వప్నములయం దామెకు దుర్గాదాసుతోనే కాలక్షేపము. ఇప్పుడు గులనార్ పవిత్రహృదయములో నౌరంగజేబునకేమాత్రము స్థానములేదు. తనసంగతి పాదుషాకుఁ దెలియును. పాదుషా తనను జిత్రవధచేయించును. ఆతనిచేఁ జంపఁ

బడుటకంటె స్వయముగఁ జచ్చుటయే గౌరవమని గులనార్ విషముఁదిని దుర్గాదాసునుధ్యానించుచు సమసిపోయెను.

దుర్గాదాసేకాకియై శంభాజీనగరమున కేగెను. కాబలేస్‌ఖాన్, దుర్గాదాసు శంభాజీలను జక్రవర్తికిఁ బట్టి యిచ్చి యక్బరునుపట్టుటకై యాలోచించుచుండెను. మరణించు ననుకొనుచున్న దుర్గాదాసు బ్రతికినవ్వార్తఁ జూచి కాబలేస్ హడలిపోయెను. అతఁడు గడగడ వడకుచుఁ బ్రాణభీతిచే దుర్గాదాసుకాళ్ళపైఁబడెను. దుర్గాదాసు వానిఁ దన్ని దెబ్బలఁగొట్టి వానిప్రయత్నములన్నియు నక్బరునకుఁ దెలియఁజెప్పి యాతనిఁ దనతోఁగూడ మార్వాడకు రమ్మనెను. అక్బరు జీవితముపైనాసి, మక్కాకుఁబోదుననియు, రజియానుమాత్రము రక్షింపుమనియు దుర్గాదాసును బ్రార్థించి యొప్పించి తాను మక్కాకుఁ బోయెను.

దుర్గాదాస్ మార్వాడలో నడుగిడఁగనే యాతని కన్నులు చెమర్చినవి. ఎన్నాళ్ళకెన్నాళ్ళకుఁ దిరిగి మార్వాడలో నడుగిడుట! ఆతనిరాకకు మార్వాడయే కాదు! యావద్రాజపుత్రస్థానము హర్షించినది. దుర్గాదాసేకాకియై తన పిన్న ప్రభువును జూడ రాజమహాలున కేగెను. అజితుఁడు గనిపించినంతనే భక్త్యావేశముతో దుర్గాదాసు ముందునకుఁబరుగిడి "మహారాజా!" యని పిలచెను. ఆనందాతిరేకముచే నాతనికంఠము రుద్ధమయినది. నిర్భరహర్షముతో దుర్గాదాస జితుని పదవందనము చేసెను. అజితుఁడునుఁ దన ప్రాణ, రాజ్య దాతయైన దుర్గాదాసును లేవదీసి యెక్కుడుగ గౌరవించెను. కాశిమ దుర్గాదాసుని

యాగమనవార్తవిని త్వరితముగవచ్చి, "మహారాజా!"యని పిలుచుచు నమస్కరించెను. దుర్గాదాసాతని సస్నేహముగ లేవ నెత్తిగౌరవించెను. కాశిమప్పటివఱకు నజితునిఁగాపాడుచు నచ్చ టనేయున్నాడు.

సమరదాసుమరణానంతరము రజియా యజితునిరక్షణ లోనికివచ్చినది. ఇరువురుసమవయస్కులు. యౌవనప్రాదుర్భావ మైనంతనే వారిలోఁ బరస్పరముప్రేమ యుదయించినది. ఆ ప్రేమాతిశయములో వారు జాతులనుమరచిరి. ప్రియా! యని పిలచుటకు నజితుఁడలవాటుపడెను. ప్రియతమా! యనుటకు రజియా యలవాటుపడెను. వారిప్రేమ చుంబన, పరిష్వంగన ములలోనికిఁబోయినది. మహారాణాను గాదనువారెవరు! క్రమముగ నీవిషయము దుర్గాదాసునకుఁ దెలిసినది. అతని యనుతాపమునకుఁ గొలఁదిలేదు! మచ్చలేని మహారాజవంశ మునఁ బెనుమచ్చదాపురించినది. ఈమచ్చను మాపని తనజన్మ మేల? రజియానిచ్చుటనుండి తప్పించిన నీమచ్చపూయఁగలదు. వెంటనే దుర్గాదాసు. రజియా యిచ్చుటనున్నదనియు, మూడు దుర్గముల నిచ్చినచో నామెనిత్తుననియు, నౌరంగజేబునకుఁ గబురంపెను. రజియాయన్నఁ బాదుషాకమితప్రేమ. అజితుఁ డీయనిరాకరించుటచే నాతఁడు చేయునది లేక యూరకుండెను. గులనార్ విషయములో దుర్గాదాసుని మహానుభావతను గుర్తిం చిన పాదుషా మాఱుమాటాడక మూఁడుదుర్గములు దుర్గాదాసు స్వాధీనముచేసెను. దుర్గాదాసొకనాడు రజియా కక్బరును

చూపెదనని చెప్పి యజితుని బాహుపంజరమునుండి తప్పించి రహస్యముగ నామెను బాదుషాకప్పగించెను.

అజితుఁడు సాయంత్రము వాహ్యాళికిఁ బోవుచు రజియాను బిలచెను. ఆమె పలుకలేదు; ఎంత వెదకినఁ గనుపించలేదు. దుర్గాదాసామెను దీసికొనిపోయినాఁడని విని యాతని బిలిపించి యజితుఁడు రజియావిషయమడిగెను. దుర్గాదాసు కరములు మోడ్చి "ప్రభూ! రజియాతోఁ బొత్తు మీకుఁ గుదరదు. అది మీవంశాచారమునకుఁ గేవలవిరుద్ధము. ఈవిషయమున మీరు చెప్పినను వినరను నుద్దేశముతో, నశ్రమమున మూడు దుర్గముల స్వాధీనము చేసికొని యామెను బాదుషాకప్పగించితిని. స్వతంత్రించినందుకు క్షమింపు"డని మోకరిల్లెను.

రజియాను దసకెడము చేసిన దుర్గాదాసుపై నజితున కమితాగ్రహము కలిగినది. విచక్షణాజ్ఞానము పోయినది. ఆవేశముతో నజితుఁడు కన్లెఱ్ఱచేసి, ఆమహాత్ముని, ఆరణరంగ పండితుని, ప్రభువుకొఱకై, దేశముకొఱకై, వివాహమును గూడమాని, ప్రతిరక్తబిందువును స్వామిసేవలో వ్యయించిన మహా స్వార్థత్యాగిని, యావద్భారతఖండమును, సుందరీశిరోమణియైన గులనారును తృణకముగా నెంచిన మహాత్ముని, శరీరసౌఖ్యమును వర్జించి, తనరక్షణకొఱకై, గుఱ్ఱపుజీనే గృహముగాఁ గాలియుఁ గాలని మొక్కజొన్నకండెయే యాహారముగా, రణరంగమే విహారమందిరముగ సంచరించిన ప్రభుభక్తుని, దనవంశప్రతిష్ఠ నిలుపుటకై రజియానుఁ బాదుషాకప్పగించిన నేరమునకై,

కాలితోఁదలపైదన్ని విశ్వాసఘాతకుఁడని నిందించి శాశ్వతముగ మార్వాడపడలిపొమ్మని యాజ్ఞాపించెను. ధీరగంభీరుఁడైన దుర్గాదాసు తొణకలేదు! బెణకలేదు. రెండుసమయముల్లే యుండి యజితునకు నమస్కరించి శెలవుతీసికొని నెమ్మదిగ బరువెక్కిన హృదయముతో వెడలిపోయెను. తానెట్లయిననుఁ బ్రభువంశమునకు ప్రతిష్ఠ వాటిల్లకుండఁ జేయుటయే యాప్రభు భక్తున కానందము.

దుర్గాదాసు వెడలిపోయెను సేపటికి విషయము కాసిమునకుఁ దెలిసినది. ఆస్వామిభక్తుని హృదయమున భూకంపము పుట్టినట్లినది. వెంటనే కాశిమజితునిదగ్గఱకుఁ బోయి "మహారాజెక్కడ?" యని గద్దించెను. కాశిమునకు మహారాజు దుర్గాదాసని యందఱకుఁదెలిసిన విషయమే. సమాధానము చెప్పలేక యజితుడు దధోముఖుడైయుండెను. కాశిము సింహామువలెగర్జించి, "ఛీ! కృతఘ్నా! ఎంతమాటాడితివి? నామహారాజు విశ్వాసఘాతకుడా? ఆమహారాజే విశ్వాసఘాతకుఁడైనచో నీవు పురిటింటిలోనే చచ్చియుందువు. నామహారాజు కృతఘ్నుఁడా! అష్టకష్టములుపడి నిన్నింతవానినిఁ జేయుటయేనా యాతనికృతఘ్నత? నీవంశప్రతిష్ఠకై, నానకష్టగిలిపట్టునని తెలిసియు రజియానుఁ బాదుషాకప్పగించుటయేనా యాతనికృతఘ్నత? చేతికిదొరకిన మహాసామ్రాజ్యమును నీకొఱకై కాలఁదన్నుటయేనా నా మహారాజుకృతఘ్నత? అయ్యో! నామహారాజెట్టిస్వార్థత్యాగి. ఎంతటిమహానుభావుఁడు; అట్టివానినిఁ గృతఘ్నా యననీనాలుక

వేయితునకలుకా దేమి! అమహారాజు పవిత్రశిరమును దన్నిన నీకాలు వేయితుండెములుకా దేమి! నీపాపిష్టిముఖమును జూచిన నాకును నపవిత్రత సోకును. నామహారాజు ఛాయసోకినను, గాలితగిలినను, బంచమహాపాతకములుకూడఁబటాపంచలగును. నేనామహారాజుదగ్గఱకే పోవుచున్నాను. నీకర్మ నీవనుభవింపు" మనుచు వెనుదిరిగి చూడక పోబోయెను. అజితుఁడు కాశిము చేతిలోఁ జెరుఁగుటచే నిరువురకుఁ బిత్రుపుత్రభావముండెను. 'కక్కా! నాయీతప్పుక్షమింపుమని' యజితుఁడేదియో చెప్పఁ బోవుచుండ, 'ఖబడ్దార్, నన్నుఁ గక్కాయని పిలువకుముఁ నీవంటి పాపిష్ఠునకు నేనుగక్కను గాన'ని కాశిము చరచరఁబోయెను.

జయసముద్రప్రాంతముననున్న జయసింహుఁడు దుర్గాదాసుని వృత్తాంతమును విని తనయుద్ధజీవిత విశేషమును గడపుమని ప్రార్థనాపూర్వకముగ దుర్గాదాసునుగోరెను. కాశిముతన మహారాజు వార్ధక్యమునఁ బరుని పంచ నుండుట కంగీకరింపక దుర్గాదాసుతో నిట్లనెను. "మహారాజా! మీకు రాణాగారి షడ్రసోపేతమైన భోజనము కావలెనా? లేక యుడికియుడకని, కాలియుగాలని కాశిముసంపాదించిన యన్నము, రొట్టెయుఁ, గావలెనా? మీకు మహారాణాపాదములపైనుంచుదురా? నాతలపై నుండసచ్చగింతురా?" ఆనందబాష్పములతో దుర్గాదాసు "కాశిమును గాగిలించుకొని 'సోదరా! నీరొట్టెయే నాకమృతతుల్య' మనెను. అదిమొదలుకొని యామహాత్ముఁ డెందఱు ప్రార్థించినను, జివరకజితుఁడు పాదములఁబడి వేడినను నెచ్చటికేఁబోక

మార్వాడబయటనున్న పూరిగుడిసెలోఁ గాశిమ్‌చే సేవింపఁ బడుచుఁ బోషింపఁబడుచు జీవితశేషమును గడిపెను.

మహాత్మా! మహాస్వార్థత్యాగీ! నీబోటిమహాత్ములు జగత్కల్మషమునుఁ గడుగుటకై యప్పుడప్పుడు కారణజన్ము లుగ జన్మించుచుందురు. నీజన్మచే భారతాంబకుక్షి ఫలించినది. మహాస్వార్థత్యాగీ నీకివే మాజోహారులు.

ఓం తత్సత్.

సంపూర్ణము

---

శ్రీ పరాశక్తి ప్రింటింగువర్క్సు, తెనాలి.

---

# Swartha Thyagi

( Historical Novel )

RAJAHAMSA PUBLICATIONS
HYDERABAD (Dn.) • TENALI

Price Rs. 1-2-0